ఎమెస్కో

# సనాతన ధర్మం

ప్రవచనం

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ



పూజ్య గురుదేవులు తమ అమృత ప్రవచనాలను అక్షర రూపంలో కూర్చడానికి అనుమతించారు. వారి ఈ అనుగ్రహాన్ని నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తూ పూజ్యగురు దంపతుల చరణాలకు శతసహస్ర పాదాభివందనాలతో...

**శ్రీమతి ఆర్. జయలక్ష్మి**

# సనాతన ధర్మం

**మ**నం సంకల్పం అని ఒకటి చేస్తుంటాం. ప్రతి రోజూ పూజ చేసేటప్పుడు దేశకాలసంకీర్తనమూ అంటారు. అందులో భరత వర్షే, భరత ఖండే అని చెప్తుంటాం. దేశమూ, కాలమూ ఈ రెండూ ప్రధానంగా దేనికొరకు అంటే ధర్మానుష్ఠానం కొరకు. ధర్మం ఎవరు నిర్వర్తించాలి? ఒక్క మనుష్యునికే ధర్మం. ఆ ధర్మం నిరంతరమూ మారిపోతూ ఉంటుంది. మిగిలిన వాటికన్నిటికీ ఒకటే ధర్మం. తిర్యక్కులకు ప్రత్యేకించి పశువులకూ, పక్షులకూ అన్నిటికీ ఒకటే ధర్మం, పశుధర్మం అంటారు. పశుధర్మ నమో ప్రీతిం అంటాడు దేవీభాగవతంలో వ్యాస భగవానుడు. పశువులకి ధర్మం ఒక్కటే. ఆకలేస్తే తినెయ్యడం, దాహమేస్తే తాగడం, కామం కలిగితే సంభోగించడం, నిద్రవస్తే పడుకోవడం, కోపమొస్తే కుమ్మడం, అంతే వాటి ధర్మం తప్ప వాటికి ఇతరవిధాలైన ధర్మం లేదు.

ఇతరవిధాలైన ధర్మం అన్న మాటను మీరు కొంచెం జాగ్రత్తగా పరిశీలన చెయ్యాలి. ఏ ధర్మాన్ని అనుష్ఠించిన కారణంచేత ఇంక మళ్ళీ శరీరంలోకి రావలసిన అవసరంలేని స్థితిని పొందుతాడో, అటువంటి ధర్మాచరణం చెయ్యవలసిన స్థితి కానీ, అధికారం కానీ, ఇతరప్రాణులకు కల్పించబడలేదు. ధర్మానుష్ఠానమంతా ఎవరి కొరకు అంటే కేవలం మనుష్యుని కొరకు. మనుష్యజాతి అంతా ఎక్కడుంటుందీ అంటే ఒక్క భూలోకంలోనే. భూలోకానికి పైన ఊర్ధ్వలోకాలు. భూలోకానికి కింద అధోలోకాలు. మధ్యలో ఉండేది భూలోకం. మళ్ళీ ఈ భూలోకానికంతటికీ కూడా ధర్మాచరణం కానీ, కర్మాచరణం కానీ, యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించడం కానీ, అధికారం ఎక్కడున్నదీ అంటే ఒక్క భరతవర్షే, భరతఖండే, జంబూద్వీపే. వేదం స్పష్టంగా ఆ మాటలు చెప్పింది. ఇక్కడ మాత్రమే కర్మానుష్ఠానం,

ఇక్కడ మాత్రమే యజ్ఞయాగాది క్రతువులు. తప్ప ఇతరమైన ప్రదేశాల యందు భూమండలంలో ఈ క్రతువులు చెయ్యడానికి యోగ్యమైన ప్రదేశాలు లేవు. మీరు నన్నొక మాట అడగవచ్చు. ఈ భూమి అంతా కూడా పరమేశ్వరునిచేత సృష్టించబడినదే కదా అటువంటప్పుడు కొంత భాగంలో మాత్రమే యజ్ఞయాగాది క్రతువులు జరిగి, భూమండలమంతా మనుష్యజాతి ఉన్నప్పటికీ, ఈ అధికారం ఇతరప్రదేశాలలో ఎందుకు కల్పించబడలేదు అని. నేను మీతో ఒక్క మాట మనవి చేస్తాను. కొద్ది కొద్దిగా పరిశీలనం చెయ్యండి.

నాకు చాలా నీరసంగా ఉందనుకోండి. చేతులు లాగేస్తూ, కాళ్ళు లాగేస్తూ చాలా మగతగా ఉంది. ఇప్పుడు ఆ నీరసం తగ్గడానికి నేను కాళ్ళకీ, చేతులకీ అన్నం పులుముకుంటానా? కడుపులోకి అన్నం తీసుకుంటానా? కడుపులోకి అన్నంతింటే శరీరమంతా శక్తి ప్రసరిస్తుంది. మీ ఊరికంతటికీ కావలసిన విద్యుత్తు – ఒక చోట విద్యుత్ గృహం ఉంటుంది ఈ ఊరికి చివరలో, పవర్ హౌస్ అంటుంటారు. అక్కడ నుంచి శక్తి ప్రసారమవుతుంది. అన్నిచోట్లకీ విద్యుత్తు వస్తోంది. అలాగే మనుష్య శరీరంలో కడుపులోకి తీసుకున్న అన్నం పచనమై, జీర్ణమై అందులో నుండి ఉద్భవించిన శక్తి శరీరానికంతటికీ అందుతోందా అందట్లేదా, అలాగే భరతవర్షే, భరతఖండే, జంబూద్వీపే. ఇక్కడ చేసిన కర్మానుష్ఠానం, ఇక్కడ చేసే యజ్ఞయాగాది క్రతువులు, ఇక్కడ చేసే 'ధర్మాచరణాల వల్ల ప్రపంచంలో ఉన్న మనుష్యజాతి అంతా ఉద్ధరించబడుతూ ఉంటుంది. అంత గొప్ప అధికారం ఇవ్వబడిన ప్రాంతం భూమండలంలో ఇదొక్కటే.'

మీరు చూడండి – ప్రత్యేకించి ఫ్లాట్స్‌లో ఉన్నవాళ్ళకి బాగా తెలుస్తుంది. ఇదేనండీ నా ఫ్లాట్ ఏరియా అంటాడు. స్తంభాలు వేసి చదునుగా ఉంటుందంతే. అప్పటికింకా గోడలు పెట్టరు. ఆయనే నిర్ణయించుకుంటాడు. ఇదిగో, ఇక్కడొక పడక గది పెట్టుకుంటాను, ఇక్కడ పూజ గది పెట్టుకుంటాను, ఇక్కడ మరుగుదొడ్డి కట్టుకుంటానంటాడు. అంతకుముందు అదంతా సమతలంగా ఒక్కలాగే ఉంది. కానీ ఆయనే గోడలు పెట్టి ఇక్కడ మరుగుదొడ్డి అన్నాడు, ఇక్కడ పూజ గది అన్నాడు, ఇక్కడ వంట గది అన్నాడు, ఇక్కడ పడక గది అన్నాడు. ఒకసారి కట్టేసిన తరువాత ఇక మరుగుదొడ్డిలో భగవత్సంబంధమైన కార్యక్రమం ఏమైనా

చేస్తామా? చెయ్యం. పడక గదిలో చేస్తామా? చెయ్యం. ఒక్క పూజ గదిలోనే చేస్తాము. అలాగే ప్రపంచానికంతటికీ పూజగది ఏదీ అంటే ఒక్క భరతఖండే అంటే ఇక్కడే. అందుకే ఏది భరతవర్షం అని అడిగారు. హిమాలయ పర్వతాలకి దక్షిణాన, దక్షిణసముద్రానికి ఉత్తరాన ఉన్న భూభాగమేదో అది మాత్రమే. ఇక్కడ కృష్ణ జింకలు తిరిగాయి అన్నారు. కృష్ణ జింకలు ఎక్కడ తిరుగుతాయో, ఏది హిమవత్పర్వతాలకి దక్షిణాన ఉందో, ఏది దక్షిణసముద్రానికి ఉత్తరాన ఉందో, ఆ భూభాగం మాత్రమే ధర్మానుష్ఠానానికీ, యజ్ఞయాగాది క్రతువులకూ యోగ్యమైన భూమి.

యజ్ఞయాగాది క్రతువుల వల్ల ఉపయోగమేమిటని మీరొక మాట అడగచ్చు. యజ్ఞం అగ్నిసంబంధం. యజ్ఞంలో అగ్నిని ఉంచి దాని ద్వారా హవిస్సులు ఇస్తారు. హవిస్సులు తినడానికి దేవతలు వస్తారు. దేవతలు వచ్చి నిలబడే ప్రాంతం, కూర్చునే ప్రాంతం, ఆహారం తీసుకునే ప్రాంతం ఈ భూమండలమే. అందుకే మనుష్యజాతికి ఏ ఇతరమైన ప్రాణులకూ లేని విశేషమైన శక్తి ఒకటి ఉంది. దేవతలుగా ఉన్నారనుకోండి. **క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి**– కొంతకాలం పుణ్యమైపోయిన తరువాత ఆ దేవతలు మళ్ళీ భూమి మీద పడిపోతారు. భూమి మీద పుట్టిన వ్యక్తి సరైన కర్మానుష్ఠానం చేసి, ధర్మాన్ని పట్టుకుని, ఆచారాన్ని పట్టుకుని ఇక పుట్టవలసిన అవసరం లేకుండా మోక్షాన్ని పొందగలడు, తానే దేవత కాగలడు.

శ్రీరామాయణంలో ఒక **శతక్రతు నివాసేనం నాగరాజస్య మూర్ధ్వనే** అంటారు హనుమ. నూరు యజ్ఞాలు చేసిన వ్యక్తి దేవేంద్రుడై ఐరావతం మీద కూర్చుంటాడు. నూరు యజ్ఞాలు ఎక్కడ చెయ్యాలి? ఇక్కడే యజ్ఞం చెయ్యాలి. అంటే యజ్ఞం చేసి దేవేంద్రుడు కూడా కాగలిగిన అధికారం ఏ దేశంలో పొందవచ్చూ అంటే, దేశమంటే నా ఉద్దేశ్యం ప్రదేశం అని– ఒక్క భరతఖండంలో మాత్రమే అది సంభవం. ఇక్కడే దేవతలొచ్చి అన్నం తింటారు. ఇక్కడే దేవతలు సంతృప్తి చెంది సమస్త మనుష్యజాతికీ, ఇతరప్రాణులకూ కావలసిన అన్నాన్ని కల్పిస్తారు. అంటే వర్షాన్ని కురిపిస్తారు. అంటే ఆ వర్షాన్ని ఆధారం చేసుకుని పంటలు పండి, నీళ్ళు దొరికి శం చతుష్పదే, శం ద్విపదే అంటారు. అంటే కేవలం మనుష్యులే కాదు,

రెండు కాళ్ళున్న మనుష్యుల నుంచి నాలుగు కాళ్ళున్న జంతువుల నుండి అన్నీ సంతోషంగా ఉండడానికి కావలసిన వ్యవస్థ ఎక్కడ ఏర్పాటు చెయ్యబడిందీ అంటే, ఒక్క భరతవర్షమూ, భరతఖండమూ ఇక్కడే. అందుకే ఇక్కడ కర్మానుష్ఠానం చేసినవాడు ఇంద్రుడు కాగలడు, దేవత కాగలడు. ఇక్కడ కర్మానుష్ఠానం చేసి భక్తితో కూడిన కర్మాచరణం చేత ప్రీతి చెందిన భగవంతునిచేత అనుగ్రహించబడిన జ్ఞానం వల్ల, ఇక మళ్ళీ పుట్టవలసిన అవసరం లేకుండా పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యస్థితిని పొందగలడు. కాదు. ఇంత గొప్ప ప్రదేశంలో పుట్టి కర్మాచరణం చెయ్యడానికీ, ఆచారకాండ పాటించడానికీ కావలసిన యోగ్యతను పొంది కూడా ఏ విధమైన కర్మాచరణం చెయ్యకుండా తిర్యక్కుగా వెళ్ళిపోగలడు. తిర్యక్కంటే భూమికి అడ్డంగా పుట్టి అడ్డంగా పెరుగుతుంది. అంటే దాని వెన్నుపాము అడ్డంగా ఉంటుంది. అడ్డంగా ఉండి అడ్డదిడ్డంగా తిరిగే ప్రాణిగా మళ్ళీ కొన్ని కోట్ల జన్మలపాటు **పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరేశయనమ్, ఇహ సంసారే, బహు దుస్సారే, కృపయా పారే పాహి మురారే,** అంటారు భజగోవిందంలో. అలా కొన్ని కోట్ల జన్మలపాటు తిర్యక్కుగా వెళ్ళిపోగలడు.

ఇక్కడకు వచ్చినవాడు ఎవడున్నాడో మనుష్యుడుగా పుట్టడం అంత గొప్ప విషయం. ఏ ఇతరప్రాణికీ లేని ప్రత్యేక అధికారం ఒక్క మనుష్యునికి మాత్రమే. ఆ మనుష్యుడు కూడా అన్ని చోట్లా పుట్టినవాళ్ళు యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడానికి వీలులేదు. ఆ భూములు యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడానికి యోగ్యం కావు. అటువంటి యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడం కానీ, ఆచారకాండ పాటించడంకానీ, ధర్మానుష్ఠానం చెయ్యడం కానీ, పరమేశ్వరుణ్ణి చేరుకోవడం కానీ సంభవమవడానికి యోగ్యమైన ప్రదేశం ఒక్క భరతఖండమే. అటువంటి చోట పుట్టినవాడు, తననితాను తీర్చిదిద్దుకోవడానికి, తాను ఎలా బ్రతకాలన్నదాన్ని తెలుసుకుని ఉండడానికి, పరమేశ్వరుడు వేదం రూపంలో మనందరికీ కూడా శిష్టాచారాన్ని అనుగ్రహించాడు. ఎలా బ్రతకాలన్న ధర్మం చెప్పడానికి. ఎవరు చెప్పాలి? నేను చెప్తే ధర్మం కాదు, ఎవరో చెప్తే ధర్మం కాదు. ధర్మాన్ని చెప్పడానికి అధికారమున్నది ఒకే ఒక్కటి వేదం. వేదం ధర్మాన్ని చెప్తుందన్నమాటకి అర్థమేమంటే వేదం పరమేశ్వరప్రోక్తం. భగవంతుని చేత

చెప్పబడింది. భగవంతుని ఊపిరి వేదం. నాకూ, నా ఊపిరికీ తేడా లేదు. నా ఊపిరి ఎంత కాలం ఉంటుందో నేనూ అంత కాలం ఉన్నానని గుర్తు. నేను ఏ నాడు ఊపిరి తీశానో ఆ నాడు నేను పుట్టాను. కాబట్టి నా ఊపిరే నేను. నాకూ, నా ఊపిరికీ అభేదం. అలాగే పరమేశ్వరుడికీ, పరమేశ్వరుడి ఊపిరికీ అభేదం.

వేదం అంటే అపౌరుషేయం. ఒకరిచేత రచించబడింది కాదు. మరెవరు చెప్పారు? భగవంతుడు చెప్పాడు. ఎవరికి చెప్పాడంటే ధ్యానంలో నిష్ఠాగరిష్ఠులై కూర్చున్న వ్యక్తులకు పరమేశ్వరవాణి వినబడింది. ఆ మహర్షుల పేర్ల మీదుగా వచ్చాయి ఆ మంత్రాలన్నీ. వాళ్ళు సంకలనం చేశారు. సంకలనం చేస్తే ధ్యానంలో వినబడినవి ఏవి ఉన్నాయో దాన్ని వాళ్ళు స్వరంతో ప్రతిపాదన చేశారు. అందుకే దానికి శ్రుతి అని పేరు. శ్రుతి అంటే చెవితో వింటారు. గురువుగారు కూర్చుని స్వరంతో మంత్రం చెప్తే ఆ స్వరాన్ని విని ఉదాత్త, అనుదాత్త స్వరిత స్వరంతో శిష్యుడు కూడా మళ్ళీ ఆ వేదాన్ని పలుకుతాడు. ఆ వేదమే ప్రమాణం. ఆ వేదమే ధర్మమేదో చెప్పాలి. ఆ వేదమే ఆచారకాండ ఏదో చెప్పాలి. మీరు ఒక్క మాట పట్టుకోవాల్సి ఉంటుంది. ధర్మం అన్న మాటలో అత్యంతప్రధానమైనది అంటే ఆచరించటం. ధర్మం అని నేనెప్పుడన్నా మీరొకటి గుర్తుపెట్టుకోవాలి. ఆచరించటం. ఆచరించడానికి అసలు ముందేముంటుంది? తెలుసుకొనటం. తెలియకుండా ఆచరించడమన్నది సంభవం కాదుగా. ఇప్పుడు నేనిక్కడకు వచ్చాను. ఏదో నిత్యకర్మానుష్ఠానం అన్న విషయం గురించి మాట్లాడాలి. అసలు నాకంటూ ఏమైనా తెలిస్తే కదూ నేను మాట్లాడడం. ధర్మాన్ని ఆచరించడమంటే ధర్మం గురించి ఏమైనా తెలిస్తే కదూ ఆచరించడం. ధర్మం తెలియకపోతే ధర్మాన్ని ఎలా ఆచరిస్తారు? అయితే ధర్మం తెలియడం ప్రధానమా, ధర్మం ఆచరించడం ప్రధానమా? అంటే 'ధర్మం తెలియడం ప్రధానం కాదు, ధర్మాచరణమే ప్రధానం. ఆచరణమన్నది చెయ్యకుండా నాకు తెలుసండీ' అన్నాడనుకోండి. ఉపయోగముండదు.

నేను మీకు బాగా ఉదాహరణ చెప్పాలీ అంటే అన్నంతింటే కడుపు నిండుతుందని నాకు తెలుసండీ అంటే కడుపు నిండదు. అన్నంతినాలి. తింటేనే కడుపు నిండుతుంది. తింటేనే కడుపు నింపే అన్నంలా అనుష్ఠిస్తేనే ఫలితాన్నిస్తుంది ధర్మం. ఎలా పడితే అలా అనుష్ఠించడాన్ని వేదం అంగీకరించదు.

నేను మీతో మనవి చేశాను భరత వర్షే, భరత ఖండే– ఇక్కడ అనుష్ఠించాలి. అనుష్ఠించాలన్నపుడు ధర్మమెప్పుడూ కూడా కాలంతో ముడిపడుతుంది. ధర్మం నిరంతరమూ మారిపోతుంది. నిరంతరమూ మారిపోయే ధర్మాన్ని పట్టుకుని మారని సత్యస్వరూపుడైన పరమేశ్వరునియందు చేరిపోవాలి. అలా చేరిపోవాలంటే అనుక్షణం మారుతుంది. కాలంలోనూ, దేశంలోనూ ధర్మం మారిపోతుంది.

మీకొక ఉదాహరణ చెప్పాలంటే ప్రాతఃకాలంలోనూ ఉండే ధర్మం చీకటి పడిపోయిన తరువాత ఉండదు. ప్రాతఃకాలంలో పరమేశ్వర సంబంధమైన విషయాన్ని అనుష్ఠించడం ధర్మం. చీకటి పడిపోయిన తరువాత మనుష్యునికి భోగం అనుభవించడం ధర్మం. భోగం మనుష్యుడెప్పుడు అనుభవించాలంటే సూర్యాస్తమయం అయిపోయి రాత్రిగా చీకటి పడిన తరువాత మాత్రమే తప్ప పగటిపూట భోగానుభవం లేదు. భోగాన్ని పగటిపూట అనుభవించాడనుకోండి తత్కారణంచేత రాక్షసాంశ కలిగిన పిల్లలు పుడతారు. అదే దాంపత్యసంబంధమైన భోగాన్ని చీకటి పడిన తరువాత అనుభవించాడనుకోండి. పరమధార్మికులైన బిడ్డలు పుడతారు.

ధర్మం మారిపోతూ ఉంటుంది. ఇవాళ ఉన్న ధర్మం రేపుండదు. రేపున్న ధర్మం ఎల్లుండి ఉండదు. నేను ఎవరి ముందు నుంచున్నానో వాళ్ళని బట్టి ధర్మం మారిపోతుంది. ఉదాహరణకు ఏకాదశి తిథి వస్తే ఉపవాసానికి ధర్మం. ద్వాదశి తిథి వస్తే ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా పారణ చెయ్యాలి. అంటే అన్నం తినేసెయ్యాలి. తినేసి ఉపవాసాన్ని విరమణం చేసెయ్యాలి. ద్వాదశి నాడు ఉపవాసవిరమణం ధర్మం. అదే ద్వాదశినాడు తండ్రిగారిది కానీ, తల్లిగారిది కానీ తద్దినం వస్తే మధ్యాహ్నం వాళ్ళదయ్యే పర్యంతమూ మూడు గంటల వరకూ భోజనం చెయ్యకూడదు. మళ్ళీ అప్పుడది ధర్మం. అదే అటువంటి పితృకార్యం లేని రోజైతే ద్వాదశినాడు తొందరగా అన్నం తినడం ధర్మం. ఏకాదశినాడు అన్నం తినకపోవడం ధర్మం. నా తండ్రి ముందు నిలబడితే మా నాన్నగారు చెప్పింది వినడం ధర్మం. నా కొడుకు ముందు నిలబడితే నా కొడుక్కి నేను చెప్పడం ధర్మం. నా భార్య ముందు నిలబడితే అనునయంగా మాట్లాడి ఆమె మనసుని చూరగొనడం ధర్మం. నా కూతురి ముందు నిలబడితే ఆమెకి ధర్మం తెలిసేటట్లుగా మాట్లాడడం నా

ధర్మం. నేను కార్యాలయానికి వెళితే ఉద్యోగిగా నా పై అధికారులను గౌరవించడం ధర్మం. నేను ఉపన్యాసవేదిక మీదకొస్తే పదిమంది చేత గౌరవించబడే రీతిలో, పదిమందికి పనికొచ్చేమాట తప్ప పనికిరాని మాట ఒక్క మాట మాట్లాడకుండా ఉండడం ధర్మం. నా స్నేహితులతో కలిసి నేను మాట్లాడుకుంటున్నప్పుడు ఏదో సంతోషంగా దానికి ప్రయోజనం ఉందా, లేదా సంబంధం లేదు. ఉల్లాసం కోసం స్నేహితులతో సరదాగా మాట్లాడుకోవడం ధర్మం.

ధర్మం మీరు ఉన్న ప్రదేశాన్ని బట్టి మారిపోతుంది. మీరు యాత్రలో ఉన్నారనుకోండి. శరీరం చాలా ఆకలితో ఉంది. అప్పుడు మీరు ఏదో ఒక పదార్థాన్ని తీసుకోవచ్చు, దోషంలేదు. ఉపనిషత్తులో ఒక కథ ఉంది. ఒక మహానుభావుడు మంచి ఆకలితో ఉన్నాడు. ఆయన శరీరం నిలబడడంలేదు పడిపోతోంది. ఆయన మంచి జ్ఞానం ఉన్నవాడు. ఆయన గబగబా వెళ్ళాడు. ఆవు నములుతోంటే ఆవు నోటి వెంట నురగ కారుతోంది. ఆ నురగని, ఆక్కడున్న ఉలవల్ని తీసుకుని తినేశాడు. ఆ గోశాలను రక్షించేవ్యక్తి గబగబా వచ్చి నీళ్ళు పోశాడు, తాగండన్నాడు. ఆయనన్నాడు నేను తాగనన్నాడు. ఏం ఎందుకు తాగరు? ఆవు నోటి నురుగు తిన్నారు, ఆవు తినే ఆ పాత్రలో ఉన్న ఉలవలు తిన్నారు, నీళ్ళెందుకు తాగరు అని అడిగాడు. అవి తినకపోతే నా శరీరం పడిపోతుంది. తినేశాను. ఇప్పుడు ఆ నీళ్ళు తాగకపోయినా నా శరీరం పడదు కాబట్టి తాగను అన్నాడు. యాత్రాధర్మం వేరు. తన ఇంట్లో తానుంటే ధర్మం వేరు. ధర్మం నిరంతరమూ మారిపోతూ ఉంటుంది. ఒక్కసారి ఉన్న ధర్మం ఇంకొకసారి ఉండదు. ప్రదోషవేళ అయితే నేను సంధ్యావందనం చెయ్యడం ధర్మం. ప్రదోషవేళ దాటిపోయాక వచ్చి ప్రవచనం చెయ్యడం నా ధర్మం. ఎప్పుడేది చెయ్యాలో మనం కాదు నిర్ణయించేది, ఈశ్వరుడు వేదంలో నిర్ణయించి ఉన్నాడు. దేశమూ, కాలమూ ఈ రెండిటితో పెనవేసుకుని ధర్మం ఆవిష్కరించబడుతుంది. దేశకాలాలను పట్టించుకోకుండా ధర్మం ఉండదు.

కొంతమంది తెలియక ఒక మాట అంటుంటారు. మూఢాచారమంటారు. తప్పు. అది మూఢాచారం కాదు. ఎంత జాగ్రత్తగానో మాట్లాడుతుంది వేదం. అవతలి వ్యక్తిని తరింపచెయ్యడానికి ఆచారకాండ వస్తుంది. మీరు ఆచరిస్తే తప్ప ధర్మంలో నిలబడలేరు. ధర్మమంటే ఆచరించటం. ఎలా ఆచరించాలి? మీరు కాదు

నిర్ణయించుకోవలసింది. నేనిలా చేసేస్తాను. మీ నిర్ణయంతో చేసింది ధర్మం కాదు. వేదం ఎలా చెప్పిందో మీరు అలా ప్రవర్తిస్తే ధర్మంలో నిలబడినట్లు. అయితే మీరు నన్నొక ప్రశ్న అడగచ్చు. వేదం చెప్పినట్లు నిలబడడానికి యోగ్యమైన శారీరకస్థితి మాకు లేకపోతే? తెల్లవారుజామున స్నానం చెయ్యండని వేదమంది. నాకు నూట నాలుగు జ్వరం ఉంది. అప్పుడు ధర్మం తప్పినట్లా? కాదు. వేదం మీరు జాగ్రత్తగా పరిశీలిస్తే, అందుకే సార్వభౌమిక మతమంటారు. సార్వభూమికలలో ఉన్నవారినీ ఆదుకుంటుంది. ఎవ్వర్నీ మినహాయించి పాడైపొమ్మని చెప్పదు. మౌఢ్యంతో ఏదో ఒక మాట మాట్లాడి ఇలా చేస్తే చెయ్యి, లేకపోతే చావు అనదు. అందర్నీ ఉద్ధరిస్తుంది. ప్రతీవాళ్ళు వాళ్ళ వాళ్ళ స్థాయిని బట్టి ఎలా ఆచరించి తరించవచ్చో ఆ మార్గాన్ని చూపిస్తుంది వేదం. అందుకే వేదం మూర్ఖంగా, అర్థం లేకుండా, కఠినంగా మాట్లాడుతుందనుకోవడం పొరపాటు. అందుకే ఆచారకాండను తెలుసుకుని దాని ప్రకారంగా మనం జీవించడం కోసం ఋషులు ఒక అద్భుతమైన ప్రయోగం చేశారు. మొట్టమొదట సంవత్సరాన్ని ప్రమాణంగా తీసుకున్నారు. ఒక సంవత్సరాన్ని ప్రమాణంగా తీసుకుని అనుష్ఠానం వెళుతుంది. అందుకే మీరు చూడండి ఖర నామ సంవత్సరే, ఖర నామ సంవత్సరే, ఖర నామ సంవత్సరే అని సంవత్సరంపాటు చెప్తాం.

ఈ సంవత్సరాన్ని మళ్ళీ రెండు అయనాలుగా విభజిస్తారు. అయనమంటే కదలిక. కాలం కదిలిపోతోంది. ఎలా? రెండు అయనాలుగా. కదలిక, నడక రెండు కాళ్ళతో నడిస్తే సరైన నడక. ఒక కాలి మీద నడిస్తే కుంటి నడక. కాలం కూడా రెండు కాళ్ళ మీదే నడవాలి. ఒకటి ఉత్తరాయణం, ఒకటి దక్షిణాయనం. రెండు అయనాలతో నడుస్తుంది. దక్షిణాయనమంతా కూడా మీరు అనుష్ఠించవలసిన కాలం. అందుకే దక్షిణాయనమంత పవిత్రమైన కాలం అనుష్ఠానసంబంధంగా ఉత్తరాయణం కాదు. చాలామంది పొరపాటున ఒక మాట అనుకుంటారు. ఉత్తరాయణం గొప్పదనుకుంటారు. ఉత్తరాయణం గొప్పది దేనికీ అంటే పొందవలసిన మార్గాన్ని పొందడంలో. అనుష్ఠానానికి సంబంధించినంతవరకు చాలా గొప్పదేదంటే దక్షిణాయనమే. అందుకే మీకు గణపతి నవరాత్రులు, శారదానవరాత్రులు, శ్రావణమాసంలో మహాలక్ష్మి అమ్మవారి సేవలు, నోములు, వ్రతాలూ అన్నీ దక్షిణాయన పుణ్యకాలంలోనే వస్తాయి. మళ్ళీ ఈ దక్షిణాయన,

ఉత్తరాయణాలలో ఒక మాసాన్ని ప్రమాణంగా తీసుకుంటారు. చాంద్రమానంలో చంద్రుడు ఏ నక్షత్రంతో కూడుకున్నాడనేదాన్ని ప్రమాణంగా తీసుకుని మాసాన్ని తీసుకొస్తారు.

ఆ మాసాన్ని మళ్ళీ రెండుగా విభాగం చేస్తారు. శుక్ల పక్షమూ, కృష్ణ పక్షమూ. మళ్ళీ ఈ శుక్ల పక్ష, కృష్ణ పక్షాలతో కూడుకునే మాసంలో ఒక రోజుకి తీసుకొస్తారు అనుష్ఠానాన్ని. మళ్ళీ ఒకరోజు రెండిటితో నడుస్తుంది. ఒక పగలు, ఒక రాత్రి కలిపి ఒక రోజు. ఈ పగలు, రాత్రిలో మీరు ప్రత్యేకంగా శారదానవరాత్రులూ, గణపతి నవరాత్రులూ చేస్తే రాత్రి అంటారు. కానీ ఒకరోజు అనుష్ఠానంలో రాత్రి శబ్దం ఉండదు. నిజానికి మహాశివరాత్రి, గణపతి నవరాత్రులు, శారదానవరాత్రులు, వసంత నవరాత్రులు అంటారు. రాత్రి మనం ఏం చేస్తాం? అప్పుడు కూడా చేసేదేం ఉండదు. పడుకుంటాం. మరి రాత్రి చెయ్యడమేమిటి? రాత్రి చెయ్యడమంటే ఆ కాలంలో నువ్వు చేసిన అనుష్ఠానం వల్ల రాత్రి నుండి వెలుతురులోకి వస్తావని. చీకటి అంటే యథార్థమైన వస్తువు తెలియదు. పగలు ఉన్న వస్తువు ఉన్నట్లు తెలుస్తుంది. ఇది నేను, ఇది నేను అన్న భ్రాంతిలో నుంచి శరీరం నేను కాదు, ఆత్మ నేనన్న జ్ఞానం దేనివల్ల కలుగుతుందంటే, దక్షిణాయనపుణ్యకాలంలో ఏ రాత్రులను బాగా అనుష్ఠానం చెయ్యాలో ఆ కాలంలో పరమేశ్వరుణ్ణి ఆరాధన చేస్తే, ఆ ఆరాధన వల్ల తృప్తి చెందిన భగవంతుని అనుగ్రహంచేత జ్ఞానం అనుగ్రహించబడుతుంది. ఇది రాత్రి సంబంధం.

ఒకరోజు అనుష్ఠానం దగ్గరకు వచ్చేటప్పటికి ఒకరోజును ప్రమాణంగా తీసుకుంటారు. ఒకరోజు ప్రమాణంలో రాత్రి భగవత్సంబంధమైన అనుష్ఠానం ఎప్పటివరకూ అంటే రాత్రి నిద్రపోవడానికి మంచం మీద పడుకోవడం వరకు మాత్రమే. నేను ఒక్క గృహస్థుకు సంబంధించిన విషయాన్నే మాట్లాడుతున్నాను. కాబట్టి మంచం మీద పడుకోవడానికి నిద్రకు ఉపక్రమించే పర్యంతమే అనుష్ఠానముంది. నిద్రకు ఉపక్రమించిన తరువాత అనుష్ఠానం లేదు. ఏమీ ఉండదు. కానీ అనుష్ఠానంగా మారుతుంది. దేనివల్ల? అది నేను మీకు మూడో రోజు చూపిస్తాను. కాబట్టి అసలు ఒకరోజును ప్రమాణంగా తీసుకుంటే అనుష్ఠానం అనేది, ఆచారం అనేది ఎప్పుడు ప్రారంభమవుతుంది? ఆచారమంటే చరతి – అలా కదలటం. అంటే ఎలా చెప్పారో అలా కదలటం.

మీరు చూడండి, మిలిటరీ కవాతు అంటారు. ఇక్కడ నుంచుంటారు. ఒకాయన నుంచుని లెఫ్ట్, రైట్, లెఫ్ట్, రైట్ అంటారు. దానిని బట్టి వాళ్ళు కదులుతారు. సావధాన్ అంటేనే ఆగిపోతారు. చరతి కదలాలి. ఎలా? భగవంతుని ఆదేశానుసారం కదలాలి. ఏమిటి భగవంతుని ఆదేశం? వేదరూపంలో చెప్పాడాయన. ఇలా కదలాలి నువ్వు అని చెప్పాడు. ఆయన ఎలా కదలాలని చెప్పాడో అలా కదలడమే ఆచారం. ఆ ఆచారం వల్ల ఏం వస్తుందని అడిగారు. అలా కదిలితే ఏం వస్తుంది? ఆచారా ల్లభతే ధర్మం. ఆచారాన్ని పాటించడం వల్ల ధర్మంలో నువ్వు ప్రవేశిస్తావు. నీ కదలికలన్నీ ధర్మమే అవుతాయి. అప్పుడు నీకు తెలియకుండానే నువ్వు భగవంతునికి కట్టుబడతావు. నీ నడవడి భగవంతుని చేత అంగీకరించబడి ఆదరించబడుతుంది. ఆయన ఎంతో సంతోషిస్తాడు. సంతోషించటమన్న మాటను మీరు జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఇప్పుడు ఎంతో కష్టపడి ఈ పుష్పమాలలు కట్టారు. పట్టుకొచ్చి నా మెళ్ళో వేశారు. ఎందుకువేశారు? ఒక్కటే కారణం. నేను ఈ పుష్పమాలలు వేసుకుని మీకు కనబడితే మీరు సంతోషిస్తారు. కోటేశ్వరరావుగారు వేసుకున్నారు ఆ దండ అని సంతోషిస్తారు. కోటేశ్వరరావుగారు వేసుకోవాలని మీరు ఒక పుష్పహారం పట్టుకొచ్చి నా మెళ్ళో వేశారు. మీరు సంతోషించారు. అరే పాపం నేను వేసుకోవాలని తీసుకొచ్చాడురా అని తీసి నేను మెళ్ళో వేసుకున్నాను ఈ దండ. నేను గొప్పవాడ్ని, నా అంత గొప్పవాడు లేడు, అందుకని నేను దండేసుకుంటే వాళ్ళు సంతోషిస్తున్నారని నేను వేసుకోలేదు. పైకి మెడలో ఈ దండ వేసుకున్నాను కానీ నేను లోపల ఏ భావన చేస్తున్నానంటే ఈశ్వరా, వాళ్ళందరూ కింద కూర్చుని ఇంత వేదిక కట్టి నన్ను పైన కూర్చోబెట్టి నా మెడలో ఇంత సౌరభంతో ఉన్న మాల ఎందుకేశారో తెలుసా? ఈ కంఠంలోంచి, ఈ గుండెల్లోంచి నీకు సంబంధించిన మాట వస్తోంది. అందుకని నాకు పుష్పమాల పడింది. ఈ పుష్పమాల బాహ్యంలో నా మెడలో కనబడినా యథార్థానికి ఇది నీ మెడకే చేరిపోయింది అని. మీరు నాకు హారమిచ్చి సంతోషించారు. నేను మానసికంగా ఈశ్వరుడి మెడలో అలంకారం చేసి సంతోషించాను. సంతోషం ఉత్పన్నమవడానికి కారణం అంగీకరించబడడం కదూ. మీరు నాకు దండ ఇచ్చినా వెయ్యకండి, వెయ్యకండి అని నేను చేతులు అడ్డుపెట్టి అక్కడ పడెయ్యండి, ఏమిటా దండలు అన్నాననుకోండి, మీరు

చిన్నబుచ్చుకుంటారు. ఏమిట్రా ఈయనకు దండ తీసుకొస్తే అలా అన్నాడేమిట్రా. కనీసం చేత్తో అయినా ముట్టుకోలేదు. ఏమిటో త్రాచుపామును చూసినట్లు అక్కడ పడెయ్యండన్నాడేమిట్రా? అయ్యో, ఇంట్లోకి తీసుకెళ్ళి మా నాన్నగారి ఫోటోకి వేసుకున్నా బాగుండేదే అనుకుంటారు.

అంగీకరించటంలో ఆనందముంది. అంగీకరిస్తాడు ఈశ్వరుడు. ఎప్పుడు? ఆచరతి. ఆయన చెప్పినట్లు కదలితే. తండ్రి చెప్పినట్లు కొడుకు బ్రతికితే తండ్రి సంతోషిస్తాడు. గురువు చెప్పినట్లు శిష్యుడు కదిలితే గురువు సంతోషిస్తాడు. పరమేశ్వరుడు చెప్పినట్లు మనం నడిస్తే పరమేశ్వరుడు సంతోషిస్తాడు. కాబట్టి ఇప్పుడు ఆచారం వల్ల ఏం కలుగుతుంది? **ఆచారా ల్లభతే ధర్మం**. భగవంతుడు చెప్పినట్లుగా ప్రవర్తించగలిగిన లక్షణం కలుగుతుంది. ఆచారం వల్ల సుఖం కలుగుతుంది. సుఖమంటే మనసుకి సంతోషంగా ఉండడం. మీరు బాగా జ్ఞాపకం పెట్టుకోవాలి. శరీరానికి అనుకూలంగా ఉంది సుఖం కాదు. మనసుకి అనుకూలంగా ఉంది కాదు. ఒకాయనకి నూట నాలుగు జ్వరమొచ్చింది. అలోమని ఏడ్చాడు. చంద్రశేఖరేంద్ర సరస్వతీమహాస్వామివారికి నూట నాలుగు జ్వరమొచ్చిందొకసారి. ఆయనెంతో సంతోషపడ్డారు. నేనెప్పుడూ పంచాగ్నిహోత్రతపస్సు చెయ్యలేదు. ఒంట్లో నూట నాలుగు జ్వరముంది కాబట్టి నా ఆసనం పట్టుకెళ్లి సూర్యుడి కింద వెయ్యండి. ఆయన వంక చూస్తూ జపం చేస్తాను. నా జీవితంలో కొంతసేపు పంచాగ్నిహోత్రతపస్సు చేసినట్లవుతుంది. ఎంత అదృష్టం, నాకు జ్వరమొచ్చిందన్నారు. ఒకరు జ్వరానికి ఏడ్చారు. ఒకరు జ్వరానికి సంతోషించారు.

సుఖానికి హేతువు శరీరం కాదు. సుఖానికి హేతువు మనసు. మనసు దేనికి సంతోషిస్తుందో అది ఖగ సుఖం. ఖ అంటే ఆకాశం. గ అంటే కదలడం. ఖగ అంటే ఆకాశంలో కదిలేది. దుఃఖ ఆకాశం, సుఖ ఆకాశం బాగుందనిపిస్తే బాగుంది. ఖ అలాగే ఉంది. దానిలో మార్పులేదు. నీలో మార్పు. ముందు సు పెడితే నీకు బాగుంది. నీకు బాగులేదు దుఃఖం. మబ్బు పట్టింది. మంచి వాన పడి పోయేటట్టు ఉంది. ఒకరి గుండె గుభేల్మంటుంది. ఇంత కార్యక్రమం పెట్టుకున్నాను, ఎలాగ అని. వ్యవసాయదారుడి మనసు సంతోషపడిపోతుంది. ఉక్కపోస్తున్నవాడు పొంగిపోతాడు, హమ్మయ్య వానపడేటట్లుందిరా అని. కాబట్టి ఒకడికి సుఖం,

ఒకడికి దుఃఖం. ఆకాశంలో దోషంలేదు. నీలో ఉంది అసలు కారణమంతా. నీకు సు ఇంకొకడికి దు. ఇంకొకడికి దు నీకు సు అంతే. ఖ అలాగే ఉంది- సుఖం. **ఆచారాద్దేవ సుఖం** అంటే భగవంతునితో పెనవేసుకుని ఉండి ఎప్పుడూ సంతోషంతో ఉండగలిగిన మనసు ఏర్పడుతుంది. కష్టమొచ్చిందీ పోన్లేరా ఎప్పుడు ఏ జన్మలో ఏ పాపం చేశానో, ఈ కష్టం రూపంలో పోయింది అక్కడితో ఆ పాపం అంటారు. ఏదో సుఖం వచ్చింది. నా గొప్పతనమేముందిరా ఈశ్వరుడి కృప. మహానుభావుడు ఆయనిచ్చాడు నాకీ సుఖాన్ని అంటాడు. తన కర్తృత్వం ఎప్పుడూ లేదు. ఎప్పుడూ సుఖంగా ఉంటాడు. ఇప్పుడాయన అలా సుఖంగా ఉండడానికి కారణం భగవంతుడు చెప్పినట్లు కదులుతున్నాడు. ఆచారం చేస్తున్నాడు. కాబట్టి ఆచారాద్దేవ సుఖం. ఇది చివరికేం చేస్తుంది? **ఆచారాద్దేవ మోక్షం ప్రాప్నుయాత్**. ఆచారాన్ని పట్టుకుని, పట్టుకుని, పట్టుకుని చిట్టచివరికి మోక్షానికెళ్ళిపోతాడు, జ్ఞానం కలుగుతుంది. కాబట్టి ఆచారకాండకి వేదంలో అంత ప్రశస్తి ఉంది. భగవంతుడు చెప్పినట్లు కదలటం.

ఒకరోజు మొట్టమొదట కదలిక అంటే ఎలా ఉండాలంటే తనంతతానుగా నీకు అలవాటై ఉండాలి. ఏది అలవాటై ఉండాలీ అని అడిగారు. **బ్రహ్మ ముహూర్తం తిష్ఠేత్**-అది మొట్టమొదటి సూత్రం వేదంలో. బ్రహ్మ ముహూర్తంలో నువ్వు నిద్రలేచి ఉండాలి. బ్రహ్మ ముహూర్తమంటే ఏమిటి? ఒక మనుష్యుడు నిద్ర లేవవలసిన సమయాన్ని ఎలా లెక్కెట్టుకోవాలీ అని అడిగారు. ప్రాతఃకాలంలో నిద్రించి ఉండరాదు. ప్రాతఃకాలం అంటే ఏమిటి? ప్రాతఃకాలం, ప్రదోషం అని రెండు మాటలు మనకి. ప్రాతఃకాలం అంటే సూర్యోదయం ఎన్ని గంటలకవుతోంది? అందుకు లెక్క కడతాడు ఋషి. పంచాంగమని ఉంటుంది. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ ఐదింటిని చెప్తుంది కాబట్టి, ఐదు అంగాలతో ఉంటుంది కాబట్టి, పంచాంగం. వాళ్ళు ఋతువుని బట్టి నెలని చెప్పి సూర్యోదయం, సూర్యాస్తమయం రాస్తారు. సూర్యోదయం ఎన్నింటికవుతుందో చెప్తారు. సూర్యోదయం ఎన్నింటికవుతుందని పంచాంగంలో చెప్పబడిందో అక్కడి నుంచి ఎనభై ఎనిమిది నిమిషాల ముందు నిద్రలేవాలి. దానికి ప్రాతఃకాలమని పేరు. ఎనభై ఎనిమిది నిమిషాల ముందు కన్నా నిద్రపోయినవాడెవడో వాడు అరుణదర్శనం చెయ్యలేదని గుర్తు.

అరుణదర్శనమంటే ఏమిటంటే – ఒక కారు వెళ్ళిపోతోందనుకోండి. ముందు లోపల కూర్చున్నవాడు కనబడతాడా? డ్రైవర్ కనబడతాడా? డ్రైవర్ కనబడతాడు. అలాగే పరబ్రహ్మస్వరూపుడైన సూర్యనారాయణ మూర్తి వస్తున్నప్పుడు మొదట ఆయన సారథి కనబడతాడు. ఆయన సారథికి అరుణుడు అని పేరు. అరుణోదయమంటారు. ముందు సారథి కనబడతాడు. అది ఎర్రటికాంతి. బింబం ఎర్రగా వస్తుంది. మొట్టమొదట ఆ సారథి దర్శనం చెయ్యాలి. ఓ .... అరుణోదయమైపోతోంది. వచ్చేస్తున్నాడు నా తండ్రి. అదిగో, ఎర్రగా ముందు రథసారథి వస్తున్నాడు అని దర్శనం చేస్తే, బంగారు కాంతులలో కొద్దిక్షణాలలో మారిపోతుంది. ఆదిత్యహృదయం చదివినంత సేపు పడుతుంది. పట్టి బంగారు కాంతులలోకి వస్తాడు. అప్పుడు పరమేశ్వరుడు జ్యోతిరూపుడై వస్తున్నాడని గుర్తు.

**నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః।**
**జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః॥**
**జయాయ జయ భద్రాయ హర్యశ్వాయ నమో నమః।**
**నమః ఉగ్రాయ, వీరాయ సారంగాయ నమో నమః॥**
**నమః పద్మ ప్రబోధాయ మార్తండాయ నమో నమః।**
**బ్రహ్మేశా నాచ్యుతేశాయ సూర్యాయా దిత్య వర్చసే॥**

అని రుద్రం ఎలా ఉభయతర నమస్కారాలు చేస్తుందో అలా ఆదిత్యహృదయం ఉభయతర నమస్కారాలు చేస్తుంది. వచ్చేస్తున్నాడు ఆయన బ్రహ్మ, విష్ణు, శివాంశ సంభూతుడై వస్తున్నాడు పరమేశ్వరుడు. అందుకని మూడు మూర్తులూ కలిస్తే అసలు పరమేశ్వరుని స్వరూపం. భా కాంతి. అపారమైన కాంతిపుంజమే ఈశ్వరస్వరూపం. దానిని మీరు తరువాత ఏ పేరు పెట్టి పిలవండి ఈశ్వరుడికి అభ్యంతరం లేదు. **స బ్రహ్మస్య, శివస్య, హరిశ్యేంద్ర శ్రోక్షర పరమేశ్వరా** అంటారు. మీరే పేరు పెట్టి పిలిచినా యథార్థానికి ఆయన స్వరూపం కాంతిపుంజం.

అందుకే తిక్కనగారు సూర్యనారాయణ మూర్తి గురించి చెప్తూ

**నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన భవ్య తపంబుల ఫలమనంగ,**
**దివసముఖాభినందిత చక్ర యుగ్మకంబుల యనురాగంపు ప్రోవనంగ,**

**హరి హర బ్రహ్మ మహానుభావంబు లొక్కటిగాగ గరగినగట్టి యనగ,**
**నతుల వేదత్రయలతికా చయము పెనుపొందఁబుట్టిదు మూల కందమనగ,**
**నఖిల జగముల కందెరయగుచు జన సమాజ కరపుట హృదయ సరోజములకు,**
**ముకుళనంబును జృంభణంబునునొనర్చి, భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.**

అంటారు. ఆ సూర్యబింబం వస్తూంటే బ్రహ్మ, విష్ణువు, శివుడు ముగ్గురూ కలిసిన తేజస్సుతో కూడిన ముద్ద. అది తామరమొగ్గలుట ఇలా రెండు చేతులూ ఎత్తినట్టుగా ముకుళించుకొని రాత్రల్లా తపస్సు చేస్తే వాటి తపస్సుకి మెచ్చి వచ్చారా అన్నట్టుగా వస్తాడట.

**నీరజాకరములు నిష్ఠమైఁజేసిన భవ్యతపంబుల ఫలమనంగ, దివసము ఖాభినందిత చక్ర యుగ్మకంబుల యనురాగంపు బ్రోవనంగ**– ఆ చక్రవాకపక్షులకు చీకటి పడితే కళ్ళు కనబడవు. వాటికి విపరీతమైన ప్రేమ – దంపతులకి. అవి ఆడపక్షి, మగపక్షి తప్పిపోతాయి రాత్రి. కనబడవు. అరుస్తూ ఉంటాయి ఒక దానితో ఒకటి కలవాలని. వాటికి సూర్యోదయమవుతూండగా అరుణోదయమవగానే కనబడుతుంది భార్య, భర్త. సంతోషపడిపోయి దగ్గరదగ్గరగా కూర్చుని ఒకళ్ళ ముక్కుతో ఒకళ్ళు ఒరుసుకుంటూ సంతోషపడిపోతారు. రాత్రల్లా భార్య కనబడలేదని భర్త, భర్త కనబడలేదని భార్య చక్రవాకపక్షుల జంటలు, మహానుభావా, నువ్వు ఉదయించవయ్యా, మా దంపతులం ఒకళ్ళకొకళ్ళం కనబడతామని ప్రార్థన చేస్తే వచ్చాడా అన్నట్లుగా వచ్చాడట.

**చక్రయుగ్మకంబుల యనురాగంపు బ్రోవనంగ హరి హర బ్రహ్మ మహానుభావంబు లొక్కటిగాగ గరగినగట్టి యనగ**– బ్రహ్మగారిని, విష్ణువును, పరమశివుణ్ణి కలిపి ఒక ముద్ద చేసేస్తే ఆ ముద్ద ఒక తేజఃపుంజమైతే అదే సూర్యనారాయణమూర్తి. కాబట్టి **కరగినగట్టి యనగ, అటుల వేదత్రయలతికా చయము పెనుపొందఁబుట్టిదు మూల కందమనగ**– ఒక కందని తీసుకెళ్ళి మట్టిలో పాతితే మూడు వైపుల నుండి మూడు తీగలు పుట్టినట్టు వేదాలనబడే తీగలు ఏ పరబ్రహ్మం నుండి పుట్టాయో ఆ పరబ్రహ్మమనే ముద్ద చూడాలంటే నువ్వు సూర్యనారాయణమూర్తిని చూడాలి. కాబట్టి **అఖిల జగముల కందెరయగుచు**– సమస్తప్రపంచం కళ్ళు తెరుచుకునేటట్లు చేస్తూ **జన సమాజ కరపుట హృదయ**

**సరోజములకు ముకుళనంబును జృంభణంబుననొనర్చి**- హృదయమనే పద్మం విచ్చుకుంటుంది. చేతులనబడే సరోజాలు ముడుచుకుంటాయి. ఆయన్ని చూడగానే ఇలా నమస్కారం చేస్తాయి. హృదయపద్మాలు ఇలా విచ్చుకుంటాయి. కాబట్టి **ముకుళనంబును జృంభణంబును నొనర్చి భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె**- ఈ కంటితో చూడడానికి వీలైన ఏకైక పరబ్రహ్మస్వరూపం ప్రాతఃకాలంలో మాత్రమే మీరు చూడగలరు. అలా చూడడానికి వీలైన రీతిలో ఆయన వస్తుండగా పరబ్రహ్మమే వస్తున్నా కూడా ధిక్కరించి నిద్రపోయినవాడెవడో వాడు కృతఘ్నుడు.

అందుకనే **కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః** శిష్యులకి పాఠం చెప్పడానికి గురువుగారు వస్తున్నారు. గురువుగారు వచ్చేటప్పటికి శిష్యుడెలా ఉండాలి? అప్పటికి లేవడం, స్నానం, సంధ్యావందనమైపోయి గురువుగారు పాఠం చెప్పడానికి వస్తారని చెప్పి శ్రద్ధతో కూర్చున్న శిష్యుడెలా ఉంటాడో, గురువుగారిని చూడగానే శిష్యుడెలా లేచి నిలబడతాడో, లేచి నమస్కారం చేస్తాడో అలా పరబ్రహ్మం నీ మాంసనేత్రం చూడడానికి వీలైన రీతిలో ఉదయిస్తుండగా, నువ్వు స్వాగతం చెప్పడానికి వీలైన రీతిలో సిద్ధం కాకుండా ఇంకా నిద్రపోతుంటే కృతఘ్నుడవు. కాబట్టి **కృతఘ్నఘ్నాయ దేవాయ** -కృతఘ్నుడిని శిక్షిస్తానన్నాడు. ఎలా శిక్షిస్తాడంటాడు? అందుకు చెప్పింది వేదం. **బ్రహ్మ ముహూర్త ముత్తిష్ఠేత్.** అలా లేస్తే ఏమవుతుంది? ఎనభై ఎనిమిది నిమిషాలకు ముందరే నిద్ర లేస్తే, నిద్రలేచి అలా కూర్చుని పేపరు పట్టుకొమ్మని కాదు, టి.వి పెట్టుకొమ్మని కాదు. అంతకుముందు లేచి కాలకృత్యాలను తీర్చుకొని, స్నానాది కార్యక్రమాలను పూర్తిచేసి, సంధ్యావందనం చేసుకుని అర్ఘ్యం చేసి, గాయత్రీమహామంత్రజపం చేస్తున్నవాడవై ఉండాలి. అలా ఉంటే నువ్వు భగవంతుడికి స్వాగతం పలుకుతున్నవాడివని గుర్తు. కాబట్టి అలా ఉండడం చేత పరమేశ్వరుడు ఏమిస్తాడని అడిగారు? ఆయన ప్రసన్నుడవుతాడు. వీడురా నేను చెప్పినట్లు బ్రతుకుతున్నాడు. కాబట్టి వీడు కొంతకాలం ఉండడానికి అర్హుడు అంటాడు. కాబట్టి **ఆయుః ప్రమాణం రక్షేత్** దానివల్ల ఆయన ఆయువు రక్షించబడుతుంది. **రక్షాత్ ఆయుః** ఆయన దానిచేత ఆయువును ర చేస్తాడు. అంటే దీర్ఘవ్యాధులకు గురికాకుండా సంతోషంగా, ఆరోగ్యంతో తిరగగలుగుతాడు భూమి మీద. **ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్** అనడానికి కారణమదే. తన ఆయువుని

రక్షించుకోడానికి, తాను ఆరోగ్యంగా తిరగడానికి మొదట చెయ్యవలసినదేదీ అంటే సూర్యబింబం ఉదయించడానికి ఎనభై ఎనిమిది నిమిషాల పూర్వం నిద్ర లేవాలి.

సూర్యబింబం అన్ని వేళలా ఒక కాలానికి ఉదయించదు. ఇప్పుడు హేమంత ఋతువు నడుస్తోంది. హేమంత ఋతువులో చాలా ఆలస్యంగా సూర్యోదయమవుతుంది. ఒక్కొక్కసారి ఆరుగంటల ముప్పై అయిదు నిముషాలు, ఆరు గంటల నలభై నిముషాలకు కూడా సూర్యోదయముంటుంది. అంటే దానికి ఎనభై ఎనిమిది నిమిషాలకు ముందు లేస్తే చాలు. వసంత ఋతువులో అలా కాదు. చాలా తొందరగా సూర్యోదయమవుతుంది. కాబట్టి దానికన్నా చాలా తొందరగా నిద్ర లేవవలసి ఉంటుంది. ఋతువుని పంచాంగంలో రాయగానే మొదటి తిథి దగ్గరే సూర్యోదయం రాస్తారందుకే. ఋతువు మారింది, సూర్యోదయం మారుతోంది. నువ్వు నిద్రలేచే వేళ సవరించుకొమ్మని గుర్తు. కాబట్టి ప్రాతఃకాలం. ఎనభై ఎనిమిది నిమిషాల ముందు లేవాలి. అది పరమయోగ్యమైన కాలం. తన ఆయువుని తాను రక్షించుకోవడానికి, ఈశ్వరకృపను పొందడానికి పరమయోగ్యమైన కాలం బ్రహ్మముహూర్తకాలం. మళ్ళీ అంత శక్తిమంతమైంది ప్రదోషకాలం. దోషం అంటే చీకటి. ప్రదోషం అంటే చీకటి పడడానికి ముందున్న కాలం ఉత్తరసంధ్య. ఉత్తరసంధ్య కూడా అంత శక్తిమంతం. ఏ కారణం చేతనైనా రాత్రి బాగా బడలిపోయి ఉంటే, ఎప్పుడైనా ఒక్కసారి సూర్యోదయసమయంలో నిద్రపోతున్నాదోషాన్నిమన్నిస్తారు. అందుకే **ప్రాయశ్చిత్తార్థ్య పూర్వ సంధ్యావందనం కరిష్యే** అని అనుమతించారు. పడమటి సంధ్య వేళలో నిద్ర పోవడానికి వీలులేదు.

నాకు బాగా గుర్తు. నాకు చిన్నప్పుడు టైఫాయిడ్ వస్తే పడుకుని ఉంటే మా అమ్మ ప్రదోషవేళ అవుతోందిరా, ఒక్క పావుగంట కుర్చీలో కూర్చో అని లేపి బలవంతంగా కూర్చోపెడితే, నాకు చాలా బడలికగా ఉంది. ఏమిటి ఈవిడ కూర్చోమంటోంది ఈ పావుగంటాను, కూర్చోలేకపోతున్నాననిపిస్తే, కాదు, ఒక్క పది నిముషాలుండి పడుకో, పడుకోకూడదలా, పడుకోకూ వద్దనేది మా అమ్మ. మహాతల్లి ఆ రోజుల్లో ఎందుకు నేర్పిందో అర్థమవుతోందిప్పుడు. కాబట్టి ప్రదోషం చీకటి పడడానికి ముందు ఉత్తరసంధ్యాకాలంలో సూర్యాస్తమయమవుతుంటుంది.

మళ్ళీ అది పరమపవిత్రమైన కాలం. ఆ కాలంలో **వృషేశ్వరాయనంబున సంచరించుట అభావ్యంబయ్యె**. పరమశివుడు వృషభవాహనం మీద తిరుగుతాడు. ఆయన తిరుగుతుంటే దితితో కశ్యపుడు. ఆయనకేమీ రాగద్వేషాలుండవు.

**దృష ద్విచిత్ర తల్పయో ర్భుజంగమౌక్తిస్రజో, ర్గరిష్ఠ రత్న లోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః, తృణారవింద చక్షుషోః ప్రజా మహీ మహేంద్రయోః సమ ప్రవృత్తికః కదా సదా శివం భజామ్యహమ్.** ఏ ద్వంద్వాలూ లేకుండా ధర్మాన్ని పట్టుకున్నవాణ్ణి మాత్రమే రక్షిస్తాడాయన. కాబట్టి **వృషేశ్వరాయనంబున సంచరించుట నది అభావ్యంబయ్యె ఏలా ధర్మమున్ వీడెదన్.** పరమశివుడు తిరిగే సమయమమ్మా.అప్పుడు మనం అధర్మమాచరించ కూడదు. భగవన్నామస్మరణతో గడపాలంటాడు. అంతటి శక్తిమంతం ప్రదోషవేళ.

ప్రదోషవేళలో పరమపవిత్రమైన ఏ వస్తువు పట్లా కూడా అమంగళకరంగా ప్రవర్తించకూడదు, చూడకూడదు. మంగళసూత్రాలుంటాయి ఏ కారణం చేతా మంగళసూత్రాన్ని కించపరచేది, చిన్నబుచ్చేది, దానికి గౌరవం మాసిపోయేవి చూడడం,మాట్లాడుకోవడం,ఎప్పుడూ చెయ్యకూడదు.దేశంలో కలిపురుషప్రవేశం ఎక్కువైపోయిందని గుర్తేమిటంటే, ఏది పెట్టండి సాయంకాలమయ్యేటప్పటికి మెడలలో మంగళసూత్రాలు లాగేసే సన్నివేశాలతో కూడుకున్న సీరియల్సే ప్రసారమవుతుంటాయి. అవే కోట్లమంది చూస్తుంటారు. ఎక్కడ నిలబడుతుంది ధర్మం? కాబట్టి ఎక్కడ ధర్మం ఉంటుందంటే కాలం, దేశం ముడిపడడంలో ఉంటుంది. అందుకనే ప్రాతఃకాలంలో నిద్ర లేవాలి. ప్రాతఃకాలంలో నిద్రలేచాడు. ఎనభై ఎనిమిది నిమిషాల ముందు నిద్రలేచాడు. బాగుంది. నిద్ర లేవడమొక్కటే ప్రయోజనం కాదు.

నేను మీతో మనవి చేశా. కాలం రెండు కాళ్ళ మీద నడుస్తుందని. ఒకరోజు అంటే రాత్రి, పగలు. రాత్రి బాగా నిద్రపోకపోతే పగటిపూట ఆకలెయ్యదు. పగటిపూట కడుపునిండా తినకపోతే రాత్రి కనురెప్ప పడదు. అందుకే కడుపు ఖాళీగా ఉందండీ, రాత్రి నిద్రపట్టలేదంటాడు. రాత్రి నిద్రపట్టనివాడికి రాత్రి నిద్రపట్ట లేదండీ, అరగనే లేదండీ పగలు అన్నంతింటే అంటాడు. రాత్రి, పగలు రెండూ సమతౌల్యం కలిగినవి. అందుకే **శివశ్చ హృదయం విష్ణుః, విష్ణోశ్చ హృదయం శివః** అంటారు. రాత్రి స్వరూపమంతా పరమశివుడు.

పగటి స్వరూపమంతా శ్రీమహావిష్ణువు. శ్రీమహావిష్ణువు ఉద్దీపనమైన కాలమని గుర్తేమిటంటే, ఇంద్రియాలు పనిచేస్తుంటాయి. ఇంద్రియాలు పనిచేశాయీ అంటే విష్ణువు అధిపతి అయి నడిపిస్తుంటాడు. అందుకే ఏకాదశి తిథి అంటారు.

ఏకాదశి అంటే పదకొండు అని. ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, పదకొండవదైన మనస్సు. పదకొండింటినీ కూడా అధోక్షజుడు అంటే ఇంద్రియాలకు అధిష్ఠానమైన శ్రీమహావిష్ణువు పరం చేసి, ఉపవాసం చేసి విష్ణుస్మరణతో గడిపిన తిథి ఏకాదశి. ద్వాదశి హరివాసరం. మళ్ళీ అక్కడ ధర్మం మారి వెంటనే ఉపవాసాన్ని విరమణం చేస్తాడు. ఇంద్రియాలకన్నిటికీ కూడా అధిపతి అయి నడిపించే గొప్ప స్వరూపం శ్రీమహావిష్ణువు స్వరూపం. నిద్ర లేచాడన్న మాటకి అర్థమేమిటంటే ఆత్మ నుండి మనస్సు విడివడింది. మనసులోంచి ఇంద్రియాలు బయటికొచ్చాయి. ఇంద్రియాలు రాగానే కన్ను విప్పడానికి వీల్లేదు. తెలివొచ్చింది అని తెలుస్తుంది. ఆ, నేను నిద్రలోంచి మేలుకొన్నాను అనుకుంటాడు. మేల్కొన్నాను అంటేనే మనసుకి తర్ఫీదు ఇవ్వమని చెప్పింది వేదం. మనసులో నుండి రావలసిన మొట్టమొదటి ఆదేశమేమిటి? అంటే ఇవాళ ఏం చేద్దామని ఎగిరి దూకకూడదు మంచం మీద నుంచి.

మంచం మీద ఉండగానే కనురెప్ప విప్పకముందు మనసు ఇవ్వవలసిన మొట్టమొదటి ఆదేశమేమిటంటే, నిద్ర మేల్కొంది ఈ శరీరం కాబట్టి ఇంద్రియాలు పనిచెయ్యడం మొదలుపెట్టాయి. ఇప్పుడు ఈ ఇంద్రియాలన్నీ శ్రీమహావిష్ణువు శక్తితో, ఆయన ఎలా చెప్పారో, అలాగే పనిచెయ్యడం మొదలుపెట్టాలి. అందుకని నిద్రలేవగానే ఏ స్వరూపానికి భక్తులు కానివ్వండి వేదం పాటించడానికి వీల్లేదు. నేను నిద్రలేవకముందే ప్రకటంగా నా నోటి వెంట రావలసిన మాట మూడుమాట్లు శ్రీహరీ, శ్రీహరీ, శ్రీహరీ అని. **శ్రీలక్ష్మి, శ్రీశాక్తేయ ప్రణవం.** శ్రీసూక్తమంటారు. శ్రీ అంటే పరదేవత అమ్మవారు. శ్రీ అన్నదాంట్లో శకార, రకార, ఈ కారాలుంటాయి. సూక్తమంటే సు ఉక్తం అంటే బాగా చెప్పబడింది. అమ్మవారి గురించి ఇంతకన్నా నువ్వు చెప్పడం కుదరదు. ఋషి చెప్పేశాడు చాలా బాగా. ఇది చెప్పుకో చాలు. అది శ్రీసూక్తం. శ్రీ అమ్మవారు. ఆ శ్రీతో కూడిన హరి మేము పాపాల వైపు వెళ్ళకుండా, పాపబుద్ధులను హరించి తాను చెప్పినట్లు మేం నడిచేటట్లుగా చెయ్యగలిగినవాడై మమ్మల్ని రక్షించుగాక. మా ఇంద్రియాలు ఆయన చెప్పినట్లు నడుచుగాక అన్న

కోరికతో మూడుమాట్లు మొట్టమొదట కంఠం వెంట రావలసిన మాట శ్రీహరీ, శ్రీహరీ, శ్రీహరీ అని. ఆ తరువాత తన కులదైవం ఎవరుంటారో ఆ కులదైవం మూర్తి ఎటుంటుందో అటు వైపు తలతిప్పి కనురెప్ప విప్పాలి తప్ప, ఎటుపడితే అటు పడుకుని కనురెప్ప విప్పకూడదు.

నాకు తెలివొచ్చింది అంటే నేనేనిప్పుడు నెల్లూరులో ఉన్నాను. నా ఇంట్లో అయితే కులదైవం ఉంటుంది. ఇక్కడలా ఉండే అవకాశం ఉంటుంది, ఉండకపోతుంది. ఎక్కడున్నాను? నెల్లూరులో ఉన్నాను. వెంటనే నేను, నా ఇంట్లో పడకమీద పడుకుని ఉంటే తల ఎటు తిప్పితే నాకు నా కులదైవం కనబడతారో మానసికంగా అటు తలతిప్పాలి. ముందు మనోనేత్రంతో దానిని చూడాలి. ఇప్పుడు నీకు ఎదురుగుండా అలా ఉండదేమోనని అనుమానం ఉంటే నీ చేతివంక నువ్వు చూసుకోవాలి. అరచేతిని చూడాలి. అరిచేతిని చూస్తూ కళ్ళు విప్పాలి. నీ ఇంట అయితే నీ కులదైవం ఎదురుగుండా ఉండాలి ఏదో ఒక పక్కకి. ఉండి తల ఇటు తిప్పి చూడడానికి అవకాశముండాలి. అది దక్షిణదిక్కు కాకూడదు. కాకుండా తిప్పి చూడాలి. నోటి వెంట మూడుమాట్లు శ్రీహరీ, శ్రీహరీ, శ్రీహరీ అన్న నామం రావాలి.

ఇప్పుడు నిద్ర లేచావు. ఒక్క నిముషం మంచం మీద కూర్చోవాలి. ఒక్క క్షణం కూర్చుని ముందు జాగ్రత్తగా కుడికాలు తీసి కుడిపాదాన్ని భూమి మీద ఉంచుతూ మనసులో స్మరణ చెయ్యాలి. ఆమె ఎవరు? భూదేవి. నా తండ్రి అయిన శ్రీమహావిష్ణువు ఇల్లాలు. ఆ కారణంచేత మా అమ్మ. నేను పుట్టీ పుడుతూనే మా అమ్మ ఒళ్ళో పడుకుని నా కాలెత్తి ఆవిడ గుండెల మీద తన్నాను, ఆవిడ పాలు తాగుతూ. నేనావిడ గుండెల మీద తన్నినా కూడా ఆవిడ నా అరికాలు ముద్దు పెట్టుకుని పాలిచ్చి పెంచి పెద్ద చేసింది. అప్పుడూ అమ్మ గుండెల మీద తన్నాను. ఇప్పుడు అమ్మ గౌరవం తెలిసి అమ్మకి నమస్కరించగలనేమో కానీ, ఈ జన్మలో తల్లి కాదు, ఎన్ని జన్మలకీ తల్లి అయిన వసుంధర. ఆ భూదేవి మీద కాలుపెట్టి నడవకుండా నా బ్రతుకు వెళ్ళదు. చిన్నప్పుడు తన్నకుండా నా బ్రతుకువెళ్ళలేదు. ఇప్పుడు కాలు పెట్టకుండా నా బ్రతుకువెళ్ళదు. నడవాలంటే ఆవిడ మీదే నడవాలి. కూర్చోవాలంటే ఆవిడ మీదే కూర్చోవాలి. మలమూత్రాలు విసర్జించాలంటే ఆవిడ మీద విసర్జించాలి. చిట్టచివరికి ఇల్లు కట్టుకోవాలంటే ఆవిడ గుండెలమీద గొయ్యి

పెట్టాలి. నా కడుపుకి అన్నం కావాలంటే నాగేటిచాలుతో ఆవిడ గుండెలమీద రాపాడించాలి. నేను ఇన్ని ఇబ్బందులు పెడితే ఆవిడ చిరునవ్వు నవ్వుతూ నాకు అన్నం పెట్టి పోషిస్తోంది. బ్రతికున్నంత కాలం మా వాడు, మా వాడు అని కౌగిలించుకున్నవాళ్ళు శరీరం విడిచిపెట్టేసిన తరువాత ఎవ్వరూ ఉంచుకోకపోతే, ఆవిడ ఒక్కత్తే తన కడుపులో పెట్టుకుంటుంది. అటువంటి అమ్మ, అమ్మా నాకు బ్రతుకులేక, తప్పక నా స్వామి అయిన శ్రీమహావిష్ణువు ఇల్లాలివి, నా తల్లివి. అమ్మా, కాలుపెట్టి తొక్కుతూ లేస్తున్నాను. అమ్మా నా ఈ అపరాధాన్ని మన్నించు. మళ్ళీ నిద్రపోయేవరకూ ఇలాగే తొక్కుతాను. అమ్మా నాకు బ్రతుకులేదు. దిక్కు లేదు. ఇంతకన్నా అవకాశం లేదు అని **సముద్ర వసనే దేవీ పర్వత స్తన మండలే విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదాహతిం మస్వమే** అమ్మా, నన్ను క్షమించమ్మా అని నమస్కారం చెయ్యాలి. చేసి కుడికాలు పెట్టాలి. తరువాత రెండో కాలు పెట్టి భూమి మీద నిలబడి ఇలా తూర్పు దిక్కుకు తిరగగానే గురువుగారు వచ్చి ఎదురుగుండా నించున్నారన్న భావన పొందాలి.

గురువుగారి పాదాలు ఎప్పుడూ జ్ఞాపకంలో ఉండాలి. గురువుగారి పాదం మీద పుట్టుమచ్చ, ఆయన పాదాలు, పిక్కలెలా ఉంటాయో కూడా గుర్తుండాలి. గురువుగారు ఎదురుగుండా ఉన్నారన్న భావనతో నేలమీద పడిపోవాలి. ఒక స్వర్ణదండమెలా పడిపోతుందో అలా పడి ప్రణిపాతం చెయ్యాలి. ప్రణిపాతం చేసి నమస్కరించి ఒక్క ఐదు నిముషాలు కూర్చోవాలి. కూర్చుని ప్రాణాయామం చెయ్యాలి. మూడుమార్లు ప్రాణాయామం చేస్తే మనసు వశమవుతుంది. వశమైన మనస్సుని ఆధారం చేసుకుని ఒక్క అయిదు నిమిషాలు ధ్యానం చెయ్యాలి అలాగే కూర్చుని. అయిదు నిమిషాలు చెయ్యండి, ఒక నిమిషం చెయ్యండి ధ్యానం చెయ్యాలి. దేన్ని ధ్యానం చెయ్యాలని అడిగారు. శంకరాచార్యులవారు ఈ జాతికి మహోపకారం చేశారు. ఎన్ని ప్రాతః స్మరామి స్తోత్రాలిచ్చారో ఆయన. మీ ఇష్టం. నువ్వు విష్ణుస్వరూపాన్ని భజన చేస్తూ నిద్రలేచావు కాబట్టి జాగృత్ ఒక్కసారి విష్ణుదర్శనం చెయ్యాలని నువ్వనుకున్నావా, భీష్మస్తుతిలో ఒక్క పద్యం నీకు జ్ఞాపకానికి వస్తే చాలు.

భీష్మాచార్యులవారు శ్రీకృష్ణభగవానుణ్ణి స్తోత్రం చేస్తూ అంటారు. ఆయన ఒళ్ళంతా కూడా నీలమేఘకాంతితో ఉంటుందట.

**త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింప బ్రాభాతనీ**
**రజబంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీ లాలక**
**వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా**
**విజయుం జేరెదు వన్నెలాడు మదినా వేశించు నెల్లప్పుడున్.**

**(భాగ. 1. 218)**

అంటారు. కాబట్టి ఆ నీలమేఘశ్యాముడు నీలమైన కాంతితో మెరిసిపోతున్న ఆ కృష్ణభగవానుడు, ఆయన కుడికాలు కిందపెట్టి ఆ ఎడమకాలు బాగా భూమిమీద మోపి, కుడికాలు విలాసంగా ఇలా ఎడమ పాదం పక్కనుండి పెట్టి కొంచెం పైకెత్తిపెట్టి ఇలా వేళ్ళ మీద నిలబడితే, అరికాలు కనబడేటట్లు వెనకాతల ఉండే ఆ అరికాలు వెనకభాగం ముద్దలా కనబడుతుంటే ఎర్రగా అరికాలు, నల్లగా ఆయన పాదం నీలమేఘ కాంతితో, అక్కడే ఒక చిన్న ఆవుదూడ, దాని గంగడోలు, అది తన ముట్టితో అక్కడున్న గడ్డిపరకలు తింటున్నట్టు, ఆయన మోకాళ్ళు, పట్టుపంచె, ఆయన నడుము, త్రిభంగిగా-ఆయన ఎడమకాలి మీద నిలబడి కుడికాలు విలాసంగా వేసి కొద్దిగా ఇలా వంగి ఉండడంలో నడుము త్రిభంగిగా-ఉండి ఆయన వక్షఃస్థలం, ఆయన మెడలో వేసుకున్న మందారమాల, ఆయన చిన్న గడ్డం, ఎర్రటి పెదవులు, రెండు చేతులూ ఒకదానికొకటి అభిముఖంగా వస్తూ ఈ వేళ్ళు ఇలా వచ్చి పట్టుకున్న వేణువు, ఆయన పెదవుల దగ్గర పెట్టుకున్న వేణువు, ఆ వేళ్ళు కదులుతూ ఇలా ఆ వేణువు రంధ్రాలు మూసి, వదులుతూ ఆయన వేణురవం, యమునానది, చుట్టూ ఆవుదూడలు, గోపకాంతలు, ఆయన విశాలమైన లలాటభాగం, దానిమీద పెట్టుకున్న కస్తూరి తిలకం, ఆయన నాసాగ్రం, ఆ ముక్కు చివర ఉన్న ముత్యం, ఆయన కపోలాలు, ఆయన చెవులు, చెవులకు పెట్టుకున్న కుండలాలు, కరుణారసవర్షం కురిపిస్తున్న ఆ కన్నులు, ఆ కన్నులలో నుంచి మనల్ని ప్రేమగా చూసినట్లు, ఆ కిరీటం, ఒక్కసారి ఆపాదమస్తకం దర్శనం చేసి ధ్యానంలో నువ్వు లేవచ్చు. మనసంతా బ్రహ్మముహూర్తం కాబట్టి పరమేశ్వరమయమైపోయి సత్త్వగుణ ప్రధానమవుతుంది. శాంతి ఆరోగ్యకారకం.

లేదూ – శంకర భగవత్పాదులు చెప్పినట్లు **ప్రాతర్నమామి పరమేశ్వర పాద పద్మం, పద్మోద్భవారమ మునీంద్ర మనోనివాసం, పద్మాక్షనేత్ర సరసీరుహ**

పూజనీయం పచ్చటి పట్టుబట్ట కట్టుకుని సింహాసనంలో కూర్చుంటే తెల్లగా మెరిసిపోతూ **అప్రాకృత శరీరం తం అతిమన్మథరూపిణం ఘృతరీతి ఘనీభూతం సచ్చిదానంద విగ్రహం** అంటుంది లింగపురాణం. రాశీభూతమై పేరుకున్న నెయ్యి ఎలా ఉంటుందో అలా తెల్లటి పరమశివుడు, తెల్లటి పాదాలు, పాదాలకు అలదిన గంధం, చుట్టూ పెట్టిన పారాణి, ఆ పాదాల మీద పూజ చేయబడిన తెల్లటి మల్లెపూలు, ఆ పక్కనే నా తల్లి, ఆవిడ పచ్చటి పట్టు పుట్టం, ఎర్రటి పాదాలు, పసుపు, పారాణి, బొటనవేలు విడిచిపెట్టి పక్కనున్న రెండు వేళ్ళకి పెట్టుకున్న బంగారు మట్టెలు, ఆ పారాణి పాదాలమీద పూజ చేయబడిన సన్నజాజి పూలు, ఆ పాదాల జంట మీద ఇలా తలపెడితే ఆ పుష్పవాసన, లత్తుక వాసన, గంధం వాసన, పసుపు వాసన ఇవన్నీ పీలుస్తూ ఒక్క రెండు, మూడు నిమిషాలు ఆ ఆనందాన్ని అనుభవించి మీరు ప్రశాంతంగా లేచి నిలబడ్డారనుకోండి. ఎనభై ఎనిమిది నిమిషాల ముందు లేవడం దీనికోసం లేవమన్నారు. లేచి ఇప్పుడు ప్రాతఃస్మరామి శ్లోకాలు మనసులో చదువుకుంటుంటాడు. అందుకే స్మరామి, స్మరామి అని వస్తాయవన్నీ. ప్రాతఃస్మరామి అని శ్రీశైల మల్లికార్జున సుప్రభాతంలో కూడా ఆ గణపతిని ఒక్కసారి స్మరించమంటారు.

ఈ లోకంలో మనసు చాలా సంతోషాన్ని పొందేటట్లు చెయ్యగలిగినవి, లక్ష్మీ కటాక్షాన్ని కల్పించగలిగినవి ఐదే ఐదు వస్తువులున్నాయి. లక్ష్మీస్థానాలు. లక్ష్మీస్థానాలలో ఒకటి ఏనుగు కుంభస్థలం. రెండవది పద్మం. మూడు సువాసిని పాపట. నాలుగవది తామరపువ్వు. ఐదవది ఆవు వెనకభాగం. ఈ ఐదూ లక్ష్మీస్థానాలు. మీ ప్రయత్నం లేకుండా మీ మనసు లయమయ్యేటట్లు చెయ్యగలిగేవి మూడే ఉన్నాయి. ఒకటి ఏనుగు కుంభస్థలం, ఏనుగు ముఖం, రెండిటికీ ఏనుగే. రెండవది పూర్ణచంద్రబింబం, మూడవది సముద్రం. ఈ మూడూ మీ ప్రమేయం లేకుండా మీ మనసుని లయం చేస్తాయి. ఈ రెండు రకాలుగానూ కూడా పరమపవిత్రమైన ముఖం ఏనుగు ముఖం.

**ప్రాతః స్మరామి పరమేశ్వర వక్త్రపద్మం,**
**ప్రాతః స్మరామి పరమేశ్వర బాహుదండాం,**
**ఖట్వాంగ శూల హరిణాహ పినాకయుక్తాం,**

**గౌరీకపోలరంజిత పత్రరేఖాం,**

**సౌవర్ణ కంకణ మణిద్యుతి భాసమానాం.**

నేను ఉత్తరేణి పుల్ల పెట్టి దంతధావనం చెయ్యాలనుకోండి, ఉత్తరేణి పుల్లతో దంత ధావనం చెయ్యాలని శాస్త్రం. ఉత్తరేణి పుల్ల తెచ్చుకుని దానిని నోట్లో పెట్టుకుంటుంటే చెయ్యి కదులుతుందా, కదలదా? నా చెయ్యి కదులుతుంటే నాకు **ప్రాతః స్మరామి పరమేశ్వర బాహుదండాం** పరమశివుని చెయ్యి గుర్తొచ్చింది. **ఖట్వాంగ శూల హరిణాహ పినాకయుక్తాం,** ఒక చేతిలో గండ్ర గొడ్డలి, ఒక చేతిలో జింక, ఒక చేతిలో త్రిశూలం మొదలైనవి పట్టుకున్న చతుర్భుజుడైన పరమశివుడు ఆయన చేతులు ఇలా కదుపుతుంటే **ప్రాతః స్మరామి పరమేశ్వర బాహుదండాం ఖట్వాంగ శూల హరిణాహ పినాకయుక్తాం, గౌరీకపోలరంజిత పత్రరేఖాం, సౌవర్ణ కంకణ మణిద్యుతి భాసమానాం** బంగారు కంకణాల కాంతి తెల్లటి శరీరం మీద పడితే తెలుపు, పసుపు కాంతులు కలిసి కొత్త కాంతి బయటకు కొడుతూ ఉంటే ఆయన చేతులు కదుపుతున్నప్పుడు కంకణాలు ఒరుసుకుని కణ కణ కణమని శబ్దాలను నేను స్మరిస్తూ నేనిలా పళ్ళు తోముకుంటూ దంతధావనంలో పరమశివుని బాహువుల కదలికలని ఆలోచించమన్నారు. బ్రహ్మ ముహూర్తంలో ఒక్క క్షణం వృథా చెయ్యడానికి వీలులేదు. పరమేశ్వరోన్ముఖం చెయ్యాలి మనస్సునంతటినీ. చేసి ఇప్పుడు కాలకృత్యాదులను పూర్తిచేసి స్నానానికి వెళతాడు.

స్నానమనేది వేదంలో అత్యంతపవిత్రమైన కర్మ. స్నానం అంటే కేవలం ఏదో శరీరాన్ని రుద్దుకుని, శరీరాన్ని బాగా ఉంచుకోవడానికి చేసేదే కాదు. స్నానం ఆరు రకాలైన ప్రయోజనాల కొరకు ఆరు విధాలుగా చేస్తారని చెప్పింది వేదం. అందులో మొట్టమొదటి స్నానాన్ని మలాపకర్షణ స్నానం అని పిలుస్తారు. రెండవ స్నానాన్ని క్రియాంగ స్నానం అని పిలుస్తారు. మూడవస్నానాన్ని క్రియాస్నానం అని పిలుస్తారు. నాల్గవ స్నానాన్ని కామ్య స్నానం, ఐదు తీర్థ స్నానం, ఆరు నైమిత్తిక స్నానం. ఆరు రకాలుగా అంటే నా ఉద్దేశ్యం ఆరుసార్లు చెయ్యమని కాదు. స్నానం ఆరు విధాలై ఉంటుంది. స్నానం అన్నమాటకి యథార్థమైన అర్థం నిలబడి నీళ్ళు పోసుకొనటం కాదు. మనం వేరే పాత్రలోని నీరు తీసేసి పోసేసుకోకూడదు. మధ్యనం. మధ్యనం అంటే శరీరం మునక వెయ్యాలి. అంటే దానర్థమేమిటి?

నదీతీరంలో నువ్వుండి నదిలో స్నానం చెయ్యి అని అర్థం. అథవా చెరువులోనో, ఏట్లోనో స్నానం చెయ్యమని. మరి అలా లేకపోతే ఏం చెయ్యాలండీ అంటే దూడస్నానం. తప్పదప్పుడు చెంబుతో నీళ్ళు తీసి నీమీద నువ్వు పోసుకోవాలి. కానీ మొట్టమొదటి స్నానం దేనికి చేస్తారంటే మలాపకర్షణ కొరకు. మలాపకర్షణ స్నానమంటే అర్థమేమిటో తెలుసా? శరీరంనుండి నిరంతరమూ మలం ఊరుతూ ఉంటుంది. అది నిరంతరస్రావం. కళ్ళలో ఉన్న ధూళికణాలన్నీ పక్కకి చిన్న పుసి కింద వస్తుంటాయి. చెమట రోమకూపాల్లోంచి బయటకొస్తూ ఉంటుంది. నాలుక మీద పాచి ఏర్పడుతుంటుంది. అలాగే మలమూత్రాలూ సిద్ధమవుతూ ఉంటాయి. ఇవన్నీ కూడా శరీరాన్ని అయోగ్యం చేసేవి. భగవత్ స్పర్శ నుంచి దూరం చేస్తాయవి. అవి మనసుని నిలబడనివ్వవు. వీటిని తొలగించుకుని భగవంతుని ఉపాసన చెయ్యడానికి ఉపక్రమించడం కోసమని చేసే స్నానానికి మలాపకర్షణ స్నానమని పేరు. అందుకే మనం చేసే స్నానమంతా ప్రతి రోజూ మలాపకర్షణ స్నానమంటారు. మలాపకర్షణ స్నానం కేవలం శరీరశుద్ధి కొరకు కాదు. దాని ప్రధానప్రయోజనం భగవంతుడి దగ్గర మనసు కదలకుండా కూర్చోడం. అలా కూర్చోవడానికి వీలుగా దేశకాలసంకీర్తన చెయ్యని స్నానం చెయ్యకూడదు.

దేశకాలసంకీర్తనమంటే మళ్ళీ ఒకసారి చెప్పాలి. ఏదో ఫలానా చోట **నెల్లూరు మహా క్షేత్రే వసతి గృహే సమస్త గురు దేవతా బ్రాహ్మణ హరిః సన్నిధౌ అస్మిన్ వర్తమానేన శ్రీఖరనామ సంవత్సరే మార్గశీర్ష మాసే కృష్ణ పక్షే** అని తిథి చెప్పి నేను స్నానం చేస్తున్నానని సంకల్పం చేసుకుని, **గంగేచ యమునైచైవ గోదావరి సరస్వతీ నర్మదే సింధు కావేర్యో జలేఽస్మిన్ సన్నిధింకురుః ఆయాంతు స్నానం ద్రవ్యాణి సంపుట్యాం** అని ముందు మూడుమాట్లు చల్లుకుని వేడినీళ్ళయితే కాళ్ళతో, చన్నీళ్ళయితే తలతో మొదలుపెట్టమంది. కొంచెం శరీరం అనారోగ్యంతో ఉంటే ఉష్ణజలస్నానాన్ని వేదమంగీకరించింది. కొన్ని కొన్ని నదుల పేర్లు తలుచుకుంటే చాలు, ఆ నదిలోనే స్నానం చేసేసినట్లు. అందుకే గంగతో ప్రారంభం చేస్తారు. ప్రతిరోజూ వాడు గంగాస్నానం చేసేసినట్లే. అదే వేదం గొప్పదనం. నువ్వు అవకాశం లేక ఎక్కడో ఉండిపోతే, నువ్వు చెయ్యలేనిదానిని నీ మనస్సు చేత నువ్వు చేసుకునేటట్లు నిన్ను అనుగ్రహిస్తుంది. అందుకని గంగాది నదులను స్మరించి స్నానం చెయ్యాలి. ఒకవేళ గంగాది నదులను స్మరించడం

మాకు చేతకాదండీ ఎలాగా అంటే, ఒక్కటే నామం చెప్పుకొమ్మన్నారు. నీకేమీ చేతకాకపోతే మూడుమాట్లు గోవిందా, గోవిందా, గోవిందా అంటే చాలు. నువ్వు అన్ని సంకల్పాలూ చేసేసుకున్నట్లే. పురుషుడు ప్రతిరోజూ శిరఃస్నానం చెయ్యాలి. స్త్రీ నైమిత్తిక, తిథులలో చేస్తే చాలు. ఉత్తి రోజులలో నీళ్ళు చల్లుకుంటే ఆమె ప్రతిరోజూ తలస్నానం చేసినట్లే. వేదం అంగీకరించింది. కాబట్టి ఇప్పుడు అలా చేసే స్నానాన్ని మలాపకర్షణ స్నానమని పిలుస్తారు.

రెండవ స్నానం క్రియాంగ స్నానం. నేను స్నానం చేసేశాను పంచె కట్టుకున్నాను. ఈ లోగా మా ఆవిడ వచ్చి ఏమండీ, జ్ఞాపకం ఉందా ఇవాళ ఫలానా ముఖ్యమైన పని ఉంది ఏం చెయ్యమంటారని అడిగింది. నేనేదో చెప్పాను. అలా చేస్తే గతంలో ఇబ్బందొచ్చింది కదా. ఇంకోలా చేస్తే ఎలా ఉంటుంది అంది. దిక్కుమాలిన మనుష్యులింతే. మనం మంచిగా చెప్పినా వాళ్ళు వినరు. కొంచెం కోపమొచ్చింది. రజోగుణసంపర్కంతో మాట్లాడాను. సరే వాళ్ళ ప్రారబ్ధం, మనమేం చేస్తాం? వాడికి మనం చెప్తే అక్కర్లేదు. వాడికిష్టమొచ్చింది చెయ్యాలి. అలాగే కానీ అన్నాను. ఇప్పుడు నాకు చీకాకుకు మనసు కదిలిపోయిందా మళ్ళీ. ఇప్పుడు నేను జపం చేద్దామని కూర్చున్నాననుకోండి, వాడి దగ్గరికే వెళుతుంది. వాడు చెప్పినమాట వినడు. వాడి గురించి ఆలోచిస్తుంటుంది, ఇక్కడ మాల తిరుగుతూ ఉంటుంది. అందుకని క్రియాంగస్నానం చెయ్యమన్నారు. అందుకే జపం చేసేటప్పుడు, మీరు గాయత్రీజపం చేసేటప్పుడు చేస్తారు.

**ఆపో హి ష్ఠా మయోభువ**
**స్తాన ఊర్జే దధాతన,**
**మహే రణాయచక్షసే**
**ఓం యోవః శివతమో రస**
**స్తస్య భాజయతేహ నః**
**ఉశతీ రివ మాతరః.**

అంటూ నీళ్ళు చల్లుకుంటారు. రెండు మూడు పర్యాయాలు చేస్తారందుకే. క్రియాంగస్నానమంటే కదిలిపోయిన మనసుని మళ్ళీ వెనక్కి తీసుకొచ్చి నిలబెట్టే ప్రక్రియ. మళ్ళీ మంత్రజపానికి వీలుగా అంగంగా చేసే స్నానానికి క్రియాంగ స్నానమని పేరు.

ఒక్కొక్కసారి పెద్ద ప్రయోజనమే సిద్ధిస్తుంది స్నానంచేస్తే. అంత పెద్ద ప్రయోజనం కోసం చేసే స్నానాన్ని కామ్యస్నానమని పిలుస్తారు. రామాయణంలో వర్ణిస్తారు. గంగావతరణం జరిగింది. ఓహో..... ఆకాశంలోంచి పెద్ద ప్రవాహంతో గంగమ్మ వచ్చి పరమశివుడి తల మీద పడింది. గంగమ్మ శక్తి గంగమ్మగా కాదు. గంగమ్మకి శక్తి ఎందుకొచ్చిందంటే శివుడికి తగిలింది కాబట్టి. నేను చెప్పటంలేదు ఈ మాట. రామాయణంలో వాల్మీకి మహర్షి చెప్పారు. **'భవాంగ పతితంతోయం పవిత్రమితి పస్పృశుః'** అన్నారు. పరమశివుడి శరీరానికి తగిలి కింద పడుతోంది కాబట్టి గంగకంత శక్తివచ్చింది. పాపాలను తియ్యగలిగింది. కాబట్టి ఇప్పుడు ఆ గంగని ఇలా చల్లుకున్నాడు. గంగను ఒక్క చుక్క తాగాడు. గంగలో మునక వేశాడు. పాపాలు పోయాయి. గంగాస్నానం ఒకప్పుడు గంగావతరణం జరిగినప్పుడు పరమశివుడికి తగిలి పడుతుంటే మహాపాపాలు చేసినవాళ్ళందరూ చల్లుకుని స్వర్గలోకానికి పోయారు. అంటే కామ్యస్నానం చేశారని. కోర్కె కోసం తీర్థంలో స్నానం చేస్తారు. పూర్వం సంతానం కలగకపోతే ఒక ప్రత్యేకమైన నదిలోనూ, తీర్థంలోనూ స్నానం చేస్తుండేవారు. దానిచేత అనుగ్రహం కలుగుతుందీ అని. దాన్ని కామ్యస్నానం అని పిలుస్తారు.

ఇక క్రియాస్నానమంటారు. క్రియాస్నానమంటే నదీస్నానమని గుర్తు. నేను క్రియాస్నానానికెళుతున్నానండీ అంటాడొకాయన. క్రియాస్నానం చేస్తానంటే ఏదో ఒక పని చేస్తానని కాదు, నదిలో స్నానం చేస్తానని. నదిలో ఎందుకు స్నానం చెయ్యాలీ అని అడిగారు. తప్పకుండా నదీస్నానం చెయ్యాలి. నదీస్నానమెందుకు చెయ్యాలో తెలుసా? సంస్కృతభాషకున్న గొప్పదనమదే. ఆ పేరు వెనకనే అసలు దాని గొప్పదనమేమిటో చెప్తారు. నది అన్న మాటకి అర్థమేమిటంటే **యస్మాత్ నాదం కృతవత్యః తస్మాత్ నదీతి నామధేయం ప్రాప్తాః ఇతి చందనశీలాః** నది ఏర్పడాలంటే ఆకాశంలో ఉండే నల్లటి మబ్బులో మెరుపు మెరుస్తుంది. మెరుపులో విద్యుత్తు ఉంటుంది.

దాన్ని మనకి బెంజమిన్ ఫ్రాంక్లిన్ లాంటి వాళ్ళు నిరూపించారు కూడా. ఆకాశంలో మెరుపు ఉండి మబ్బులో ఆ మెరుపు మెరిసి వాన పడుతుంది. ఆ వాన పడేటప్పుడు మెరుపులో ఉన్న కాంతిని పుచ్చుకుంటుంది. పుచ్చుకుని పైనుంచి

కిందపడుతుంది. కింద పడ్డప్పుడు అది రాతి మీద పడి పెద్ద ఘోష చేస్తుంది. చేసి నదిగా మారి నిశ్శబ్దంగా వెళ్ళదు. **ఇతి చందనశీలాః** – అది పెద్ద చప్పుడు చేస్తూ వెళుతుంది. అందుకే మీరు నదీతీరంలో వినండి, నది వెళ్ళే శబ్దం ఒకలా ఉంటుంది. సముద్రపుటొడ్డున కూర్చుని వినండి, సముద్రఘోష ఒకలా ఉంటుంది. నది శబ్దం ధ్యానానికి యోగ్యం. సముద్రశబ్దం మనసును కదుపుతుంది. మనసుని ఉద్వేగపరుస్తుంది. భయపెడుతుంది. సముద్రఘోష మనసు లయమవడానికి కారణం కాదు. కానీ నది శబ్దం ఉందే అది మనసుని లయం చేస్తుంది. అది అంత అందంగా చప్పుడు చేస్తూ వెళుతుంది. రాళ్ళమీదా, బండల మీదా వెళ్ళినప్పుడు, సుడిగుండాలుగా తిరుగుతున్నప్పుడు అది ఒకరకమైన చప్పుడు చేస్తూ వెళుతుంది. మీరు ఎక్కడైనా ప్రశాంతమైన రేవులోకి వెళ్ళి ఏకాంతంగా ఉన్నప్పుడు జనం లేనప్పుడు కూర్చుంటే, ఆ నది కదలికల చప్పుడు వినబడుతుంది. అప్పుడు ధ్యానం చేస్తే తొందరగా మనోలయమవుతుంది. అంత గొప్ప చప్పుడు చేస్తూ ప్రవహించే దాన్ని **ఇతి చందనశీలాః నదీ** అని పిలుస్తారు. ఆ నది రావడమే అంత గొప్పగా వస్తుంది. అందుకనే దాని నీటిలో రోగాలను హరించగలిగిన శక్తీ, పాపాలు తియ్యగలిగిన శక్తీ ఉంటాయి.

అన్నం తింటే కడుపు నిండుతుందండీ అంటే అన్నం తిని కడుపు నిండడం తెలుస్తుంది. అన్నం తిని కడుపునిండి తిన్న అన్నం పచనమై రక్తంగా ఎలా మారిపోయిందో నీకు కనబడుతోందా రోజూ? కనబడడంలేదు. అయినా నువ్వు నమ్ముతున్నావా, లేదా? నది కూడా అంతే. ఇది కనబడకపోయినా ఎలా నమ్ముతున్నావో పరమేశ్వరుడు చెప్పిన వేదాన్ని నమ్మాలి. ఇది నా కంటితో చూస్తే నమ్ముతానండీ అంటే ఏది నీ రక్తంగా మారడం నువ్వు చూస్తున్నావా, ఎలా తింటున్నావు? ఇది ఎంతో, అదీ అంతే. నదీస్నానం చేత పాపపరిహారమవుతుంది అందుకే పురుషుడు ప్రవాహానికి అభిముఖంగా స్నానం చెయ్యాలి. స్త్రీ వాలుగా చెయ్యాలి. శ్రావణమాసం స్నానం చెయ్యకూడదు. ఎందుచేతా అంటే పురిటి సమయం. ప్రతి దానికీ పురిటి కాలం ఉంటుంది. చింతకాయకి కూడా పురిటి కాలం ఉంటుంది. పురిటికాలంలో తినడాన్ని శాస్త్రం అంగీకరించదు. పురుడు తీరిపోవాలీ అంటారు. అందుకే జున్నుపాలు తాగరు. జున్నుపాలు తెలియకుండా తాగేస్తే మళ్ళీ ఉపనయనం చేసుకోవాలి. శ్రీరామాయణం చదవండి కావాలంటే. అందుకే

జున్ను అందరూ తినరు. జున్ను ముట్టుకోనండీ అంటారు. ఉపనయనమైపోయిన తరువాత ఎలా తీశారో తెలియదు. అందుకే జున్ను ముట్టుకోరు పెద్దలు. కాబట్టి ఆ నదీస్నానమంత గొప్పది.

శ్రావణమాసంలో అది పుట్టల మీద నుంచి కూడా వచ్చేస్తుంది. పుట్టలలో ఉన్న పాములు నీటిలో కొట్టుకొస్తూ ఉగ్రతతో ఉంటాయి. నువ్వు చీకట్లో తెల్లవారకట్ల స్నానం చేస్తే కాటేస్తుంది. అందుకని శ్రావణమాసంలో నదీస్నానం నిషేధించబడింది. చెయ్యవద్దంది వేదం. మళ్ళీ భాద్రపదమాసంలో స్నానం చెయ్యవచ్చు. భాద్రపదమాసంలో మట్టీ, అవీ కలిసిపోయి, కొత్త వరదతో నీరు ఎర్రగా ఉండి తాగితే, అతిసారవ్యాధులొస్తాయని ఓషధీతత్త్వంతో నదిని శుభ్రం చెయ్యడానికి కేవలం ఆకులు, అలములు వెయ్యడం కాదు, ఏయే ఆకులను పట్టుకెళ్ళి నీటిలో కలపడం వల్ల నీరంతా పరిశుభ్రమై ఓషధీతత్త్వాన్ని పొందుతుందో అటువంటి ఇరవై ఒక్క పత్రులను నిర్ణయించి, విఘ్నేశ్వరుడికి పూజచేసి తీసుకెళ్ళి నిమజ్జనం చేస్తారు నదిలో. ఈ ఆకులన్నీ కలిసి కొత్త నీటిలో ఉండే సూక్ష్మక్రిములు మరణిస్తాయి. నేరేడు మారేడు నెలవంక మామిడి దూర్వార చెంగల్వ ఉత్తరేణు వేరు వేరుగా తెచ్చి వీట్లతో పూజించు పర్వమున దేవ గణపతికినిపుడు అని మనం చదువుతాం కదా! ఆ పత్రులన్నీ ఓషధీ తత్త్వమున్న పత్రులు. ఓషధీతత్త్వమున్న పత్రులు కొత్త నీటిలో ఉండే సూక్ష్మక్రిములను చంపగలిగినవాటిని ఋషులు నిర్ణయం చేశారు. వాటిని ఈశ్వరుడికి ఆరాధనం చేస్తే **అర్ఘ్యం సమర్పయామి, పాద్యం సమర్పయామి** అన్నప్పుడు నీళ్ళు పోసిన మట్టి మూర్తిలో నుండి ఈ ఆకులు కలిసి ఒకదానిమీద ఒకటి ఒత్తుకుంటే తడిలో, అందులోంచి వేడిపుట్టి పత్రి పట్టుకెళ్ళి నదిలో కలిపేస్తే ఆ నదిలో ఉన్న సూక్ష్మజీవులన్నీ మరణించి ఆ నీరు పశువులూ, పక్షులూ, మనమూ తాగడానికి యోగ్యమవుతుంది. పూర్వం ఈశ్వరారాధనగానే నీటిని శుభ్రం చేసుకున్నారు తప్ప లౌకికప్రయత్నాలు, రసాయనాలు వాడడాలు ఈ జాతికి తెలియవు. ఏది చేసినా ఈశ్వరకృపగానే. భాద్రపదమాసంలో స్నానం, విఘ్నేశ్వరుడి నిమజ్జనం. కాబట్టి నదీస్నానం దేనికొరకు చేస్తాడూ అంటే నదీస్నానం వల్ల విశేషమైన భగవదనుగ్రహాన్ని సంతరించుకుంటాడు. అందుకని నదీస్నానం చెయ్యాలి. తేజస్సు పొందుతాడు. అది ఓషధుల నుంచి ప్రవహిస్తుంది.

ఓషధులు రాత్రివేళ చంద్రకిరణాల చేత ప్రకాశిస్తాయి. చంద్రకిరణాలలో అమృతత్వం ఉంటుంది. అందుకే సుధాకిరణుడు అని పేరు. ఆ అమృతకిరణాలన్నీ కూడా నీటిలో పడతాయి. నీటిలో పడితే రాత్రంతా నది అమృతకిరణాల శక్తిని పొందుతుంది. అప్పుడు ఆ శక్తితో కూడుకున్న నీటిలో శరీరాన్ని మజ్జనం చేశాడనుకోండి. ఆ అమృతతత్త్వం శరీరంలోకి ప్రవహిస్తుంది. ప్రవహించి మనసు భగవదభిముఖ్యం అవుతుంది. శరీరమూ రోగ గ్రస్తం కాకుండా ఆరోగ్యంతో నిలబడుతుంది. అందుకని ఆరు రకాల స్నానాలలో క్రియాస్నానాన్ని శాస్త్రం విధించింది. నదీస్నానం చెయ్యవలసిందే. ప్రవహిస్తున్న నదిలో స్నానం ఉత్తమోత్తమం. కాబట్టి ఆరు స్నానాలలో మలాపకర్షణ స్నానం, క్రియాంగస్నానం, కామ్యస్నానం, క్రియాస్నానం, తీర్థస్నానం.

తీర్థస్నానమంటే తీర్థాలని ఉంటాయి. దాంట్లో స్నానం కొరకే వెళతాం మనం. అందుకే ఈశ్వరదర్శనయాత్ర. క్షేత్రయాత్ర అనరు. తీర్థయాత్ర అంటారు. తీర్థయాత్ర అన్నమాటకి అర్థమేమిటంటే పూర్వం తీర్థయాత్రకి వెళుతున్నాడూ అంటే రెండు గావంచాలు, రెండు తువ్వాళ్ళు అంతే. ఎందుకని? వాడు వెళ్ళేది తీర్థాల్లో స్నానం చెయ్యడానికి. అక్కడ ఏ తీర్థముందో దానియందు గ్రుంకులిడతారు. తీర్థంలో అంగిరసాది మహర్షులు ఒకానొకప్పుడు గొప్ప యజ్ఞయాగాది క్రతువులుచేసి, ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయేముందు గొప్ప తేజస్సును తీర్థాలలో నిక్షేపించి వెళ్ళిపోయేవారు. ఎవరు అక్కడికెళ్ళి స్నానం చేస్తారో వాళ్ళకి విశేషమైన తేజస్సు కలుగుతుంది. పాపపరిహారమవుతుంది. యజ్ఞయాగాది క్రతువుల శక్తి కలుగుతుంది. అందుకని తీర్థస్నానం. గంగానదికి వెళ్ళాడనుకోండి. గంగాస్నానం చేస్తారు కాశీలో. కానీ ప్రధానం మణికర్ణికాతీర్థస్నానం. ఒక్కొక్క చోటికి వెళ్ళినప్పుడు ఒక్కొక్క తీర్థముంటుంది. ఆ తీర్థంలో స్నానం చెయ్యాలి. ఆ స్నానం చేసి మనుష్యుడు తన పాపాన్ని పరిహరించుకుంటాడు. భగవంతునికి దగ్గరవడానికి కావలసిన తేజస్సును పొందుతాడు. కాబట్టి దానిని తీర్థస్నానమంటారు.

ఆరవ స్నానం ఉంటుంది. దానిని నైమిత్తికస్నానమంటారు. స్నానం ఎప్పుడు పడితే అప్పుడు చెయ్యకూడదు. అర్ధరాత్రి లేచి నేను స్నానం చేస్తానండీ

అని చెయ్యకూడదు. స్నానం చెయ్యడానికి వేళా పాళా ఉంటాయి. ఇష్టం వచ్చినట్లు స్నానం చెయ్యకూడదు. కానీ కాలంతో నిమిత్తం లేకుండా ఎప్పుడైనా చేసే స్నానం ఒక్కటే నైమిత్తిక స్నానం అంటారు. అంటే శవస్పర్శ కలిగిందనుకోండి. ఏ కారణం చేతనో శవాన్ని ముట్టుకున్నాడు. వెంటనే తేజస్సు మాయమైపోతుంది. దాన్ని నిలబెట్టుకోవడానికి ఏం చేస్తారంటే ఉత్తరక్షణంలో శిరఃస్నానం చేసేస్తారు. ఎక్కడికో అక్కడికి వెళ్ళి శిరసాదిగా స్నానం చేసేసి, బట్టలు విడిచిపెట్టి యజ్ఞోపవీతాన్ని తీసేసి, కొత్త యజ్ఞోపవీతం వేసేసుకుంటారు. కాబట్టి నైమిత్తికస్నానం. శవస్పర్శ మొదలైనవి కలిగితే చేసే స్నానానికి నైమిత్తికస్నానమని పేరు. కాబట్టి ఆరు రకాలుగా స్నానం చేస్తాడని శాస్త్రం నిర్ధారిస్తోంది.

అసలు ఈ స్నానం చెయ్యడం వల్ల వచ్చే ఉపయోగమేమిటి? స్నానం చెయ్యండి, అంటే కేవలం ఏదో ఒళ్ళు రుద్దుకుని, సబ్బెట్టుకుని స్నానం చెయ్యడం కోసం కాదు చెప్పింది శాస్త్రం. నువ్వు నశాస్త్రీయంగా, భగవద్భక్తితో కనీసం గోవిందా, గోవిందా, గోవిందా అంటూ స్నానం చేస్తే చాలు, నీకు పది రకాలైన ప్రయోజనాలను స్నానం ముట్టచెప్పగలదు. అంత గొప్ప అనుగ్రహాన్ని ఇవ్వగలిగింది కాబట్టి దానికి స్నానం అని పిలిచారు. ఏవి ఆ పది? **గుణా దశం స్నానపరో** పది గుణాలు కలుగుతాయి స్నానం చేసినవాడికి. అందులో సాధు రూపో. మొట్టమొదటిదేది అంటే ఎప్పుడూ నియమంతో స్నానం చేసేవాడి శరీరంలో తేజస్సు పెరుగుతుంది. అందుకే తేజస్సంరక్షణం దేనితో చేసుకుంటారంటే స్నానం తోటే.

శివపురాణంలో ఒకానొకప్పుడు శుక్రాచార్యులవారి మీద కోపం వచ్చింది శివుడికి. కోపం వచ్చి ఆయనని తీసి నోట్లో పడేసుకుని మింగేశాడు. మింగేస్తే ఆయన కడుపులో కూర్చున్నాడు శుక్రాచార్యులవారు. కూర్చుని పరమశివుని వైభవాన్నంతటినీ చూసి లోపల కూర్చుని స్తోత్రం చేశాడు. శివమహాపురాణంలో ఉంటుంది అత్యద్భుతం! అందులో కీర్తించాడు. నదులకూ, నీటికీ ఇంత శక్తి ఎక్కడ్నుంచి వచ్చిందో, భవా అని శివుణ్ణి ఎందుకు పిలుస్తారో, శివానుగ్రహంగా నీరు అంత గొప్పది ఎందుకైందో స్తోత్రం చేశాడు. **సంజీవనం సమస్తస్య జగతస్ సలిలాత్మికా భవ యుక్తిత్యతే మూర్తిర్భవస్య పరమాత్మనః** అంటుంది లింగపురాణం.

అసలు ఈ లోకమంతా బ్రతుకుతోందంటే నీళ్ళ వల్లే. స్పృహ కోల్పోయినవాడికి స్పృహ వచ్చేది కూడా మళ్ళీ నీళ్ళు చల్లితేనే. అంత శక్తి నీటియందు శివస్వరూపంగా ఉంది. అటువంటి నీటికి సాధురూపాన్ని ఇచ్చే లక్షణముంది. ఎవరు నియమంగా స్నానంచేస్తుంటారో అటువంటివాళ్ళు చూడగానే, ఆయన నల్లగా ఉన్నాడా, ఆయన తెల్లగా ఉన్నాడా పక్కన పెట్టేయండి. నియమంగా స్నానం చేసినవాణ్ణి చూడగానే నీ మనసు ఉద్వేగాన్ని కోల్పోయి శాంతి పొందుతుంది. అది మొదటి లక్షణం ప్రకాశిస్తుంది అవతలి వారిలో. కంచి కామకోటి పీఠాధిపత్యం వహించిన ప్రాతఃస్మరణీయులు చంద్రశేఖరేంద్ర సరస్వతీమహాస్వామివారుండేవారు. ఆయన కడుపు వెనకాతల ఉండే వెన్నుపాముకు తగులుతుండేది. ఇలా లోపలికి పోయి. కళ్ళు గుంతల్లా అయిపోయేవి. ఒక కన్ను గాజు కన్నులా ఉండేది. కళ్ళ జోడు పెట్టుకుని ఆయనిలా నిలబడితే ఉరఃపంజరంలో ఎముకలు ఒకటి, రెండు, మూడు, నాలుగు అని లెక్కపెట్టవచ్చు. అలా ఎముకలు కనబడుతూ ఉండేవి. సన్నగా ఉండేవారు. తొంభై సంవత్సరాలు దాటిపోయి బట్ట కూడా జారిపోతూ సత్యదండం పట్టుకుని, కమండలం పట్టుకుని ఆయన నడిచి వెళుతూంటే, పసిపిల్లల దగ్గరి నుంచి, వృద్ధుల వరకు ఆయన వంక ఇలా చూస్తే ప్రయత్నం లేకుండా ఇలా చేతులెత్తి దండం పెట్టేవారు. ఆయన సన్యాసాశ్రమధర్మానికి కట్టుబడి తొంభై నాలుగవ ఏటా బండిని ఆసరా తీసుకుని నడిచి వెడుతుండేవారు. అదీ ధర్మానుష్ఠానమంటే. బట్ట మార్చుకుంటే ధర్మం కాదు. అనుష్ఠిస్తే ధర్మం. పట్టుకుని నడుస్తుంటే ద్రావిడదేశంలో బస్సులాపుచేసి చెప్పులువిప్పి వచ్చి జనం రోడ్డుకి రెండు పక్కలా పడుకునుండేవారు. మధ్యలో నుండి ఆయన వెళ్ళేవారు. ఆయన వంక చూస్తే చాలు మనసు సంతోషాన్ని పొందుతుంది. ఒక్కటే కారణం. స్నానమెలా చెయ్యాలో అలాగే చేసిన మహాపురుషుడాయన. దండ విన్యాసమంటే దండ విన్యాసమే.

ఆయన ఫోటోలు కొన్ని వందలున్నాయి. అంత గొప్ప స్నానం చేసేవారాయన. అటువంటి మహానుభావుడు కాబట్టి **సాహో రూపంచా** ఎవరు స్నానాన్ని నియమంగా చేస్తాడో వారిని చూడగానే ఉద్వేగాలు ఉపశమిస్తాయి. చూడగానే నమస్కారం చెయ్యాలనిపిస్తుంది. ఒక్కసారి మాట్లాడాలనిపిస్తుంది. ఆయన నాలుగు రోజులు ఉండి వెళ్ళిపోయాడనుకోండి. ఆ ఇల్లు శాంతిస్థానమవుతుంది.

కారణమేమిటో తెలుసా? ఆయన నియమమైన స్నానం. కాబట్టి **సాహో రూపంచా తేజో బలశ్చ శౌచం** అపారమైన తేజస్సు ఉద్భవిస్తుంది సక్రమమైన స్నానం వల్ల. బలం – ప్రతిరోజూ నియమంగా, చక్కగా స్నానం చేసే వాడి శరీరంలో ఉన్న నాడీమండలం బాగా పనిచేస్తుంది. రోగనిరోధకశక్తి పెరుగుతుంది.

అసలు ఇలా మంచు వచ్చి పడేటప్పటికి పడిశం పట్టేస్తుంది. అలా కాదు. బ్రహ్మముహూర్తంలో రోజూ వెళ్ళి నదిలో స్నానం చేసి, నది ఒడ్డున కూర్చుని సహస్రగాయత్రి చేసి వచ్చేవాళ్ళని చూడండి మీరు. వాళ్ళు ఎంత వయస్సున్నా వెళ్ళిపోయి స్నానం చేసి కూర్చుంటారు. నేను ఇప్పటికీ ఎన్నో ఊళ్ళు తిరుగుతుంటాను కాబట్టి చూస్తుంటాను. ఆశ్చర్యమేస్తుంది. వాళ్ళు అంత తెల్లవారుజామున లేచి నూతి దగ్గరకు వెళ్ళి స్నానం చేసేసి నూతి గట్టున కూర్చుని అర్ఘ్యమిచ్చేసి అక్కడే ఏ మారేడు చెట్టు దగ్గరో, ఏ గోవు దగ్గరో కూర్చుని సంధ్యావందనం చేసేసి లోపలికొస్తారు. ఏమండీ చలిగా ఉంది కదా అంటే, చలేమిటీ, చలెక్కడా అంటారు. ఏ ఋతువూ ఆయనకు అడ్డు రాదు. చక్కగా ఉంటుంది శరీరం. స్నానం చేత ఆరోగ్యం. కాబట్టి ఆ తేజస్సు దానితోపాటుగా బలం, శౌచం. శౌచం అన్నమాటకు అర్థమేమిటో తెలుసా? అంతఃకరణం పరిశుద్ధంగా ఉండాలి. శౌచమంటే పైకి శరీరం శుభ్రంగా ఉండడం కాదు. శరీరం శుభ్రంగా ఉంటే ఎవడికి కావాలి, మనసు మలినమైపోతే.

**గొరుగుచుందురు జుత్తు కొన్ని వందలసార్లు, దాని పాపమేమో కానరాదు**
**అఖిలపాపములకు నిలయమైన మనసు గొరగదేమి మానవుండు.**

అన్నాడు ఎవరో ఆధునికకవి. అలా **ధ్రువం సర్వ తీర్థేషు స్నాత్వా స్నాత్వా పునః పునః నిర్మలం మనో యావత్ పావత్ సర్వం నిరర్థకం** అన్నాడు వ్యాసుడు. ఎక్కడ స్నానం చేస్తే ఎవడికి కావాలి? ఎన్ని ఊళ్ళ కెడితే ఎవరికి కావాలి? మనసు నిర్మలమవనప్పుడు. మనసు నైర్మల్యం పొంది ఎలా ప్రతిస్పందించాలో అలా ప్రతిస్పందించే గుణాన్ని పొందితే, అది శౌచం. ఆయన నిలబెట్టుకున్నాడు శౌచాన్ని అంటారు. శౌచాన్ని నిలబెట్టుకున్నాడన్న మాటకి అర్థమేమిటో తెలుసా? ఇక్కడొక బంగారు కంకణం కనబడిందనుకోండి. బాగా అనిపించకపోవడం. అయ్యో పాపం, ఎవరిది జారిపోయిందో అని వెంటనే లేచి నిలబడి, అయ్యా, ఎవరిదో బంగారు

కంకణం పడిపోయిందని ఆయనిచ్చి తీసుకుంటే పొంగిపోయాడనుకోండి, శౌచం. అదీ శౌచం.

అందుకే రామకృష్ణ పరమహంస ఒకమాట చెప్తుండేవారు. ఒక భార్యా, భర్తా ఒక రాత్రిపూట మాట్లాడుతూ ఆ ఏం సంసారం లెద్దూ అని ఇద్దరం తీర్థయాత్రలకెళ్ళిపోదాం ఇల్లు విడిచిపెట్టేద్దామన్నారు, తాళం తీసేశారు, మీకందరికీ కావలసినవి తీసుకోండన్నారు. అన్నీ వదిలిపెట్టేశారు. ఇద్దరూ వెళ్ళిపోతున్నారు. ఇద్దరూ నడిచి వెళ్ళిపోతూ ఉంటే ఒక బంగారు గొలుసొకటి కనబడింది. అకస్మాత్తుగా ఆగిపోయాడు భర్త. భార్య కొంచెం ముందుకెళ్ళి ఆగి ఏవండీ, రావట్లేదేం అంది. భర్త అనుకున్నాడు దీనికి గొలుసులంటే ఇష్టం, ఇప్పుడీ బంగారు గొలుసు తీసుకుని మెళ్ళో వేసుకుంటాననుకుంటుందేమో, ఇంతా బయలుదేరింది పాడైపోతుందని, కాలి మట్టితో గొలుసు కప్పేస్తాడు. ఆవిడంది రండి వెళదామంది. వచ్చేస్తున్నాను నువ్వు నడు, నువ్వు నడు అన్నాడు. ఆవిడంది అక్కడే నిలబడి. అన్నీ వదిలిపెట్టి బయలుదేరిన తరువాత కూడా, ఇంకా మీకా బంగారు గొలుసు కనబడుతోందా అని. అంటే అసలు నిజంగా వృద్ధిలో ఉన్నారు. ఆవిడకి కనబడుతుందని ఈయన బంగారు గొలుసు చూసి మట్టి కప్పుతున్నాడు. ఇంకా నీకా గొలుసు కనబడుతోందా అని అడిగిందావిడ. అంటే ఆవిడెప్పుడో వదిలేసింది. అదీ శౌచం.

అది నిలబెట్టుకోగలిగినవాడున్నాడే, ఎక్కడ కోపం రావాలో అక్కడ ఆశీర్వచనం. ఎక్కడ కుంగిపోవాలో అక్కడ ప్రశాంతంగా ఉండగలగడం. ఎప్పుడూ తాను అలా ఉండగలిగిన స్థితి, ఉద్వేగాలకు కదిలిపోని మనసుతో నిలబడగలిగిన స్థితిని శౌచం కాపాడుతున్నాడంటారు. ఆ శౌచం దేనివల్ల కలుగుతుందంటే స్నానం వల్ల. మనసు నిగ్రహించబడుతుంది స్నానం చేత. అంటే మీరు పరిశీలించండి. కాబట్టి స్నానం అంటే శౌచం నిలబడటం. అందుకే ఉద్వేగంతో ఉన్నప్పుడు, ఏదైనా కోరిక కావలిస్తే వెళ్ళి తలస్నానం చేశారనుకోండి, మనసు సర్దుకుంటుంది. స్నానానికి ఆ శక్తి ఉంది. మనసు మీద ప్రభావం చూపిస్తుంది. కాబట్టి **సాధో రూపంచ తేజో బలశ్చ శౌచం ఆయుష్య మారోగ్య మలోలుపత్వం ఆయుష్యం**. ఎక్కడ స్నానం చేస్తాడో అక్కడ మనసు శాంతిగా ఉంటుంది.

ఇంద్రియాలు, నాడీమండలం బాగాపనిచేస్తాయి. దానివల్ల ఆరోగ్యంగా ఉంటాడు. ఆయుష్యం. దాని వల్ల ఆయుర్దాయం ఉంటుంది. అలోలుపత్వం. అలోలుపత్వం అంటే ఇంద్రియాల లౌల్యం కలగదు.

ఇంద్రియలౌల్యం అన్నమాటకు అర్థమేమిటో తెలుసా? కొంచెం జాగ్రత్తగా పట్టుకోవాలి. మార్చి, మార్చి, మార్చి ఇంద్రియాల్ని. వాడుకునే లక్షణం పోతుంది మనసుకి. మనసుకుండే లక్షణమేమిటంటే అది అలిసిపోతూ ఉంటుంది పట్టుకుంటూ ఉంటే. మార్చుకోవడంలో శక్తి పొందుతుంది. కాసేపు కంటితో సంతోషాన్ని పొందుతుంది. అలా చూస్తుంటాడు కాసేపు. కాసేపంటాడు విసుగొస్తోందని. విసుగొస్తోందని తీసేసి ఏవో రెండు వైర్లు చెవుల్లో పెట్టుకుని కాసేపు ఇలా, ఇలా అంటాడు. ఇప్పుడు చెవితో సంతోషపడతాడు. కాసేపాగి అబ్బా అని తీసి రెండూ అక్కడ పారేస్తాడు. ఇప్పుడలా వెళ్ళి పూలూ, ఇంట్లో పెట్టిన పూలదండా ఇవన్నీ ముట్టుకుని అబ్బా, ఎంత బాగున్నాయో అంటాడు. కాసేపాగి అబ్బా అంటాడు. అదీ అయిపోయింది. స్పర్శేంద్రియంతో సుఖమైపోయింది. అయిపోయిన తరువాత ఇంట్లో కెళతాడు. వంటింట్లోకెళ్ళి తలుపుతీసి చూస్తాడు. ఏమీ కనబడలేదు. అన్నీ తినేశాడు. ఏం చేయాలో అర్థం కాక ఆవకాయ జాడీలో గరిటెట్టి నాలుగు పెచ్చులు తీసి నీళ్ళలో కడిగేసుకుని ఉత్త పెచ్చులు తినేస్తాడు. నాలుకతో అనుభవించాడు. అయిపోయింది. భార్య చూస్తే పెచ్చులు బాగుండదు కదూ. కాగితంలో పొట్లం కట్టి మరీ డస్ట్ బిన్‌లో పడేస్తాడు కనబడకుండా. గరిటా, పళ్లెం కడిగేశాడు అక్కడ పెట్టేశాడు. మళ్ళీ ఏం చెయ్యాలి?

మళ్ళీ కంటి దగ్గరకొస్తాడు. మళ్ళీ వెళ్ళి మళ్ళీ చూడ్డం మొదలుపెడతాడు. ఇప్పుడు మళ్ళీ కాసేపు బాగుంటుంది. ఎందుకంటే వ్యవధానమిచ్చాడు కదూ. మార్చి మార్చి మార్చి ఇంద్రియసుఖాలనే పొందుతూ ఉంటాడు. దానికి దూరంగా భగవంతుని స్పర్శకు వీటిని కట్టవేసి, అడ్డుకట్ట పెట్టి కష్టంలో సుఖాన్ని పొందలేడు. కదలకుండా ఇలా కూర్చో ఒక గంట అన్నారనుకోండి. అమ్మో ఇక్కడ నొప్పులు, ఇక్కడ నొప్పులు ఎన్ని కంప్లయింట్స్ చెప్తుందో. కుర్చీ మీద కూర్చోకూడదేమిటి? బల్లమీద కూర్చోకూడదేమిటి అంటుంది. నోర్ముయ్యి అలా కూర్చో అని అది నొప్పెడుతోందన్న విషయాన్ని తాను మరిచిపోయాడనుకోండి ధ్యానంలో అలోలుపత్వం. ఇంద్రియాలతో లౌల్యాన్ని వదిలిపెట్టాడు.

ఇంతకుముందు అలా ఉండేవాడు. ఇప్పుడూ పప్పులో ఉప్పెయ్యలేదు భార్య. తినేసి భోజనం అయిపోయాక ఉత్తరాపోశనం పట్టి, కొంచెం పప్పులో ఉప్పేసుకో అంటాడు. ఏమండీ ముందు చెప్పలేదేం అంటే, తిన్నానుగా యాభై ఏళ్ళు, ఒక్కరోజు తినలేనేమిటి? అంటాడు. అంటే ఇప్పుడు ఇంద్రియానికి వశుడు కాలేదు. ఇది అలోలుపత్వం. దానికి కారణమెక్కడ? పరమేశ్వరుడితో ముడేస్తాడు. నైవేద్యం పెట్టాను ఆయన తిన్నాడుగా. ముందు నైవేద్యం పెట్టావా అన్నం తినే ముందు. అంటే ఈశ్వరుడు తిన్నాడా? ఉప్పెయ్యలేదు అన్నాడేమిటి? అనలేదుగా మరి నువ్వెందుకంటావు? నువ్వూ అనకు. ఈశ్వరుడే తినగా లేనిది నువ్వెందుకు తినవు? ఆయన భక్తుడివి, ఆయనకు పెట్టావు ఉప్పులేని పప్పు. నువ్వూ ఉప్పులేని పప్పే తిను. ఆయన తిన్నదే నేనూ తింటాను అంతే. ఈశ్వరోచ్ఛిష్టం. అది గొప్ప కానీ ఉప్పులేని పప్పు కాదు. ఈశ్వరోచ్ఛిష్టం ఇష్టం అందుకు తినడు. మరి ఆవిడకెందుకు చెప్పాడు? ఏమో పాపం ఆవిడ స్థితి ఏమిటో? తన ప్రేమ తనది. కాబట్టి ఉప్పేసుకుని తినవోయి అన్నాడు. కాబట్టి అది అలోలుపత్వం. అదెక్కడ్నుంచి వస్తుందని అడిగారు. స్నానంలో నుంచి వస్తుంది. అందుకే ఇప్పటికీ పెద్దలు భోజనానికి వెళ్ళే ముందు గావంచా కట్టుకుని స్నానానికెళుతూ ఉంటారు. ఎందుకంటే ఇంద్రియలౌల్యం ఏర్పడకుండా తినాలి నేను అని. కాబట్టి **ఆయుష్య మారోగ్య మలోలుపత్వం దుస్స్వప్న ఘాతం చ** ఏదైనా దుస్స్వప్నమొస్తే దాని ఫలితం పోతుంది స్నానంచేస్తే. కాబట్టి **'దుస్స్వప్నఘాతంచ తపస్సమేతాః'.**

తపస్సు స్నానం చేత సిద్ధిస్తుంది. ఎక్కడికో వెళ్ళి ముక్కుమూసుకుని ఇలా కూర్చుంటే తపస్సని మీరనుకోకండి. **శృణ్వన్ తపః** ఇప్పుడు నేను మాట్లాడుతుంటే రెండుగంటలపాటు తదేక దృష్టితో వింటున్నారనుకోండి మీరు రెండుగంటలు తపస్సు చేస్తారూ అని వేస్తారు. రెండు గంటలు ధ్యానం చేశారనుకోండి, రెండు గంటలు మీరు తపస్సు చేశారు. ఒక పుస్తకం చదివారు. పుస్తకం నీరయిపోయేటట్లు చదివారు. ఇలా తలెత్తి అమ్మో, పన్నెండైపోయిందా అని గబగబా పుస్తకం పెట్టి పరుగెత్తారు. అంటే రెండుగంటలు మీకు బాహ్యస్ఫురణ లేదు. మీరు తపస్సు చేశారు. అలా మనసు కేంద్రీకరించబడింది తపస్సు. ఏది ఉద్ధరణహేతువో దానిమీదే నిలబడాలి. పనికిమాలిన వాటిమీద నిలబడ్డం కాదు. రెండు గంటలు

ఏమీ తెలియకుండా సినిమా చూశానండీ అంటే తపస్సు కాదు. ఇంద్రియలౌల్యం. ధారకమైన విషయం మీద మనస్సు నిలబెట్టగలిగితే తపస్సు. ఆ తపస్సుకి యోగ్యత ఎక్కడ్నుంచి వస్తుందంటే స్నానంలోంచి వస్తోంది. అందుకని **తపస్సమేతాః** ఎవడు నియమంగా స్నానం చేస్తాడో వాడికి తాను చూస్తున్నది, తాను వింటున్నది, తాను చదువుతున్నది తానైపోయే శక్తివస్తుంది. మీరు నేనన్నమాట పట్టుకున్నారో, పట్టుకోలేదో?

నేను ఒక కమండలం పట్టుకుని అలా వెళ్ళిపోతున్నాను. పెన్నానది కనబడింది. కాసిన్ని నీళ్ళు ముంచాను. ఇప్పటివరకూ పెన్నానది. ఇప్పుడు నా కమండలంలో నీళ్ళు. నా నీళ్లు. కొంచెం దూరం వెళ్ళాను. తాగేశాను కాసిన్ని నీళ్ళు. ఇప్పుడా నీళ్లేమయ్యాయి? నేనైపోయాయి. అంతకుముందు పెన్నానది. తరువాత కమండలజలం. తరువాత నేను. అయిపోయిందా లేదా? సమేతా అన్న మాటకి అర్థమేమిటంటే మీరు ఏది చూస్తున్నారో అది మీరైపోవాలి. మీరొక దేవాలయంలోకి వెళ్ళి అలా చూశారనుకోండి. మళ్ళీ మీరు ఎప్పుడు స్మరిస్తే అప్పుడు దేవాలయమంతా మీకు కనబడుతుంది. దేవాలయం మీలోకెళ్ళిపోతుంది. మీరొక పుస్తకం చదివారు. మీలోకెళ్ళిపోవాలి. మీరొక అద్భుతమైన శిల్పాన్ని చూశారు. మీలోకెళ్ళిపోవాలి. మీరొక మంచి ప్రసంగం విన్నారు. మీలోకెళ్ళిపోవాలి. అలా అబ్జార్బింగ్ కెపాసిటీ అంటారేమో ఇంగ్లీషులో. మీరు చూస్తున్న దానిని మీరుగా మార్చేసుకునే శక్తి ఎక్కడినుంచి వస్తుందంటే ప్రతిబంధకాన్ని తొలగించే స్నానం వల్ల వస్తుంది. అందుకే ఉత్‌- పైకి లేపుతుందా శక్తిని.

అందుకే మా చిన్నతనంలో నిద్రలేచి కూర్చుని చదివితే ఒప్పుకునేవారు కాదు. వెన్నుపాము ఆన్చడానికి వీలులేదు. కుర్చీలో కూర్చోకూడదు. చాప వేసుకుని పుస్తకాలు పెట్టుకుని అప్పుడు పుస్తకం ఒళ్ళో పెట్టుకుని, వెన్నుపాము నిటారుగా పెట్టుకుని చదవమనేవారు. స్నానంచేసి రా, స్నానం చేసి వచ్చి చదువు. స్నానం చెయ్యకుండా దిక్కుమాలిన చదువు మొదలుపెట్టకనే వారు. చల్లటి నీళ్ళు స్నానం చేసేసి వచ్చి కూర్చుంటే ఆ మత్తు విరిగిపోయేది. హా అని మధ్యలో ఆవులింతలు రావు. ఉపన్యాసానికెళ్ళినా ఆవులింతలే. పూజకెళ్ళినా ఆవులింతలే. గుడికెళ్ళినా ఆవులింతలే. చదువుకున్నా ఆవులింతలే. రైలెక్కినా ఆవులింతలే. దిక్కుమాలిన

జన్మంతా ఆవులింతలే. ఎందుకని? చేస్తే కదూ స్నానం ఎప్పుడైనా? అందుకని స్నానాన్ని చేస్తే దానివల్ల ఆ మేధ ఉద్దీపనమవుతుంది. ఇన్ని శక్తులు అంటే పది గుణాలను స్నానమివ్వగలదు. ఇవ్వగలదు కాబట్టి ఆ స్నానాన్ని చేసి తీరవలసిందే. ఆ స్నానం చేత మాత్రమే శౌచం కలుగుతుంది. ఇప్పుడు నేను మీతో ఒకరోజు చెయ్యవలసిన స్నానం, స్నానం వల్ల వచ్చే ప్రయోజనాల గురించి చెప్పాను. వేదం ఎందుకు స్నానం చెయ్యమంది అన్నదాని గురించి. అయితే ఇది ప్రతిరోజూ చేసే స్నానం.

ఒక సంవత్సరాన్ని ప్రమాణంగా తీసుకుంటే తప్పకుండా చెయ్యవలసిన పంచభూత స్నానమని ఉంది. అది చెయ్యాలి. అయితే నేను పంచభూతస్నానం చెప్పేముందు మీతో ఒకమాట చెప్పాలి. ఏమండీ మీరివన్నీ చెప్పారు బాగుంది, ఇందాకేమో మీరు నూట నాలుగు జ్వరమొస్తే నిన్ను ఈశ్వరుడు క్షమిస్తాడయ్యా అన్నారు. ఇలా ఎలా స్నానం రోజూ? ఒంట్లో బాగుండకపోవడం ఉంటుంది, పడిశం పడుతుంది, దగ్గొస్తుంటుంది. అప్పుడూ చెయ్యవలసిందేనా ఇలా? శాస్త్రం ఒకటి గుర్తు పెట్టుకోండి. వేదం ఎప్పుడూ మిమ్మల్ని భగవంతుడి దగ్గర్నుంచి దూరంగా జరిపెయ్యదు. మీ మనసుని ఈశ్వరుడి దగ్గర పెట్టడానికి మీకు అవకాశమిస్తుంది. అరే, నేను ఇవాళ తలస్నానం చెయ్యలేకపోతున్నానుకుంటే కంఠస్నానమంటారు. ఇక్కణ్ణుంచి స్నానం చెయ్యవచ్చు. ఇక్కణ్ణుంచి కూడా చెయ్యడానికి మీకు అంగీకరించదు. గుండె అంతా గుర గుర లాడిపోతోంది. శ్లేష్మం పట్టేసిందనుకుంటే నడుం వరకే చెయ్యవచ్చు. కటి పర్యంతం కూడా నేను స్నానం చెయ్యలేననుకుంటే కాళ్ళు కడుక్కోవచ్చు. కాళ్ళు కూడా కడుక్కోలేను వణికిపోతున్నాననుకుంటే చల్లుకోవచ్చు. నీరు కూడా చల్లుకోలేరసలు. నీటి దగ్గరకు కూడా వెళ్ళలేరు, ముట్టుకోలేరు అనుకుంటే వేడినీళ్లు చల్లుకోవచ్చు. అది కూడా చెయ్యలేనంటే బట్ట తడిపి ఒళ్ళు తుడుచుకోవచ్చు. అది కూడా చెయ్యలేనంటే మూడుమాట్లు విభూతి చల్లుకుంటే చాలు. ఎప్పుడూ ఒంట్లో బాగాలేనప్పుడు.

అంతేకానీ చాలాగొప్పమాట చెప్పేశారు కోటేశ్వరరావుగారూ మీరు నా మీద పెట్టేసి రోజూ విభూతి చల్లేసుకొమ్మని నేను చెప్పడంలేదు. శరీరమూ అలా ఆయా కోణాలలో సహకరించకపోతే, మీరు నిర్ధారించేసుకోవడంకాదు యథార్థకోణంలో

ఆలోచించండి. నిజంగా నూట నాలుగు జ్వరముందా? నిజంగా అంత గుండెలు గుర గురలాడిపోతున్నాయా? అంత పడిశం పట్టేసిందా? నేను స్నానం చెయ్యలేనా? అనేది ఆలోచించి చేస్తే వాడు పూజకి కూర్చోడాన్ని శాస్త్రం తప్పు పట్టలేదు. వాడు రోగగ్రస్తుడై ఉన్నాడు. ఒక్కసారి కాసిని పాలు శివలింగం మీద పోద్దామని ఉందండీ మాస శివరాత్రి అన్నాడు. మార్గశీర్ష మాసంలో ఆర్ద్రాభిషేకం పైగా. పొయ్యాలని ఉంది పాపం వాడికి. నూట నాలుగు జ్వరం. నువ్వు స్నానం చెయ్యలేదు పొయ్యొద్దనకూడదు. నువ్వు శాస్త్రం తెలిసున్నవాడవైతే విభూతి చల్లి పోయించి పంపించాలి. ఎప్పుడు? వాడి అనారోగ్యాన్ని దృష్టిలో పెట్టుకుని. వేదం మూర్ఖంగా మనిషిని ఈశ్వరుడికి దూరం చెయ్యదు. ఏ స్థితిలో ఉన్నా ఈశ్వరుడికి దగ్గర చేస్తుంది ఆచారం. నీ పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని నిన్ను దగ్గర చేస్తుంది

ఇదిగో ఇప్పుడు చూడండి నేను ఉపన్యాసం చెప్తుంటే దగ్గొచ్చింది. నా వరకూ నాకు ఉపన్యాసం ఒక పూజ. ఒక ధ్యానం. నేను దగ్గితే మధ్యలో స్నానం చేసి కానీ కూర్చోకూడదు. నేను లేచి వెళ్ళి స్నానం చేసి వస్తే మీరేం చేస్తారు? అందుకని కుడిచెవి మీద చెయ్యేసుకుంటే నేను గంగాస్నానం చేసేసినట్లే. మళ్ళీ చెప్పవచ్చు. శాస్త్రం అంగీకరించిందా? లేదా? ఇదే ఉదాహరణ. శాస్త్రం ఎప్పుడూ నిన్ను భగవంతుడికి దగ్గరగా ఉంచే ప్రయత్నం చేస్తుందే తప్ప, నిన్ను ఎలాగో అలా మూర్ఖంగా జరుపుదామనుకోదు. నీకు చేతకాక పోతే, నువ్వు వేదం చదవకపోతే, నువ్వు శాస్త్రాలు చదువుకోకపోతే అప్పుడు నువ్వు మూఢాచారమంటావు. నువ్వు నిజంగా చదువుకుంటే దీనికన్నా ఉదారంగా మాట్లాడగలిగినవాడు లోకంలో లేడంటావు. కాబట్టి అంత ఔదార్యంతో మాట్లాడుతుంది శాస్త్రం.

పంచభూతస్నానం అని ఒక స్నానం. అది సంవత్సరంలో ప్రతివాళ్ళూ చెయ్యాలి. పంచభూతాలని మన శరీరంలో అవే ఉంటాయి. పిండాండమంటారు శరీరాన్ని. ఇందులో అయిదు భూతాలు. బ్రహ్మాండంలోనూ పంచభూతాలు. ఈ పిండాండం బ్రహ్మాండంతో సమన్వయమవుతూ ఉంటుంది. అదే బ్రతికున్నాడూ అంటారు. బ్రతికున్నాడూ అన్న మాటకి అర్థమేమిటంటే పిండాండంతో బ్రహ్మాండం సమన్వయమవటం. దీంట్లోకి గాలి కావాలి. బ్రహ్మాండంలోని గాలి ఇందులోకి పుచ్చుకుంటాడు. ఇందులో మళ్ళీ మలినమైన వాయువుని

వదిలెయ్యాలి. బ్రహ్మాండంలోకి వదిలేస్తాడు. దీంట్లోకి నీళ్ళు కావాలి. బ్రహ్మాండంలో నీళ్ళు పిండాండంలో పోస్తాడు. ఇందులో మలినమైన నీళ్ళున్నాయి. మళ్ళీ బ్రహ్మాండంలోకి వదిలేస్తాడు. దీంట్లోకి పృథివి కావాలి. బ్రహ్మాండంలోని యాపిల్ పండు పిండాండంలో పడేస్తాడు. పిండాండంలో పృథివి మిగిలిపోయింది. బ్రహ్మాండంలోకి వదిలేస్తాడు. పృథివి ఆపస్ తేజో వాయువు ఆకాశాలు.

బయట ఎండ ఎక్కువగా ఉంది. ఇక్కడ కాస్త చల్లటి మజ్జిగ పుచ్చుకుంటాడు. బయట చల్లగా ఉంది. లోపల వేడిని శరీరం పెంచుకుంటుంది. హా అనండి పొగొస్తుంది. లోపల వేడిని పెంచుకుంటుంది. ఎప్పుడూ ఒకే వేడి ఉండేటట్లుగా చూసుకుంటుంది. ఇందులో ఏది తగ్గిపోయినా బ్రహ్మాండ, పిండాండ సమన్వయం పోతోంది. అంటే ఇక ఆ శరీరముండదు. బ్రహ్మాండంలోకి వెళ్ళిపోతోందని గుర్తు. దాన్ని దిద్దగలిగిన వాడొక్కడే. పరమేశ్వరస్వరూపుడైన వైద్యుడొక్కడే దిద్దగలడు. ఆయనకే తెలుస్తుంది ఆ సమన్వయం ఎందుకు పోతోందో. అందుకే **ప్రథమో దైవ్యోభిషక్** అంది రుద్రాధ్యాయం. పరమశివుడే ఈ భూమి మీద వైద్యుడుగా తిరుగుతాడు. **వైద్యో నారాయణో హరిః** శ్రీమహావిష్ణువు వైద్యుడుగా తిరుగుతాడని. కాబట్టి ఈ బ్రహ్మాండ పిండాండ సమన్వయం జరగడమే బ్రతకడం. బ్రహ్మాండ, పిండాండ సమన్వయం ఆగిపోవడమే చనిపోవడం. ఈ పిండాండానికి గౌరవమేమిటంటే బ్రహ్మాండంలో వున్న పంచభూతాలలో ఇది స్నానం చెయ్యాలి. అంటే బయట ఉన్నవి పృథివి, ఆపస్, తేజో, వాయు, ఆకాశాలు. ఇందులో ఉన్నవి పృథివి, ఆపస్, తేజో, వాయు, ఆకాశాలు. పృథివి అంటే మట్టి. ఎంత గొప్ప స్నానాలు చేసినా ఇలా అంటే మట్టొస్తుంది. ఆపస్ అంటే నీళ్ళు. ఇందులో నీళ్ళుంటాయి. తేజో అంటే ఇందులో వేడి ఉంటుంది. వాయుః ఇందులో గాలి ఉంటుంది. ఆకాశం ఇందులో ఖాళీ ఉంటుంది – జాగా. జాగా మూసుకుపోయిందనుకోండి క్యాన్సర్ వచ్చేసింది, ట్యూమర్ వచ్చేసింది, బ్లాక్ అయిపోయిందంటారు. అదొక పెద్ద వ్యాధి. అయితే ఎక్కడ ఎంత తెరుచుకుని ఉండాలో అక్కడ అంత తెరుచుకుని ఉండాలి–ఆకాశం. బయట కూడా అంతే పృథివి, ఆపస్, తేజో, వాయు, ఆకాశాలు ఉంటాయి. స్నానం అంటే గౌరవం. ఇవి పంచభూతాలతో, అది పంచభూతాలతో ఉండి రెండూ సమన్వయంతో బ్రతకడం కనుక, ఇది బయటున్న పంచభూతాలతో స్నానం చెయ్యాలి ఏడాదికి ఒక్కసారైనా.

పృథివీస్నానం అని పిలుస్తారు. ఇవాళ ముక్కోటి ఏకాదశండీ నేను పృథివీస్నానం చేసి వస్తానంటాడు. పృథివీస్నానమంటే ఏమిటో తెలుసా? ఉత్తరదిక్కుగా వెళ్ళి పుట్టమన్ను తెచ్చుకుంటారు. తెచ్చుకుని ఆ పుట్టమన్నులో కొంచెం నీళ్ళు పోసి కలిపి తలమీద పెట్టుకుని స్నానం చేస్తారు. ఆ మట్టి కరిగి శరీరమంతా పడి తరువాత నీళ్ళచేత కడగబడుతుంది. పృథివితో స్నానం చేశాడు కాబట్టి పృథివీస్నానం. అలాగే పృథివీ, ఆపస్, వారుణస్నానం అంటారు. నీటిని తీసి శరీరం మీద పోసుకుంటారు. అలా నీటిని పోసుకునే స్నానం రోజూ మనం చేసే స్నానంలాంటిది. అది వారుణస్నానం. అంటే పంచభూతాలలో జలభూతంతో తడుపుతారు దీన్ని. ఇక తేజో అంటే అగ్నిస్నానం. అగ్నితో స్నానం చేయించాలి. ఎలా కుదురుతుంది? అగ్నిస్నానమంటే విభూతిస్నానం. విభూతి, ఆవు పేడ తీసుకుని- స్కాందపురాణంలో చెప్తారు. శ్రీశైలంలో చేస్తారిప్పటికీ. ఆవుపేడని ప్రత్యేకమైన విధివిధానాలతో, కొన్ని మంత్రాలతో కాలుస్తారు. కాలిస్తే అది ఇలా పట్టుకుంటే దూదిలా ఉంటుంది. అంత తేలికైపోతుంది. ఆ విభూతి ధారణం చేస్తారు పుండ్రం కింద. ఆ విభూతిని శరీరం మీద చల్లుకుంటారు. ఆ విభూతిని శరీరం మీద చల్లుకుంటే ఆగ్నేయస్య, అగ్నిస్నానం చేశాడని గుర్తు. అది బాగా అగ్నిదగ్ధమై ఉంది కాబట్టి దాన్ని చల్లుకుంటే అగ్నిస్నానం.

ఇక వాయుస్నానం కూడా చెయ్యాలి. అంటే మనమెప్పుడూ గాలిలో ఉంటున్నాం కదండీ అంటే కుదరదు. జ్యోతిష్యశాస్త్రంలో ఒక ముహూర్తం దానికి. గోధూళివేళ అంటారు. అదొక ముహూర్తం. ఆవులు సాయంకాలం వేళ నడిచి వెళ్ళిపోతూ ఉంటాయి. నడిచి వెళ్ళిపోతున్నప్పుడు వాటి గిట్టల నుంచి రేగుతుంది ధూళి. మేకలు, గొర్రెల మందల ధూళి మీద పడితే అకాలమరణం. ఆవుల గిట్టల నుండి రేగిన ధూళి మీద పడితే పవిత్ర స్నానం. దాన్ని వాయుస్నానం అంటారు. గోధూళిస్నానం. ప్రయత్నపూర్వకంగా ఆవుల మందలు ఇంటికి వెళ్ళిపోయే వేళ ఏదో ఒక్క రోజైనా వాటి వెంట నడవాలి. ఆవుల మంద వెనుక నడిస్తే సాయంకాలవేళ ఆ గిట్టల నుంచి పైకి రేగిన 'ధూళి ఒళ్ళంతా పడితే దాన్ని పరమపవిత్రమైన స్నాన'మని పిలుస్తారు. గోధూళిస్నానం, వాయుస్నానం అని పిలుస్తారు దాన్ని. అందుకే లీలాశుకుడు కృష్ణ కర్ణామృతం చేస్తూ -

**గోధూలి ధూసరిత కోమల గోప వేషం,**
**గోపాల బాలక శతై రను గమ్య మానం।**
**అను సాయంతనే ప్రతి గృహం పశు బంధనార్థం,**
**గత్యంత మచ్యుత శిశుం ప్రణతోస్మి నిత్యం॥**

అంటాడు. ఆ చిన్నికృష్ణుడున్నాడే ఆయన అందరి పాశాలనూ విప్పి మోక్ష మివ్వగలిగినవాడు. అటువంటివాడు ప్రతిరోజూ సాయంకాలంవేళ ఆవుల మందల వెనుక నడుస్తుండేవాడట. **గోధూలి ధూసరిత కోమల గోప వేషం,** ఆ ఆవుల ధూళంతా ఆయన మీద పడిపోయేది. ఆ పరాగంతో కప్పబడిన శరీరంతో ఉన్నవాడై, **గోపాల బాలక శతై రను గమ్య మానం**– బోలెడంత మంది గోపాలబాలురు వెంట వస్తూ ఉంటే ఆ కృష్ణుడ్ని ఒక్కసారి ఇంట్లోకి పిలిచి చూసి సంతోషించాలని గోపకాంతలనే వారట కృష్ణా, కృష్ణా మాకు ఆ ఆవు లొంగట్లేదు. కొంచెం కట్టేసి వెళ్ళవా అని. అంటే నేను కట్టేస్తానని గబగబా వెళ్ళి ఆ ఆవుని పట్టుకుని బలంగా రా, రా అని లాగుతుంటే చిన్ని కృష్ణుడు, ఆ పాదాలు గట్టిగా లాగుతుంటే, ఆ ఆవు గట్టిగా బిగదీసుకున్నది అడుగులేస్తూ ఉంటే, అందర్నీ బంధనాలలో నుంచి విడిపించే కృష్ణుడు ఆవుల్ని కడుతూంటే గోపకాంతలు సంతోషించేవారట. వాళ్ళ కోర్కె తీర్చడానికి బంధనాలను విప్పే కృష్ణుడు గోవులను కడుతూ, సాయంకాలం వేళ ఒంటిమీద గోధూళితో వెళ్ళిన కృష్ణుడున్నాడే ఆయన్ని నేను ప్రణతోస్మి నిత్యం– ప్రతి రోజూ స్మరించి నమస్కరిస్తున్నాను అంటాడు లీలాశుకుడు. అలా ఆ గోధూళి వేళ యందు గోధూళి ఒంటిమీద పడి స్నానం చెయ్యడాన్ని వాయు స్నానం అని పిలిచారు పంచభూతస్నానంలో. కాబట్టి పృథివీ, ఆపస్, తేజో, వాయు, ఆకాశః.

ఆకాశస్నానమని ఒక స్నానం. ఆకాశస్నానమంటే ఒక్కొక్కసారి ఎండగా ఉంటుంది. అకస్మాత్తుగా వాన పడుతుంది. ఎండగా ఉండి వర్షం పడుతూ ఉంటుంది. మీరందరూ చూసే ఉంటారు. నీరెండ కాస్తూ ఉంటుంది. టక, టక చినుకులు పడుతాయి. అలా పడినప్పుడు దానిని దివ్యస్నానం అంటారు. గబగబా వెళ్ళి ఆ వర్షం కింద తడవాలి. తడిస్తే అది ఆకాశస్నానం. రెండో ఆకాశస్నానం ఏమిటంటే మంత్రపూరితమైన కలశంపెడతారు. పెద్ద కలశస్థాపన

చేశారంటారు. మండపంలో ప్రధానకలశంపెడతారు. ఆ కలశంలో ఉన్న జలాలను మామిడి మండలతో జల్లుతారు. ఆ జలాలకు శక్తి ఎక్కడి నుంచి వచ్చిందంటే మంత్రానుష్ఠానం చేత, మంత్రోచ్చాటనం చేత వచ్చింది. మంత్రం శబ్దం. శబ్దం ఆకాశగుణకం. కాబట్టి ఆ నీళ్ళు మీద పడడం, కలశజలాలు మీద పడితే ఆకాశస్నానం చేసినట్లు. కాబట్టి ఒక సంవత్సరాన్ని ప్రమాణంగా తీసుకుని ప్రతి మనుష్యుడూ కూడా పంచభూతస్నానం చెయ్యాలి. ఈ పంచభూతస్నానం ఎవరు చేస్తారో వాడు ధన్యుడు. కాబట్టి పృథివీ, ఆపస్, తేజో, వాయుః, ఆకాశాలకు ప్రతీకలుగా ఐదు స్నానాలను చేస్తారు. ఈ కారణంచేత ఎవరెవరు ఇటువంటి స్నానం చేస్తున్నారో, వాళ్ళందరూ కూడా తేజస్సుని పొంది భగవంతుని కార్యం చెయ్యడానికి కావలసిన స్థితిని పొందుతారు. స్నానం బట్టతో చెయ్యాలి. ఒక బట్ట కట్టుకుని స్నానం చెయ్యాలి. పురుషుడు ప్రత్యేకంగా. పురుషుడు ఒంటిమీద బట్టలేని స్నానం చెయ్యకూడదు. అందుకే స్నాతకం చేసేటప్పుడు ప్రమాణం చేస్తాడు ఒంటిమీద బట్టలేకుండా స్నానం చెయ్యనూ అని. నగ్నస్నానం అంటే ఒక్కసారే, ఆఖరున. తాను చెయ్యడు. ఇతరులు చేయిస్తారు. ఆ స్నానం తప్ప తానే నగ్నంగా స్నానం చేశాడంటే అంతకన్నా హేయమైన స్నానం, అంతకన్నా అమంగళకరమైన స్నానం ఇక లోకంలో ఇంకొకటుండదు. అంత దారుణం. కాబట్టి ఒంటి మీద బట్టతో చెయ్యాలి.

భాగవతంలో కాత్యాయనీవ్రతంలో ఒంటి మీద బట్ట లేకుండా స్నానం చేసినందుకే

**కాత్యాయనీ దేవి గల్ల సేయుటగాక,**
**యీ రీతి నోచు వారెందు గలరు.**
**వ్రత ఫలంబు మీరు వలచిన జక్కగ**
**నింతులెల్ల జేతులెత్తి మ్రొక్కి,**
**చేరి పుచ్చుకొనుడు చీరెలు సిగ్గవో, నాడనేల, యెగ్గులాడనేల**

అన్నాడు కృష్ణుడు. ఒంటిమీద బట్టలేకుండా స్నానం చేస్తే వరుణుడి పట్ల అపచారం. వాళ్ళ వ్రతాలు, నోములు, పూజలు సిద్ధించవు. వాడు ముందు జలభూతం అపచారం చేసి వెళ్ళాడు కాబట్టి వాడేం చేసినా ఇక అనుగ్రహించదు.

కాబట్టి మీరు తప్పుచేశారు. ప్రాయశ్చిత్తకర్మ ఒక్కటే. పాపాన్ని పోగొట్టుకోవడానికి ఒక్క మనుష్యునికి, భూలోకంలోనే ఉంది. అదీ భరతవర్షే, భరతఖండే - ఇక్కడే ఇంకొక్క చోట లేదు ప్రాయశ్చిత్తకర్మ. కాబట్టి మీరు చేతులెత్తి నాకు నమస్కరించండి, అదే మీకు ప్రాయశ్చిత్తం అన్నాడు కృష్ణుడు. ఆయన కర్మ కాలి బట్టలెత్తుకు పోలేదు. అందుకే అంటారు పోతనగారు-

**వ్రతముల్ సేయుచు నొక్కమాటయిన నెవ్వానిన్ విచారించినన్**
**వ్రతభంగంబులు మానునట్టి వరదున్ వామాక్షు లీక్షించియున్**
**గతచేలాప్లవనంబు నేడు వ్రతభంగంబంచు శంకించి ఫా**
**ల తటన్యస్త కరాబ్జలై సరస లీలన్ మ్రొక్కిర ట్లందరున్.**

అంటారు. వ్రతం చేస్తున్నాం, వ్రతం చేస్తున్నామని వ్రతభంగం చేస్తాం మనం. ఆ పాపం ఎందుకు పోతుందంటే కనీసం మధ్యలో భగవన్నామం చెప్పుకుంటూంటే పోతుంది. కాబట్టి దిగంబరస్నానం లేనే లేదు శాస్త్రంలో. ఒంటి మీద బట్టతోటే స్నానం. పై బట్టతో చెయ్యకూడదు. పై బట్టతో స్నానం జీవితంలో ఒక్కసారే. కొడుకు పుట్టినప్పుడు చెయ్యాలి సచేలస్నానమని, పైన బట్టతో ఉండగా కొడుకు పుట్టాడన్న మాట వినగానే కొంచెం ఎత్తయిన నీటిలోకి, కొంచెం ఎత్తయిన ప్రదేశం నుంచి నీటిలోకి దూకాలి. ఆ నీళ్ళు ఇలా పైకి లేస్తాయి. అది చూసి పితృదేవతలు ఋణవిముక్తుల్ని చేస్తారు, నువ్వు సంతానాన్ని కన్నావని. కాబట్టి సచేలస్నానం ఒక్క కొడుకు పుట్టినప్పుడు తప్ప మొలకి బట్ట లేకుండా స్నానం చెయ్యకూడదు. ఈశ్వరుడే చెయ్యడు. ఈశ్వరుడు కూడా అభిషేకానికి, స్నానానికి కట్టుకుని స్నానం చేస్తాడు. కాబట్టి ఒక్క లింగస్వరూపానికే- దాని తత్త్వం అంత గొప్పది కాబట్టి లింగానికి ఒక్కదానికీ అభిషేకం బట్ట లేకుండా. బట్ట కట్టుకుని స్నానం చెయ్యాలి. అలాగే వస్త్రధారణకి కూడా అంత నియమమూ ఉంటుంది వేదంలో.

ఎప్పుడైనా సరే భగవత్సంబంధమైన కార్యంలో ఉన్నాడంటే శాస్త్రం విధించింది **శద సమ ఖండం** అందుకే పంచె చీల్చాలీ అంటే మధ్యలో నేతకి ఖాళీ వదిలేస్తారు. అక్కడే కత్తిరించుకోండి అని. అంటే రెండూ వేరు చేసేసామని గుర్తు. మధ్యలో ఎక్కడైనా చింపినా, అంచులేకపోయినా, ఆ బట్ట కట్టుకుని పూజ చేస్తే నగ్నంగా

కూర్చుని పూజ చేశాడన్న మహాపాపాన్ని వాడి ఖాతాలో వేస్తారు. కాబట్టి **శద సమ ఖండం, శ్వేతం, ధౌతం, వస్త్రం కంఠారయేత్** కాబట్టి తెల్లటి బట్ట కట్టుకోవాలి. **ధౌతం** ఒకవేళ కొత్త బట్ట కాకపోతే ఉతికి ఆరేసిన బట్ట కట్టుకోవాలి. ఉతికి ఆరేసిన బట్ట సిద్ధంగా లేకపోతే సూర్యాభిముఖంగా తిరిగి పదకొండుమాట్లు దులపాలి. దులిపి కట్టుకోవాలి. అలా కట్టుకున్న బట్టతో చెయ్యాలి తప్ప పురుషుడు– అంచులేని బట్ట కట్టుకున్నా, అంటే ఇంట్లో తిరుగుతున్నప్పుడు ఏదో రంగు లుంగీ కట్టుకున్నారేమో. కానీ పూజలో కట్టుకుంటాను, భోజనం చేసేటప్పుడు కట్టుకుంటానంటే కుదరదు. అంచు ఉన్న బట్టే కట్టుకోవాలి. అదీ శ్వేతం. సాధ్యమైనంతవరకూ తెల్లటి బట్టే కట్టుకోవాలి. ధౌతం ఉతికిన బట్టే కట్టుకోవాలి. భగవంతుని ఆరాధన చేసేటప్పుడు **వికక్షః అనుత్తరీయం నగ్నశ్చ అవస్త్రస్య ఏవచ** ఎవడు గోచీ పోసి వెనుక కుచ్చిళ్ళు పెట్టుకుని పూజ చేస్తున్నాడో, ఎవడు ఎడమ భుజం మీద ఉత్తరీయం లేకుండా పూజ చేస్తున్నాడో వాడు భగవంతుని దగ్గరకు వచ్చి నగ్నపూజ చేసి పరిహసించాడని వేస్తాడు. వాడి ఖాతాలో పూజ చేసినట్లు వెయ్యరు. ఇలా చుట్టూ తిప్పితే దిగ్దర్శనమంటారు. అంటే దిక్కులు తెలియడానికి కడతారు అలా. అంటే అదొక ప్రక్రియ. కానీ ఇలా కట్టేసి అన్ని వేళలా వెయ్యకూడదు అలాగ. భగవద్దర్శనానికి కానీ, పూజకి కానీ కూర్చుంటున్నామంటే వికక్షః, గోచీ లేని బట్ట కట్టరాదు. గోచీ లేకుండా వచ్చాడనుకోండి మీరైనా గోచీ పెట్టాలి. వెనక్కి తీసి అంచు కుచ్చిళ్ళు పెట్టి దోపి ఒరేయ్ నాయనా, నీకు అలవాటు లేకపోతే జారిపోకుండా మొలతాడు వేసి గట్టిగా కట్టుకోరా అని చెప్పాలి. **వికక్షః అనుత్తరీయశ్చ**, ఉత్తరీయం లేకుండా వాడు పూజకి అనర్హుడు. వాడు చెయ్యకూడదు పూజ. గోచీ పోసిన పంచె కట్టుకుంటేనే వాడు పూజార్హుడు. నేను చెప్పట్లేదు సొంతంగా, మీకందుకే ప్రమాణవాక్కు చూపిస్తున్నాను నేను. శ్రుతి చెప్తోంది. మనకి సూత్రాలు చెప్తున్నాయి. ఇలా చేస్తేనే ఆచారకాండ అని. నేను చెప్పాను కదా ధర్మం.

నేను అన్నవరం వెళ్ళాలంటే అన్నవరం దారిలో వెళితేనే అన్నవరం వెళతాను. నెల్లూరు ఉపన్యాసానికి వద్దామంటే నెల్లూరు వచ్చే రైలెక్కాలి. అంతేకానీ నేను బొంబాయి వెళ్లే రైలెక్కి అన్నీ రైళ్ళే కదండీ అంటే నెల్లూరు రాదు, బొంబాయి వెళతాను. నేను పూజే కదండీ చేస్తున్నానంటే, నీ ఇష్టం వచ్చినట్లు కట్టుకుని నువ్వు పూజ చేస్తానంటే పూజ చేసినట్లు వెయ్యరు. ఈశ్వరుడు చెప్పినట్లు

కట్టుకుని చేస్తేనే చేసినట్లు. కాబట్టి **వికక్షః** గోచీ పోసి కట్టుకోవలసిందే. అలాగే భగవత్పూజ యందు **అనుత్తరీయశ్చ** ఉత్తరీయం లేకపోతే, **నగ్నశ్చ** బట్టలేనివాడూ అని వదిలిపెట్టలేదు శాస్త్రం. **అవస్త్రస్య** అసలు వాడి ఒంటిమీద నూలుపోగు లేదని లెక్కలో కడతారు. **యేవచాంతే** అలా పూజ చేశాడు కాబట్టి పరమపాపం చేశాడని వాడి ఖాతాలో వేస్తున్నాను. ఎప్పుడు? ఒకటి గుర్తు పెట్టుకోండి. పరమభక్తితో తెలియక చేసినదానిని ఈశ్వరుడు తప్పు పడతాడని నేను చెప్పడం కష్టం. పరమభక్తితో వాడికి తెలియదు పాపం అలా చెయ్యకూడదని చేశాడు. అది తప్పని నేను చెప్పడం సాహసం. కానీ చెప్పు చెప్పూ అని నాకెలా ఉండాలో ఒకరోజని, చెప్పించుకుని కూడా అలా చేశాడనుకోండి. అప్పుడు మాత్రం తప్పే. ఎందుకయ్యా అంటే నువ్వడిగావు నేను చెప్పాను. ఇప్పుడు నువ్వు చెయ్యాలి. కాబట్టి కొన్ని అడగడం ఇబ్బంది. కాబట్టి గోచీ పోసి కట్టుకు తీరాలి.

అలాగే ఐదు కర్మలలో ఉత్తరీయం లేకుండా ఉండకూడదు. ఐదు పనులు చేసేటప్పుడు తప్పకుండా ఉత్తరీయం వేసుకునే చెయ్యాలి. ఏవీ అవి అంటే, స్వాధ్యాయ, హోమం. స్వాధ్యాయమంటే వేదం చదువుకోవడం. గురువుగారి దగ్గర వేదం చెప్పుకునేటప్పుడు ఉత్తరీయం లేకుండా వేదం చెప్పుకోకూడదు. బ్రహ్మచారి నియమం వేరు. **ఏక వస్త్రం తరోధన్వి శిఖీ కనకమాలయా** అని బ్రహ్మచారికి ఏకవస్త్రం. కాబట్టి ఆయనకి వర్తించదు. గృహస్థు వేదం నేర్చుకుంటున్నాడనుకోండి ఉత్తరీయం ఉండాలి. స్వాధ్యాయంలో లేదా కూర్చొని మంత్రాన్ని మళ్ళీ ఆమ్నాయం చేస్తున్నాడు. ఉత్తరీయం వేసుకుని ఆమ్నాయం చెయ్యాలి. ఉత్తరీయం తీసి ఎక్కడో పారేసి ఆమ్నాయం చెయ్యకూడదు. కాబట్టి ఒకటి స్వాధ్యాయం. హోమం, హోమమంటే యాగకుండం దగ్గర కూర్చొని వేడిలోకి స్వాహా అని ఇస్తున్నాడనుకోండి. నెయ్యి కానీ, సమిధ కానీ, చరువు కానీ అంటే హవిస్సు కానీ వేస్తూ ఉంటే ఉత్తరీయంతోటే ఇవ్వాలి. ఉత్తరీయం లేకుండా వెయ్యకూడదు. కాబట్టి స్వాధ్యాయ, హోమ, దాన– ఎవరికైనా ఏదైనా దానం చేసేటప్పుడు ఉత్తరీయం లేకుండా దానం చెయ్యకూడదు. ఉత్తరీయం లేకుండా తాను పుచ్చుకోకూడదు. మీరు నాకు ప్యాంటు, చొక్కా వేసుకొచ్చి ఒక పంచెలచాపు ఇస్తున్నారనుకోండి. నేనైనా ఎవరినైనా అడిగి ఒక రుమాలు మీ భుజం మీద వెయ్యాలి. నేను నా ఉత్తరీయంతో పుచ్చుకోవాలి. అంతేకానీ ఉత్తరీయం లేకుండా

పుచ్చుకోకూడదు, ఉత్తరీయం లేకుండా ఇంకోళ్ళకి ఇవ్వకూడదు. **అనుత్తరీయశ్చ** ఉత్తరీయం లేకుండా ఎట్టి పరిస్థితుల్లో చెయ్యకూడని పనులు ఈ అయిదూ. ఏవి? స్వాధ్యాయం, హోమం, దానం, అలాగే భోజనం.

ఆహారాన్ని తీసుకునేటప్పుడు ప్రత్యేకించి పరిషేచనం చేసి ఆహారం తింటున్నామనుకోండి, పైన ఉత్తరీయం ఉండాలి ఇలా. ఉత్తరీయం ఉండి తినాలి. ఉత్తరీయం తీసేసి పడేసి పైన ఏ ఆచ్ఛాదనా లేకుండా కేవలం కింద కట్టుకుని భోజనం చెయ్యకూడదు. అది అప్పుడు యజ్ఞం కాదు, పొరపాటు. ఉత్తరీయంతో చెయ్యాలి. కాబట్టి దానియందూ, అలా చేసినప్పుడు **ఆచమనం**, ఆచమనం చేసినప్పుడు ఉత్తరీయం ఉండి తీరాలి. ఉత్తరీయం లేని ఆచమనం చెయ్యకూడదు గృహస్థు. నేను బ్రహ్మచారి గురించి చెప్పడంలేదు. అసలు మనం చేసే ఆచమనాలన్నీ తప్పనుకోండి. ఆచమనం చేసేటప్పుడు పృష్ఠభాగం భూమికి తగలకూడదు. ఇలా కూర్చుని ఆచమనం చెయ్యకూడదు. ఇలా పైకి గొంతుకి కూర్చొని నీ రెండు కాళ్ళ మధ్యలో చేతులు పెట్టి పుచ్చుకోవాలి. పుచ్చుకుని చేస్తే దానిని ఆచమనం అంటారు. అలా మూడుమార్లు మినపగింజ మునిగినంత నీరు లోపలికి పుచ్చుకుంటారు. పుచ్చుకుంటే ఆయన ఆచమనం చేసేశాడని గుర్తు. ఈశ్వరుడి కృప కలుగుతుంది.

స్థూల,సూక్ష్మ,కారణ శరీరాలలో తాపాలు వెంటనే ఉపశాంతి పొందుతాయి. మనసు నిలబడుతుంది. ఈశ్వరకృప కలుగుతుంది. ధ్యానంలో నిష్ణాతుడవుతాడు. తపశ్శక్తి పొందుతాడు. కాబట్టి ఈ అయిదు పనులూ ఉత్తరీయం లేకుండా చెయ్యవద్దు. నిత్యకర్మానుష్ఠానంలో సనాతనధర్మంలో అత్యంతప్రధానమైంది లలాటాన్ని అలంకరణ చెయ్యడం. లలాటానికి ఏ విధమైన భగవత్స్పర్శ లేకుండా, భగవత్సంబంధమైన పుండ్రధారణం లేకుండా దేవతార్చన చెయ్యరు. అందుకని లలాటంలో విభూతి ధారణ చెయ్యడం, ఊర్ధ్వపుండ్ర ధారణం చెయ్యడం సంప్రదాయంలో నియమాలుగా వస్తున్నాయి. భస్మధారణ అని వైదికప్రక్రియలో అదొకటి. భస్మధారణ చేస్తారు. భస్మం అనే మాటని కొంచెం జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. భస్మం అంటే లౌకికంగా పైకి దాని అర్థం బూడిద అని. కానీ భస్మం అన్నమాటకి అదొక్కటే అర్థం కాదు. భస్మం అంటే మహదైశ్వర్యం. దానిని మించిన

ఐశ్వర్యం ఇంకొకటి లేదు లోకంలో. స్కాందపురాణంలో బ్రహ్మోత్తర ఖండమని ఒక ప్రత్యేకమైన ఖండం. దానియందు ఈ భస్మం ప్రాశస్త్యాన్ని చాలా విశేషంగా వర్ణిస్తారు. భ అంటే భగవానుడు, స్మ అంటే స్మరణకు తెచ్చుకొనడం. భగవంతుడు జ్ఞాపకానికి వస్తూ ఉంటే, భగవంతుడు సర్వదా మస్తిష్కంలో మెదులుతూ ఉంటే ఆ వ్యక్తి జీవితం గట్టెక్కిపోయినట్లే. వాడు మనుష్యజన్మలోకి వచ్చినందుకు నరజన్మని సార్థకం చేసుకున్నట్లే. లేకపోతే ఒక్కసారి నరజన్మలో శరీరాన్ని భగవత్స్మరణ లేకుండా, భగవంతునితోటి అనుబంధం లేకుండా వదిలిపెట్టేస్తే, మళ్ళీ కొన్ని కోట్ల కోట్ల జన్మల తరువాత తప్ప మనుష్యజన్మ రాదు.

చాలామంది ఒక అభిప్రాయంతో ఉంటారు. మనుష్యశరీరాన్ని విడిచిపెడితే మళ్ళీ మనుష్యశరీరంలోకి వస్తాడనుకుంటూ ఉంటారు. కానీ అది యథార్థం కాదు. మనుష్యజన్మకి పునర్జన్మ ఏదీ అనేది పరమేశ్వరుడు నిర్ణయించింది కాదు. పరమేశ్వరుడికి స్వాతంత్ర్యం లేనిదీ, పరమేశ్వరుడు నిర్ణయం చెయ్యనిదీ అదొక్కటే. ఎందుకంటే బుద్ధినిస్తాడు పరమేశ్వరుడు నరజన్మలో. ఆ బుద్ధి చేత శాస్త్రాన్ని తెలుసుకొని శాస్త్రీయమైన రీతిలో ఎవడు అనుష్ఠానం చేశాడో, ధర్మతత్పరుడై నిలబడ్డాడో, వాడు భగవంతునియందు ఐక్యమవుతాడు. లేదా ఇక్కడే జ్ఞానాన్ని పొంది మోహాన్ని పొందుతాడు. లేదా ఊర్ధ్వలోకవాసం పొందుతాడు దేవతలగా. కానీ మనుష్యుడు మనుష్యుడుగా పుట్టాలనే నియమం లేదు. కారణమేమంటే మనస్సని ఒకటుంటుంది, అది సూక్ష్మశరీరం. ఇప్పుడు నా ఊపిరితిత్తులని చూపించమంటే డాక్టర్‌గారు చూపించగలరు. నా కంటిలోపల ఉన్న రెటినాను చూపించమంటే చూపించగలడు. నా గుండె కూడా చూపించగలడు. కానీ నా మనస్సును చూపించండీ అంటే చూపించలేరు. మనస్సు సంకల్ప వికల్పాల సంఘాతం. సంకల్ప వికల్పాలంటే ఒక దానిని ఆలోచిస్తుంది, విడిచిపెడుతుంది. ఇంకోదాన్ని పట్టుకుంటుంది. ఈ పట్టుకోవడం, విడిచిపెట్టడం, పట్టుకోవడం, విడిచిపెట్టడం చేసే మనస్సు శక్తి అంతా దేనిమీద ఆధారపడుతుందంటే, ఊపిరి మీద. ఊపిరి ఎంత వేగంగా తీస్తామో మనసంత వేగంగా కదులుతుంది. అందుకే విశేషమైన కోరికతో ఉన్నా, కోపంతో ఉన్నా, చాలా తీవ్రమైన ఉద్వేగంతో ఉంటాడు. ఊపిరి చాలా ఎక్కువ తీస్తాడు. ఊపిరి ఎంత ఎక్కువ తీస్తే అంత

తొందరగా ఆయుర్దాయం క్షీణించిపోతుంది. అందుకే ప్రశాంతంగా ఉండి మనసుని నిగ్రహించాలంటే ప్రాణాయామం చేస్తారు.

ఆ మనసుకి ఒక లక్షణం ఉంటుంది. అది వాసనా అని మెల్లిమెల్లిగా, మెల్లిమెల్లిగా లోపల అన్నింటినీ గుప్తంగా దాచుకుంటుంది. రుచి, వాసన అని రెండుంటాయి మనసుకి. అంటే ఒక దానిని అనుభవిస్తుంది. నాకు చక్కెరపొంగలి ఎలా ఉంటుందో పుట్టుకతో తెలియదు. ఎప్పుడో తిన్నాను చక్కెరపొంగలి. తిన్న తరువాత చక్కెరపొంగలంటే ఇలా ఉంటుందని దానికి ఒక అభిప్రాయం నిర్ణయించుకుంది. దాన్ని వాసన అంటారు. చక్కెరపొంగలిమీద దానికి ప్రీతి ఉండిపోయిందనుకోండి. తరచుగా అదే అడుగుతుంది. మనసు తరచుగా ఏమడుగుతూ ఉంటుంది? మనసు తరచుగా దేనియందు నిలబడిపోతుంటుంది? అదే పరీక్ష. అది ఎవరికి వారే చేసుకోవాలి. నా మనసు తరచుగా దేనియందు నిలబడుతుంటుంది? నేనే కార్యంలో లేకపోతే దేని దగ్గరకు వెళ్ళి నిలబడుతుంటుంది? దేన్ని గురించి ఆలోచిస్తూ ఉంటుంది? అది చాలా జాగ్రత్తగా పరిశీలన చెయ్యాలి. ఎందుచేత అంటే అదే పునర్జన్మకి హేతువు.

**మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః.** బంధానికి కానీ, మోహానికి కానీ ఆ మనసే కారణం. అది దేన్ని పట్టుకుంటుంది అనేది చూసుకుంటుండాలి. లేకపోతే ఏమైపోతుందంటే దాని ఉద్విగ్నత, దాని వ్యగ్రత ఏదో ఒక విషయం మీద కెళ్ళి నిలబడతాయి.

ఒక ఉదాహరణకి ఒక వ్యక్తికి ఇంకొక వ్యక్తి మీద శత్రుత్వం. మీరు బాగా గమనించండి. నేను చెప్పే విషయాన్ని మీరు కొంచెం గంభీరంగా స్వీకరించవలసి ఉంటుంది. ప్రీతి కలిగినా, శత్రుత్వం కలిగినా మనసు తరచుగా దానినే పట్టుకుంటుంది. అది దాని లక్షణం. నాకు నా భార్యంటే చాలా ప్రీతి అనుకోండి. అది నా భార్యని పట్టుకుంటుంది. నాకొక వ్యక్తంటే విపరీతద్వేషమనుకోండి. తరచుగా అతన్నే పట్టుకుంటుంది. అతని గురించే ఆలోచిస్తూ ఉంటుంది. వాడిలా అన్నాడు, ఇలా అన్నాడని అదే ఆలోచనకొస్తూ ఉంటుంది. ప్రీతి, అప్రీతి ఈ రెండు కారణాలచేత మనసు పట్టుకుంటుంది. ప్రీతి చేత కానీ, అప్రీతి– ద్వేషం చేత కానీ మనసు లౌకికమైన విషయాన్ని పట్టుకోవడం అలవాటు పడిపోతే

చిట్టచివరి ఊపిరి తియ్యడం కానీ, చిట్టచివరిసారి ఊపిరి విడిచిపెట్టడం కానీ అదే మృత్యువు. తీసి విడిచిపెట్టకపోవచ్చు, విడిచిపెట్టి పీల్చకపోవచ్చు. కాబట్టి మృత్యువంత సన్నిహితంగా ఏదీ ఉండదు. ఈ రెండిటిలో ఏది జరిగినా ఆఖరి ఊపిరిలో, ఆఖరిసారి కదలుతుంది మనసు. ఆఖరిసారి కదిలినప్పుడు దానికి బాగా ప్రీతిపాత్రంగా ఉన్నదేదో దాన్నే స్మరిస్తుంది. అప్పుడు ఆ స్మరణని ఈశ్వరుడు ఆధారంగా స్వీకరిస్తాడు. నీకు మనుష్యజన్మనిచ్చాను, బుద్ధినిచ్చాను, నువ్వు చిట్టచివర దేన్ని స్మరించావు? అంటే నీ మనసు ప్రీతి అంతా దాని మీద ఉండిపోయేటట్లుగా నువ్వు ప్రవర్తించావా, లేదా? నీకు లౌకికమైన విషయం మీద ప్రీతి నిలబడిపోయింది. ఆ పాటిదానికి మనుష్యశరీరమెందుకు? ధర్మాన్ని పట్టుకుని అనుష్ఠానం చెయ్యడానికీ, శాస్త్రం పట్టుకోవడానికే మనుష్యశరీరం కానీ, లౌకికమైన విషయాలను ప్రేమించడానికీ, లౌకికమైన విషయాలను ద్వేషించడానికీ మనుష్యశరీరం అక్కర్లేదు.

ఏ శరీరానికైనా షడూర్ములుంటాయి. ఆకలి, దప్పిక, జర, మరణం, శోకం, మోహం– ఈ ఆరు లక్షణాలూ లేని జీవి ప్రపంచంలో ఉండదు. కాబట్టి ఇప్పుడిక మనుష్యశరీరమెందుకు? నీ స్మరణే ఆధారం. నువ్వు ఫలానాది స్మరించావు కనుక ఆ శరీరంలోకి వెళ్ళిపో. తిర్యక్కును చేస్తారు. తిర్యక్కుని చేస్తే పునర్జన్మలో వెన్నుపాము అడ్డంగా ఉండే ప్రాణిగా వెళ్ళిపోతాడు. అంటే అది కుక్కవవచ్చు, నక్కవవచ్చు, పంది అవవచ్చు, పిల్లి అవవచ్చు, చీమ అవవచ్చు, దోమ అవవచ్చు. ఆ ప్రాణిగా వెళ్ళిపోతాడు. వెళ్ళిపోతే ఇక కర్మాధికారం ఉండదు. ఇక ఈ పని నేను చేస్తానని సంకల్పం చెయ్యడానికి కానీ, పుణ్యకర్మమన్న మాట కానీ ఇక ఆ శరీరాలకు అన్వయం కాదు. అదీ వేదాంతంలో ఉన్న పెద్ద రహస్యం. నేనిది చేస్తానని సంకల్పం అది చేసుకోదు. అది మంచి చేసినా పుణ్యం చేశారని వెయ్యరు. అది చెడు చేసినా పాపం చేశారని వెయ్యరు. దానికున్నదొక్కటే. ఆ ఒక్కటే పశుధర్మం.

నేను మొన్నను శ్రీశైలం వెళ్ళాను. శిఖరేశ్వరదర్శనానికి వెళ్ళా. ఎందుకో గోడదాటి వెళ్ళి చూస్తున్నాను. పక్షి ఎక్కడో అరుస్తున్నట్లు వినబడింది. ఏమిటి, ఆకాశంలో వినబడకుండా భూమి మీద పక్షి అరుపు వినబడుతోందేమిటి చిత్రంగా ఉందని, గోడ అంచు దగ్గరికి వెళ్ళి చూశాను. చూస్తే ఒక పక్షి

గిలగిలా కొట్టుకుంటోంది, ఎగురుదామనుకుంటోంది పడి పోతోంది, ఎగురుదామనుకుంటోంది పడిపోతోంది. అరే ఏమిరా ఈ పిట్ట ఎగరలేక పోతోందని చూశాను. ఏదో దీని కాలికో, దేనికో తాడు చుట్టుకుంది. అది చెట్టు కొమ్మకి చుట్టుకుంది. ఎగరలేకపోతోంది. బాధపడి అరుస్తోంది, సహాయం కోసమనుకుంటున్నాను, ఎక్కడ్నించో ఒక కుక్క దూకివచ్చేసింది. వచ్చేసి దాన్ని పట్టేసుకోవాలని వస్తోంది. నా వెనుక ఒక వ్యక్తి ఉన్నాడు శేషు అని. అతను డప్పు కొడుతూ, భజన చేస్తుంటాడు. నేను గట్టిగా కేకేసి రావయ్యా, రా, రా పక్షిని రక్షించు అన్నాను. వాడొక్కసారి గోడదూకి ఆ డప్పు గట్టిగా కొట్టాడు. అందరం అరిచాం. కుక్క పారిపోయింది. ఆ పక్షిని తీసి కాలికి ఉన్న దారం విప్పేసి వదిలిపెట్టేస్తే అది ఎగిరిపోయింది. నేనెందుకు మీతో మనవి చేస్తున్నానంటే ఇప్పుడు నేను ఆ పక్షిని రక్షించాలని కోరుకున్నాను. కుక్క ఆ పక్షిని తినేసిందనుకోండి. కుక్కకేమైనా పాపం వస్తుందా అంటే ఏమీ రాదు. అది పశుధర్మం అంతే. దానికేం పాపం లేదు, పుణ్యం లేదు. కానీ నేను చూస్తూ ఊరుకున్నాననుకోండి. నాకు పాపం వస్తుంది. అదీ మనుష్యశరీరాలకీ, ఇతరశరీరాలకీ ఉండే తేడా. అందుకే కర్మానుష్ఠానం లేదు, పుణ్య పాపాలు చెయ్యవు ఇతరప్రాణులు. అలా చెయ్యవు కాబట్టి మళ్ళీ మనుష్యశరీరంలోకి రావాలంటే కొన్ని కోట్ల జన్మలు పడుతుంది. ఏ మహానుభావుడికో ఆశ్రయం ఇవ్వడమో, దాని పాలు తాగడమో, ఆయనకు సేవ చెయ్యడమో, ఎక్కడో ఏదో ఘనమైన పుణ్యం జరిగిపోతే, అప్పుడు అబ్బా, వేదాంతంలో ఎంతో పరిశీలన చేసి మనుష్యజన్మనిస్తారు. అప్పుడు మాత్రం ఉపయోగించుకుంటావని ఏమిటి నమ్మకం? ఇప్పుడొకటి ఉపయోగించుకోలేదా? కొన్ని కోట్ల జన్మల తరువాత వచ్చే మనుష్యజన్మను ఉపయోగించుకుంటావా? ఏమిటి సాధించేది ఇక?

కాబట్టి మనస్సు దేన్ని పట్టుకుంటోందన్నదే పునర్జన్మ హేతువు. మనసు భగవంతుణ్ణి కానీ, శాస్త్రాన్ని కానీ పట్టుకుందనుకోండి. దాని గురించి ఆలోచిస్తూ వెళ్ళిపోయిందనుకోండి. ఎప్పుడూ రామాయణం ఆలోచించడం ఆయనకి అలవాటు కాదు, ఆ మనసుకి అలవాటైపోయింది. ఎప్పుడూ రామాయణంలో ఏదో శ్లోకం జ్ఞాపకం తెచ్చుకుంటుంది. లేకపోతే భాగవతం జ్ఞాపకం తెచ్చుకుంటుంది.

లేకపోతే ఏదో భగవత్ స్వరూపాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటుంది. ఏదో శాస్త్రపరిశీలనం చేస్తూ ఉంటుంది. దానికలవాటు అది. మనసు అక్కడికి వెళ్ళి నిలబడిపోతుంది. అలా నిలబడిపోవడం అలవాటైందనుకోండి. ఆఖరి ఊపిరియందు మనస్సు అలాగే కదులుతుంది. దాన్ని ఆధారంగా తీసుకుని ఈశ్వరుడు ఉత్తరజన్మలలో ఏం చేస్తాడంటే మహాపండితుడైన పరమభక్తుని కడుపున పుట్టేట్టు చేస్తాడు. తండ్రి సహజంగా మహాపండితుడు, భక్తితత్పరుడు కనుక తండ్రిని మించిన గురువు, దైవం లోకంలో ఉండడు. తండ్రి కలిగిన పెన్నిధానమేల? అని. తండ్రి ఉంటే ఐశ్వర్యమెందుకూ అన్నారు. ఎందుకంటే తండ్రి తాను కష్టపడి అయినా కొడుకుని సుఖపెడతాడు. తండ్రే పెద్ద ఐశ్వర్యం. **మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ** అంది యజుర్వేదం. తండ్రిని శివస్వరూపంగా కీర్తించారు. అటువంటి తండ్రి కడుపున పుట్టి, ఆ తండ్రి మార్గంలో అనుష్ఠానం నేర్చుకుని, భగవంతుడికి దగ్గరై, వైరాగ్యమూ, జ్ఞానమూ పొంది తరించి మోక్షానికి వెళ్ళిపోతాడు. అంటే జన్మపరంపర తగ్గిపోతుంది. తగ్గిపోయి కొద్ది జన్మలలోకొచ్చి ఈశ్వరునియందు కలుస్తాడు. అందుకే సమస్తశాస్త్రాల ప్రయోజనమూ ఒక్కటే. మనసుని సంస్కరించటం మాత్రమే.

ఆ మనసుని సంస్కరించడానికి మీకది దొరకదు. అది దొరికేది కాదు. దానికో లక్షణముంది. అది జారిపోతుంది. జారిపోయే మనసుని పట్టు కోవడానికి ఏం చేయాలంటే ఆచారకాండను ఆశ్రయించాలి. ఆచారకాండను ఆశ్రయించారనుకోండి, మీకు తరచుగా జ్ఞాపకం వస్తూ ఉంటుంది నేను ఇప్పుడిలా ఉన్నానూ అని. మీరు చూడండి దేశపుసరిహద్దులలో నిలబడి యుద్ధం చేసి దేశాన్ని రక్షించేవ్యక్తి ఒక ప్రత్యేకమైన రంగు కలిగిన బట్ట కట్టుకుంటాడు. అతను ఆ బట్ట కట్టుకుని నిలబడితే అతనికి జ్ఞాపకానికి వస్తూ ఉంటుంది, నేను అవసరమైతే నా దేశం కోసం ప్రాణం కూడా విడిచిపెట్టేస్తానని. ఒకాయన గోరుచుట్టు నాలుగు వీథుల మధ్య నిలబడి కోసెయ్యగలడు. కానీ గోరుచుట్టు కొయ్యాలంటే చెప్పులు విప్పేసి చేతులకి ప్రత్యేకమైన పరికరాలు తొడుక్కుని ఒక రంగు బట్టలేసుకుని శస్త్రచికిత్స చేసే గదిలోకి వెళతాడు. అది వేసుకుని ఉన్నప్పుడు ఆయనకి తరచుగా జ్ఞాపకం వస్తుంది నేను వైద్యుణ్ణి, ఇక్కడ నాకు ఏ రాగద్వేషాలూ

లేవు, అవతలి వారిని కాపాడడమొక్కటే అని ఆయన తన కర్తవ్యనిష్ఠతో ఉంటాడు. కర్తవ్యనిష్ఠని కల్పించడానికి ఆచారకాండ వస్తుంది. అందుకని స్నానం కానీ, బట్ట కానీ ఇలా ఉండండని నిర్ణయం చెయ్యడానికి కారణం ఎలా ఉంటే దేవతల అనుగ్రహం కలిగి మనసు నిలబడడం సాధ్యమవుతుందో, దాన్ని పరమేశ్వరుడు నిర్ణయం చేసి ఆచారకాండగా ఇచ్చాడు భస్మం. వెనక్కి రండి– భగవంతుని స్మరించటం. భగవంతునియందు మనసు నిలబడాలి. పూజ చేయటం అంటే భగవంతుని యందు మనసు నిలబడటం. నేను ఎంత మంచి పంచె కట్టుకుంటే లాభమేమిటి? ఎంత స్నానం చేస్తే లాభమేమిటి? నేను వెళ్ళి పూజామందిరంలో పీట వేసుకుని కూర్చుంటే భగవంతుడు తప్ప మిగిలినవన్నీ నాకు జ్ఞాపకానికి వస్తున్నాయనుకోండి. నేను పూజ చేశానూ అని నా భార్య అనుకోవచ్చు. నేను పూజ చేస్తున్నానూ అని నా పిల్లలు అనుకోవచ్చు. కానీ నేను పూజ అన్న పేరుతో నటన చేస్తున్నానన్నది పరమేశ్వరుడికొక్కడికే తెలుసు, నాకు తెలుసు. ఎందుకని? నా మనసు లేదు. నా మనసు ఆయనయందు లేదు, నా మనసు ఆయనని స్మరించడంలేదు. అది వేరొక విషయాన్ని స్మరిస్తోంది. కూర్చోవడం. శరీరం మాత్రం వెళ్ళి కూర్చుంది ఒక అరగంట సేపు. అది కాదు పూజ అంటే. పూజ అంటే మూడు ఏకీకృతమవ్వాలి. కాయికకైంకర్యమూ, వాచికకైంకర్యమూ, మానసికకైంకర్యమూ మూడూ ఒకటైపోతే దాన్ని పూజ అని పిలుస్తారు.

మానసికం మొదటిది. మనసుతో భగవంతుని కదలికని చూడాలి. అక్కడే ఉంటుంది పూజామందిరంలో ఉండే మూర్తి. అదేం కొత్తగా కదిపేసి రాత్రి ఎక్కడికో పట్టుకెళ్ళిపోయి మళ్ళీ పొద్దున పట్టుకొచ్చి అక్కడ పెట్టరు. కానీ మీరొక మాటంటారు **ఆవాహయామి** అని. **ఆవాహయామి** అంటే కొత్తగా ఏమిటొస్తోంది అందులోకి? **ఆవాహయామి** అన్న మాటకి అర్థం ఆయన కదలికలను చూడడం నా మనసు ప్రారంభం చేసింది. **హస్తయోః అర్ఘ్యం సమర్పయామి** అన్నారనుకోండి. అవతలివాడు పూజ చేస్తున్నాడో, పూజ చేస్తున్నానన్న పేరు పెట్టుకుని నటన చేస్తున్నాడో మీకు వెంటనే తెలిసిపోతుంది. ఎందుకు తెలిసిపోతుందో చెప్పనా? **హస్తయోః అర్ఘ్యం సమర్పయామి** అని కళ్ళు మూసుకున్నాడనుకోండి, ఆయన పూజ చేస్తున్నాడని గుర్తు. ఆయన **హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, పాదయోః**

**పాద్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి** అని తమలపాకు పట్టుకుని నీళ్ళు పోస్తున్నాడనుకోండి, ఆయన తంతు చేస్తున్నాడని గుర్తు. ఆయన మనసు లేదక్కడ. నిజంగా ఆయన **హస్తయోః అర్ఘ్యం సమర్పయామి** అన్నప్పుడు ఆయన మనస్సు నిలబడింది నిజమైతే, ఆయనకి పరమేశ్వరుడు ఇలా చెయ్యి చాపడం కనబడాలి, ఆకుతో ఆయన నీళ్ళు పొయ్యడం కనబడాలి. ఈశ్వరుడి రెండు చేతులూ ఇలా కడుక్కోవడం కనబడాలి. మీ రెండు చేతులూ మీరు కడుక్కున్నారనుకోండి. మీరు మళ్ళీ ఇలా పంచె మీద పెట్టుకుంటారా. వెంటనే మీ మీద ప్రేమ ఉన్నవారు ఏం చేస్తారు? ఎవరు మీ చేతులు కడుక్కోవడానికి నీళ్ళు పోశారో వారే గబగబా ఒక తువ్వాలో, ఒక ఉత్తరీయమో, ఏదో ఒకటి పట్టుకొచ్చి తుడుచుకోండంటారు. అయితే ఇప్పుడు ఇలా తుడుచుకుంటానా, తుడుచుకోనా? నాకు ఉత్తరీయం లేక కాదు.

నేను ఒక్కొక్కళ్ళ ఇంటికి దేవతార్చనకి వెళితే, దేవతార్చన అంటే భోజనం. భోజనానికి వెళితే చెయ్యి కడుక్కున్న తరువాత గబగబా తువ్వాలు పట్టుకొస్తారు. నేనేం అడిగానా తువ్వాలిమ్మని? నేను ఆ తువ్వాలుకి చెయ్యి తుడుచుకుంటుంటాను. ఎందుకని? నాకు ఉంది కదండీ అంటాను. అబ్బబ్బా, దీనితో తుడుచుకోండి అంటారు. ప్రేమ. ఏమీ నేను భోజనం చేసి చేతులు కడుక్కుంటే ఉత్తరీయం ఇచ్చినవాడివి, పరమేశ్వరుడికి అర్ఘ్యమిచ్చి ఉత్తరీయమెందుకు ఇవ్వలేదు? మరి కళ్ళు మూసుకుని ఒక్కసారి నీ మీద ఉన్న ఉత్తరీయం తీసి నువ్వు ఆయన చేతులు తుడిచి ఉండాలి కదా? అక్కడ ఆగి ఉండాలి కదా మంత్రం దగ్గర. మరి ఆగకుండా వెంటనే **హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి** అని వెంట వెంటనే అనేసి తమలపాకుతో నీళ్ళలా పోసేశావు? అంటే నీ మనస్సు అక్కడ నిలబడి లేదు. నీ మనస్సు అక్కడ నిలబడకుండా నోరు అంటోంది, చెయ్యి చేస్తోంది. ఈశ్వరుడు దాన్ని పూజగా స్వీకరించడు. దానిని ఈశ్వరుడు తంతు అంటాడు. తంతు అంటే అసలు దానియందు మనసు నిలబడి లేదు. కానీ ఉన్నట్లుగా బయటివారికి కనబడేటట్లు ప్రవర్తిస్తున్నాడంతే. అప్పుడది పూజ కాదు. అందుకే భగవత్సంబంధం మనసునందు నిలబడి ఉండాలి. ఆ నిలబడి ఉండడానికి ఏం చేస్తారంటే బుద్ధిస్థానం, ఆజ్ఞాచక్రం ఉంటుంది.

శంకరాచార్యులవారు సౌందర్యలహరి చేస్తూ ఒక మాటంటారు. ఇక్కడ ఆజ్ఞాచక్రం రెండు కనుబొమల మధ్య ఉండే కేంద్రంలో మనసు స్థానం అది. మనోబుద్ధి భ్రూమధ్యే అంటారు. ఆ భ్రూమధ్యంలో ఉంటుంది మనస్సు. దాని స్థానం. ఆ స్థానంలో ఉన్న మనస్సు స్థిరంగా నిలబడాలీ అంటే మీరు భగవంతుని స్మరణలచేత అలదాలి దాన్ని. ఏదైనా సరే ప్రకృతి, పురుషసంబంధం లేకుండా ఉండకూడదు. ఒక్క ప్రకృతి కానీ, ఒక్క పురుషుడు కానీ కుదరదు. మీరు శివలింగం ఒక్కదాన్నే పెట్టి పూజ చేసినా, శివుడొక్కడే కాదు.

**పీఠం అంబమయం సర్వం శివలింగైశ్చ చిన్మయం సాకారం చ నిరాకారం నిర్గుణం చ గుణాత్మకం తత్త్వం తత్ పరమం బ్రహ్మ ఇతి వేదాంత డిండిమః**

అన్నారు శంకరాచార్యులవారు వేదాంత డిండిమంలో. ఆ పీఠం పార్వతీదేవి. ఇలా గోడగా ఉన్న చిన్మయం పరమశివస్వరూపం. అలాగని కుంకుమార్చన పీఠానికి చెయ్యడానికి కుదరదు. పక్కన అమ్మవారుండాలి. ఎప్పుడు చేసినా ప్రకృతిని కానీ, పురుషుణ్ణి కానీ విడదీసి పూజ లేదు. ఇద్దర్నీ కలిపే చెయ్యాలి. **సీతారామాభ్యాం నమః శచీపురందరాభ్యాం నమః, అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః**- దంపతులుగా పిలుస్తాం తప్ప ఒక్కరినీ పిలిచి పూజ లేదు సనాతన ధర్మంలో.

అందుకే విభూతి పెట్టుకుంటారు. విభూతి అంటే భస్మం. మహదైశ్వర్యం. ఎందుకని? శాశ్వతత్వమే పరమేశ్వరుడు. అన్నీ లోకంలో వెళ్ళిపోతాయి. **జాయతే గత్యతే ఇతి జగత్**. ప్రతీ దానికి పుట్టిన తేదీ ఉంటుంది. ప్రతీ దానికీ పుట్టిన తేదీ ఉంది కాబట్టి మరణపు తేదీ ఉంటుంది. అది వెళ్ళిపోతుంది, లోకంలో ఉండదు. కానీ అన్నీ వెళ్ళిపోతున్నా, వెళ్ళిపోనిది ఒక్కటుంది. అది వచ్చి వెళ్ళిపోయేవాటికి ఆధారమై వుంది. సినిమా హాల్లో సినిమాలెన్నో మారిపోతాయి తెర మాత్రం అదొక్కటే ఉంటుంది. అసలు సినిమా హాలు మొత్తం మీద సత్యమేదైనా ఉంటే అదొక్కటే. మాయ వచ్చి పోయే బొమ్మలు. ఆ తెర పరమేశ్వరుడు. ఆయన శాశ్వతుడు, ఆయన నిరంజనుడు, నిత్యుడు, ఆయన ఒకరోజు ఉండి, ఒక రోజు వెళ్ళిపోయేవాడు కాదు. అటువంటి పరమేశ్వరతత్త్వం శాశ్వతత్వంచేత ప్రతిపాదించబడుతుంది. ఈ వచ్చిపోయే సమస్తప్రాణులు బూడిగా మారిపోతాయి. అన్ని ప్రాణులూ చిట్టచివరికి బూడిదైపోతాయి. బూడిదేమైపోతుంది? బూడిదింకేమవదు. బూడిద

బూడిదగానే ఉండిపోతుంది. అందుకే శివుడు తెల్లగా ఉంటాడు. ఆయన వాహనం తెల్లగా ఉంటుంది. ఆయన ఉండే కొండ తెల్లగా ఉంటుంది. ఆయన కట్టే బట్ట తెల్లగా ఉంటుంది. ఆయన పెట్టుకునే విభూతి తెల్లగా ఉంటుంది. ఆ తెలుపు లక్షణమేమంటే శాశ్వతత్వం.

తెలుపు రంగు కాదు. నలుపు రంగు కాదు. అన్ని రంగుల్నీ బయటికి వదిలితే తెలుపు. అన్ని రంగుల్నీ పుచ్చుకుంటే నలుపు. శాశ్వతత్వానికి ప్రతీకలు శివకేశవులు. అందుకే నలుపు విష్ణువు, తెలుపు పరమశివుడు. తెల్లని బూది ఇంకేం కాదు అలాగే ఉంటుంది. అలాగే నల్లటి బొగ్గు. బొగ్గు అంటే కొంచెం సైన్స్ చదువుకున్న వాళ్ళకి తెలుస్తుంది. బొగ్గు వజ్రపు వికారం. అందుకే బొగ్గుని బ్లాక్‌కోల్, బ్లాక్ డైమండ్ అని పిలుస్తారు. నల్ల వజ్రమని. అది వజ్రస్వరూపం. **వజ్రం వజ్రేన భిన్నయేత్** –వజ్రం పగలదు. వజ్రం చేతనే వజ్రం పగులుతుంది. అందుకని వజ్రం నశించిపోయేది కాదు. నశించని వాళ్ళు అని చెప్పడానికి ఒకళ్ళు నల్లగా, ఒకళ్ళు తెల్లగా ఉంటారు. అంతేకానీ నిజంగా ఆయన నల్లగా, ఈయన తెల్లగా ఉంటారు. నల్లగా ఉంటే నాకిష్టముండదండీ నేను విష్ణుపూజ చెయ్యను, తెల్లగా ఉంటే నాకిష్టం ఉండదండీ శివపూజ చెయ్యనంటే, వాడి జన్మాంతరంలో వాడికి వేదాంతం అర్థం కాలేదని గుర్తు. ఆ రంగుల ప్రతీక ఏమిటంటే వేదాంతతత్త్వాన్ని ప్రతిపాదన చెయ్యడం. ఆ రెండూ శాశ్వతమైన స్వరూపాలు. అంటే రెండుగా కనబడుతున్న ఒకటి. నిజానికవి రెండు కావు. రెండుగా కనబడుతోంది.

నేను ఆఫీసుకు వెళితే ప్యాంటు, షర్టు వేసుకుంటాను. ప్యాంటు, షర్టు వేసుకున్న కోటేశ్వరరావుగారు పంచె లాల్చీ కోటేశ్వరరావుగారు కాదండీ, ఈయనకి తెలియదు శాస్త్రం అని మీరనకూడదు. ఆయనే ఈయన. తత్ త్వం అసి అది ఇదియై ఉంది. ధారణ మారిందంటే పైనున్న వస్త్రధారణ మారింది. అలా అదే పదార్థం స్థితికారకత్వంతో నల్లగా ఉంటుంది. అదే పదార్థం శాశ్వతుడుగా, నిత్యుడుగా, నిరంజనుడుగా, జ్ఞానప్రదాతగా, **జ్ఞానదాతా మహేశ్వరః** తెల్లగా ఉంటాడు. ఆ పరమేశ్వరతత్త్వాన్ని చెప్తుంది భస్మం. అందుకే భస్మాన్ని ఎడమచేతిలో వేసుకుని స్నానం చెయ్యకుండా ఎక్కడికైనా బయటికెళుతున్నారని గుర్తేమిటంటే పొడి భస్మం పెట్టుకుని వెళ్ళాలి. అసలు భస్మం పెట్టుకోకుండా

బయటికి వెళ్ళకూడదు. పొడి భస్మం పెట్టుకుని బయటికి వచ్చాడంటే ఆయన స్నానం చెయ్యలేదని గుర్తు.

సజలభస్మం అంటారు. అంటే నీళ్ళు పోసి తడిపి ఎడమచేతి మీద కుడిచెయ్యి వేసి, కొన్ని మంత్రాలుంటాయి. **శ్రీకరం చ పవిత్రం చ** ఆ మంత్రం కానీ, కొంతమంది **ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం** అని కానీ, లేకపోతే **భూతిం భూతకరీ పవిత్ర జననీ పాపౌఘ విధ్వంసినీ సర్వోపద్రవ వారిణీ** అన్న శ్లోకాన్ని కానీ చదివి దాన్ని ఇలా మూడు వేళ్ళతో రాసి ఈ బొటనవేలితో రాసి, ఈ రెండు వేళ్ళూ ఎడమ కణత దగ్గరికి, కణతవైపు వెళ్ళకూడదు, కణత దగ్గరే రెండు వేళ్ళూ పెట్టి ఇలా విభూతిని తీసుకొచ్చి ఈ రెండు వేళ్ళూ ఇక్కడుండగా తడి విభూతితో ఉన్న బొటన వేలు ఇలా అన్చి ఈ రెండు వేళ్ళూ పైకెత్తి ఇది ఇలా రావాలి. అది విభూతి ధారణం. స్కాందంలో విభూతి ధారణం గురించి ప్రత్యేకమైన అధ్యాయం. అలా పెట్టుకున్న విభూతిచేత ఏమౌతుందంటే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరస్వరూపాలు లలాటంలో ఆవాహనమవుతాయి. భస్మం అది శివస్వరూపం. కదలికలన్నీ అమ్మవారు. అమ్మవారి కదలికలన్నీ అయ్యవారిలో చేరిపోవడానికి పనికిరావాలి తప్ప ఆ కదలిక లేకపోతే శక్తి కాదు.

ఇప్పుడు శక్తి అంటే కదలిక. కదలలేదనుకోండి శక్తి లేదని గుర్తు. ఏమండీ ఈ మధ్య మీరు రావట్లేదేం గుడికి అన్నారనుకోండి. ప్చ్, ఏం రానండీ, మోకాళ్ళ నొప్పులొచ్చేశాయి. ఏం కదలలేకపోతున్నాడంటాడు. అంటే శక్తి క్షీణించిపోతే కదలడు. శక్తి ఉంటే కదులుతాడు. అమ్మవారు ఉంది. కదులుతాడు. పూజలో కదలాలి. కదిలి, కదిలి, కదిలి ఎక్కడికెళ్ళాలి? కదలిక లేకుండా శివునియందు స్థిరపడిపోవాలి. ఈ కదలికలన్నీ శివుడి వైపు కదులుతున్నాయి. అమ్మా నా మనసుని అలా కదుపు అని అడగడమే. అందుకే **ఓంకార పంజర సుఖీం ఉపనిషద్యాన కేలి కలకంఠీం** అన్న శ్లోకం కానీ, **సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థసాధకే** అన్న శ్లోకంతో కానీ, ఆ కుంకుమని తీసి ఆజ్ఞాచక్రం మీద పెడతారు. కన్నులు మూసుకుని ఆజ్ఞాచక్రం మీద పెట్టుకుంటే మనసు భగవంతుని వైపు, కదలడం మొదలుపెడుతుంది. అది భస్మం. అందుకని విభూతిధారణ చేసి బొట్టు పెట్టుకుని పూజకి ఉపక్రమించాలి తప్ప అసలు లలాటాన్ని ఆచ్ఛాదించకుండా ఉండడానికి వీలులేదు. కాదు. అసలు వీడు సనాతనధర్మం మీద ఉన్నాడనడానికి గుర్తేమిటంటే

బొట్టు పెట్టుకుని ఉండాలి. బొట్టు లేదనుకోండి, ఆయన ఎన్ని ఉపన్యాసాలు విన్నాడన్నది కాదు, ఆయన బొట్టు పెట్టుకున్నాడా అన్న దానివల్ల ఆయనకు అభ్యున్నతి. బొట్టు ఎందుకు పెట్టుకోవాలీ అంటే ఆడవాళ్ళూ పెట్టుకోవాలి, మగవాళ్ళూ పెట్టుకోవాలి. ఆడవారు పెట్టుకుంటే సువాసినీత్వం. ఆమె సభర్తృక. భర్త జీవించి ఉన్నాడని గుర్తు. భర్త జీవించి ఉన్న ఆడది ఇక్కడ బొట్టు పెట్టుకోవడమే కాదు, ఎప్పుడూ బొట్టు మరుగున పడకూడని ప్రదేశం ఒకటుంది. ఇక్కడి బొట్టు మరుగున పడకూడదు. అందుకే ఇక్కడ సిందూరం పెట్టుకుంటారు. సిందూరం తొందరగా మరుగున పడదు. ఇది లక్ష్మీస్థానం సువాసినికి. ఆమెని లక్ష్మిగా తీసుకొచ్చి పెళ్ళిపీటల మీద కూర్చోపెడతారందుకే. వరుడు నడిచొస్తాడు వేదికమీదకి. ఆడపిల్ల రాదు. ఆడపిల్లని బుట్టలో కూర్చోబెట్టి మేనమామలు తీసుకొస్తారు. ఎందుచేతా అంటే ఆమె లక్ష్మి. మేం పద్మంలో తీసుకొస్తున్నాం. ఈమె నీకు లక్ష్మి. ఈమే నీ ఇంటి సౌభాగ్యదేవత. అందుకే ఒకప్పుడు దేవేంద్రుడు, దేవతలు వైకుంఠానికెళ్ళారు. వెళితే లక్ష్మీదేవి ప్రసన్నురాలై తన విశేషాన్ని వాళ్ళకి అవగతమయ్యేటట్లుగా అనుగ్రహించింది. అప్పుడామె కనబడింది.

**కైలాసే పార్వత్వం చ క్షీరోదే సింధుకన్యకా స్వర్గే చ స్వర్గలక్ష్మీశ్చమర్త్యలక్ష్మ్యశ్చ భూతలే వైకుంఠే చ మహాలక్ష్మీ ర్దేవదేవీ సరస్వతీ గంగా చ తులసీత్వం చ సావిత్రీ బ్రహ్మలోకగా కృష్ణ ప్రాణధి దేవీత్వం గోలోకే రాధికా స్వయం రాశే రాశీస్వదేత్వం చ బృందా బృందావనే–**

అని ఆమే ఎన్ని చోట్ల ఎన్ని రూపాలతో ఉందో కనబడి, చిట్టచివరికి ఆ లక్ష్మియే గృహలక్ష్మి గృహే గృహే. ప్రతి ఇంట్లో ఉన్న ఇల్లాలూ ఆయనకు లక్ష్మి. నా భార్య నాకు లక్ష్మి. అందుకే ఆ ఇంటి ఐశ్వర్యమంతా ఎవరిదో తెలుసా? యజమానిది కాదు ఆమెదే. ఆమే లక్ష్మి. ఆమే లక్ష్మి అయినప్పుడు ఆ ఇంట్లో ఉన్నదంతా ఎవరిది? ఆవిడది. ఇల్లాలు. అందుకే యజమాని అన్నం ఎవరిదగ్గర తింటాడో తెలుసా? ఆమె దగ్గర తింటాడు. ఆమె లక్ష్మి కాబట్టి ఆమె అన్నం పెడుతుంది. లక్ష్మియై ఆమె ఆయనకి గాజులు గల గలలాడుతున్న చేతితో అన్నం పెడుతుంది. అందుకని ఆ చేతిని అలంకృతం చేస్తారు గాజులతోటి, లక్ష్మీస్వరూపిణి కనుక. అటువంటి భార్య లక్ష్మీస్వరూపిణియై ఎడమ పక్కనుంటుంది.

ఆ తల్లి ఎప్పుడూ కూడా కదలికలను సూచిస్తూ ఆమె మళ్ళీ భగవంతుణ్ణి చేరిపోవడానికి వీలుగా మన కదలికలను కదుపుతుంది. అందుకని ఆజ్ఞాచక్రం మీద అమ్మవారి శ్లోకంతో కుంకుమ పెట్టుకుంటారు. బొట్టు పెట్టుకున్నానంటే గుర్తేమిటో తెలుసా? నేను పునర్జన్మసిద్ధాంతాన్ని అంగీకరించానూ అని. సనాతనధర్మంలో వెన్నుపూస ఏది? వెన్నుపామేది? అని అడిగారనుకోండి, పునర్జన్మ సిద్ధాంతమే వెన్నుపాము. పునర్జన్మసిద్ధాంతాన్ని నేను ఒప్పుకోను అన్నారనుకోండి, బొట్టు పెట్టుకోరు. పునర్జన్మసిద్ధాంతాన్ని అంగీకరిస్తున్నాను అన్నారనుకోండి, బొట్టు పెట్టుకుంటారు. పునర్జన్మ ఉన్నదీ అంటే ఇప్పుడు నువ్వు ఏవి చేస్తున్నావో అవి జీవుడు అనుభవించి తీరాలి. ఇవ్వాళంటే ఈ శరీరంలో ఉన్నావు, ఏదో బాడుగకు వచ్చింది. దీన్ని విడిచి ఇంకొక దాంట్లోకి వెళతావు. అక్కడ అనుభవించాలి కష్టసుఖాలు. ఇక్కడ చేసెయ్యగానే పోదు. దీన్ని అనుభవించాలి మళ్ళీ. కాబట్టి అనుభవించాలనేటప్పటికి క్రమశిక్షణలోకి వస్తారు. మనసుని నిగ్రహిస్తాడు. మనసు చంచలంగా పరిగెత్తడానికి అవకాశమివ్వడు. అందుకే పునర్జన్మసిద్ధాంతాన్ని నేను అంగీకరిస్తున్నానని గుర్తేమిటంటే బొట్టు పెట్టుకుని ఉంటారు. బొట్టు పెట్టుకుని పూజ ప్రారంభం చెయ్యాలి. ఆ పూజ ప్రారంభం చేసే సమయంలో భగవంతుని స్మరణల కొరకు పరివేదన చెందుతారు. అసలు నేను నిన్న నిద్రలేచిన దగ్గరినుంచి మనసుని భగవదభిముఖం చెయ్యడానికి కావలసిన ఆ వ్యవహారాన్నంతటినీ ప్రతిపాదించడానికి కారణమేమిటంటే, బ్రహ్మముహూర్తం తనంతతానుగా పూజకి యోగ్యమైన కాలం. అది భగవంతుని పరిపూర్ణానుగ్రహానికి కారణమవుతుంది. ఆ కాలంలో మనసు ఒక్క భగవంతునియందే నిలబడాలి. భగవంతునియందే నిలబడాలంటే నిద్ర లేవడమన్న మొదటి కదలిక నుంచి భగవంతునితో ముడిపడి కదలాలి. అందుకని అంత జాగ్రత్తగా చెప్పింది వేదం. ఇలా నువ్వు ప్రవర్తించవలసి ఉంటుంది సుమా, లేకపోతే గాడి తప్పిపోతావు, జీవనశైలి దెబ్బతింటుంది. ఈశ్వరుడి నుండి దూరమైపోతావు. దూరమైపోయిన తరువాత కొన్ని కోట్ల జన్మలు పునర్జన్మలలోకి వెళ్ళిపోయిన తరువాత, అప్పుడు తెలుస్తుంది ఇబ్బందేమిటో. కాబట్టి అలా చెయ్యవద్దని హెచ్చరిక చేస్తుంది. కాబట్టి చూడండి ఆ భగవంతుణ్ణి స్మరించకే జీవుడు దెబ్బతింటాడు. ఎన్ని జన్మలో ఎత్తి ఎంత కష్టపడతాడో, అసలు మనుష్యశరీరంలోకి వచ్చేముందు పడే కష్టమెలా

ఉంటుందో నేను చెప్పడం మొదలుపెట్టాననుకోండి. కొంత భాగాన్ని వదిలిపెట్టేసి ఒక్క భాగం దగ్గర తీసుకుంటాను.

గర్భస్థ మవుతాడు. అమ్మ కడుపులో ప్రవేశిస్తాడు. ప్రవేశించి పెరుగుతూ ఉంటాడు. చీకటి, కపిలగీతలో చెప్తారు తల కిందకుంటుంది, కాళ్ళు పైకి ఉంటాయి, తిరగబడి ఉంటాడు. నాభి గొట్టంలో నుంచి అమ్మ తిన్న పదార్థం లోపలికెళుతూ ఉంటుంది. అమ్మ వేడిచేసేది, వాతం చేసేది జిహ్వకి నచ్చేది తిన్నదనుకోండి, వాడికెళుతుంది. పడిశం పట్టేసి తల కిందకి ఉంటుంది, పట్టి అది చీదడానికుండదు. చేతులు ఇలా కదిలి ముక్కు దగ్గరికి రావు. కారిపోతూ ఉంటుంది. ఊపిరి అందదు లోపల. కదలడానికి చోటుండదు. ఎంత కొట్టుకుంటాడో. మలమూత్రాలు విసర్జిస్తాడు. అందులోంచి క్రిములు పుట్టేస్తాయి. పుట్టేసి కోమలమైన శరీరాన్ని కొరికేస్తాయి. కొరికేస్తూ ఉంటే ఆ బాధ తట్టుకోలేడు. గోక్కుందామంటే కూడా చెయ్యి వెళ్ళదు. శరీరమా రోజురోజుకీ పెద్దదవుతూ ఉంటుంది. కటికచీకటి. ఒళ్ళు తిమ్మిర్లెక్కిపోతూ ఉంటుంది. అందుకే గర్భస్థం నరకం. గర్భస్థనరకాన్ని అనుభవించారంటారు.

అప్పుడు పరమేశ్వరుడు పూర్వజన్మస్మృతి నిస్తాడు. ఆ లోపలుండగా స్మృతిని పొందుతాడు. ఎన్ని జన్మలెత్తాను, ఏదీ ఎప్పుడారాధించాను నా స్వామిని, ఇలా అయిపోయాను, ఎన్ని మాట్లు పుట్టానో, ఎన్ని మాట్లు శరీరాన్ని విడిచి పెట్టానో మళ్ళీ శరీరం విడిచిపెట్టడం ఇంకో ఖేదం. లక్ష తేళ్ళు కరిచినంత బాధ కలిగి స్పృహ తప్పుతాడంటారు. అంత బాధ. ఈ మధ్యలో ఉన్న ఓపికా భోగాలకి ఖర్చు పెట్టేశాను అని వెంపర్లాడి పరమేశ్వరుణ్ణి ప్రార్థన చేస్తాడు.

**నవమాసంబులు తల్లి గర్భమున నానా రోతలన్‌జిక్కి నా**
**కవకాశం బిసుమంత లేక పడితిన్ హా! కష్టముల్ భీతితో,**
**నవమాసంబు ఘటిల్లె జాలునిక నాకా గర్భవాసంబునన్**
**నివసింపన్ బనితీర్చి కావుమిక నన్ నీ సత్కృపన్ శంకరా!**

అని అడుగుతాడు. ఈశ్వరా, తొమ్మిది నెలలు ఇందులో పడున్నాను. తొమ్మిది నెలల తరువాత ఈ శరీరంతో బయటికి వెళ్ళి ఇక నిన్ను పట్టుకోవాలని కోరికగా ఉంది. ఎలా వెడతాను బయటికి? ఎలా? ఎక్కడ్నుంచి బయటికెళ్ళాలి?

ఏం తెలుసు? ఈశ్వరా, నన్ను బయటికి తోసెయ్యవా అని అడుగుతాడు. ప్రసూతి వాయువై చాలా జాగ్రత్తగా, క్రమక్రమంగా, అమ్మ శరీరం విడిచిపెట్టని రీతిలో, అమ్మ యోని ద్వారంలోంచి అతికష్టం మీద బయటికొస్తాడు. వస్తూనే అంత చీకట్లోంచి అంత వెలుతురులోకి వస్తాడు. ఏ ఆపరేషన్ థియేటరో, ఎన్ని లైట్లో, ఎంతెంత పెద్ద పెద్ద మనుష్యులో. ఏమీ తెలియదు. ఎంత భయపడిపోతాడో, తొండపిల్లంత ఉంటాడు. ఏవేవో చప్పుళ్ళు. ఏమీ తెలియక స్పర్శ అలవాటై తల్లి కడుపునకు దగ్గరగా వెళ్ళి పడుకుంటాడు. ఆ పసితనం.

**మలమూత్రంబులతో మహాభయముతో మాతృస్తనాపేక్షతో**
**చలమూర్ఖత్వముతో, సదా భ్రమతతో చాంచల్యచిత్తంబుతో**
**బలువైనట్టి కఫ జ్వర గ్రహ మహా బాల్యామయ శ్రేణితో**
**కలనైనన్ తమ చింత లేక చెడితిన్ కామ్యార్థినై శంకరా!**

అక్కడే మలం విసర్జిస్తాడు, అక్కడే మూత్రం విసర్జిస్తాడు, అక్కడే పాలు తాగేస్తాడు, ఆ పాలు ఎక్కువైపోయి, ధార ఇలా వెళ్ళి చెవిలోకి వెళ్ళిపోతుంది. అమ్మ వస్తుంది, ఆ మూతి తుడిచి పడుకోబెడుతుంది. చెవులో కెళ్ళిన పాలధారను పట్టుకుని చీమ లోపలికెళ్ళి కొరికేస్తుంటుంది. గగ్గోలు పెట్టి ఏడుస్తాడు. అమ్మొస్తుంది. వీడికి ఆకలేస్తుందిలా ఉందని ఇంకా పాలిచ్చేస్తూ ఉంటుంది. చెప్పడం రాదు. అమ్మా, చెవిలో చీమ కొరుకుతోందని చెప్పలేడు. ఎంత బాధపడిపోతాడో. చెవిపోటొస్తే చెప్పలేడు, పడిశం పడితే చెప్పలేడు, కడుపునొప్పి చెప్పలేడు, ఎన్ని బాధలో! ఈశ్వరా, అయిపోయింది బాల్యం. ఇక కొంచెం పెద్దవాడినయ్యాను.

**బాల క్రీడల నల్పుచున్ బదులలో బాఠంబు వల్లింపుచున్**
**భాలోధ్యానక బోధనా విధములన్ బాగొప్ప నాలించుచున్**
**లీలా నాటక వృత్త గీత పఠనన్ వీనుండనై బుచ్చితిన్**
**బాలప్రాయము నీదు చింత నెఱుగన్ ప్రారబ్ధమా శంకరా!**

పిల్లలతో ఆడుకోవడం, పెద్ద పెద్ద పుస్తకాల బ్యాగులు, హోంవర్కులు, చెప్పింది వింటూ ఉండడం, పాటలు, ఆటలు, నాట్యాలు, నృత్యాలు అయిపోయాయి. మంచి ఓపికొచ్చింది, చదువుకున్నాడు, కాస్త ఒంట్లో శక్తి ఉంది. యవ్వనం వచ్చింది, పోనీ ఇప్పుడేమైనా ఈశ్వరుడ్ని సేవిస్తాడేమిటి?.

**యౌవన మంకురించగనె యస్యులనెట్టుల నాశ్రయించుటో**
**పావనమూర్తులంచు పరిపాలకుల స్నుతియించు టెట్టులో**
**జీవికి విత్తమే భువిని జీవనమంచు నదెట్లు గూర్చుటో**
**యేవిధ మేది దారియని యెంచుచు బుచ్చితినయ్య శంకరా!**

ఇంక ఆ వయస్సు వచ్చి ఒంట్లో ఓపిక ఉన్న దగ్గరి నుంచి నాలుగు రూపాయలు ఇప్పుడే కదండీ సంపాదించుకోవాలి. రేపు పొద్దున పిల్లలకుంచాలి కదూ, ఇల్లు కొనుక్కోవాలి కదూ. ఎన్ని ఆలోచనలో. పరమేశ్వరుడి దగ్గరికెళ్ళి ఒక్కనాడు శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం విశ్వాధారం గగనసదృశం అనడు. కానీ పరిపాలకులన్ పరమపావనమూర్తులంచు పరిపాలకులన్నుతియించుటెట్టులో అని అంత వాడివి, ఇంత వాడివని కవిత్వం చెప్పమంటే ఎక్కడలేని కవిత్వమూ వస్తుంది. అధికారులని పొగుడుతాడు. అయిపోయింది. ఉంటుందా కాలం? వచ్చేసింది వార్ధక్యం.

**వార్ధక్యంబున మోహమూర్ఖతలచే వాతాది రోగాలచే**
**వ్యర్థంబై చెడు వాక్ప్రవాహములచే వాత్సల్యచిత్తంబుచే**
**యర్థధ్యానముచే మహాభ్రమతిచే హాస్య ప్రసంగాలచే**
**స్వార్థంబే పరమార్థమై చెడుదురీ స్వార్థంబుచే శంకరా!**

ఏవో హాస్యప్రసంగాలు, నేను సర్వీసులో ఉన్నపుడండీ అంటారు. ఎవరడిగారు నిన్ను? అక్కర్లేనివన్నీ మాట్లాడతారు. సీనియర్ సిటిజన్‌కు వన్ పర్సంట్, హాఫ్ పర్సంట్ ఇంట్రస్ట్ ఎక్కడెక్కువ? అదే తాపత్రయం. ఇక్కడ డిపాజిట్ క్యాన్సిల్ చెయ్యను, అక్కడ చెయ్యను. అయిపోయింది. ఆఖరికి వెళ్ళిపోయే సమయం ఆసన్నమైంది. లోపల్నుంచి జీవుడు లేచిపోతాడు. ఆ వెళ్ళిపోయేటప్పుడు **జీవుడతి కంపిత చిత్తత నేగుచునుండ ఓ నాయనయంచు ఏడ్చు నిజనందన నందినులైన కాని కనుదోయిని బాష్పముల్ తొలుత దుఃఖ మహాంబుధిచొచ్చు పత్నియున్ కాయము వీడి రారు కదా!** చేసిన కర్మము, పుణ్యము తప్ప శంకరా. ఆఖరికి శరీరం విడిచిపెట్టి జీవుడు వెళ్ళిపోతుంటే వచ్చే వాడెవడు? ఎవ్వడూ రాదు.

**కిం వానేన ధనేన వాజి కరిభిః ప్రాప్తేన రాజ్యేన కిం।**
**వా పుత్ర కళత్ర మిత్ర పశుభిర్దేహేన గేహేన కిమ్॥**

**జ్ఞాత్వైతత్ క్షణ భంగురం సపది రేత్యాజ్యం మనోదూరతః।**
**స్వాత్మార్థం గురువాక్యతో భజ భజ శ్రీపార్వతీవల్లభమ్॥**

అంటారు శంకర భగవత్పాదులు.

కొనుక్కున్న కారు కర్రలు తీసుకురావడానికి వెళ్ళొస్తుంది. దానికేం బాధా ఏమి? బ్యాంకులో వేసిన అక్షరాలు అలాగే ఉంటాయి పాసుబుక్కులో, భార్య గుమ్మం వరకు, కొడుకు శ్మశానం వరకు. పైన కప్పిన బట్ట మేట చాకలి పాలు. ఇంకొకటి నేనెందుకనాల్లెండి. కాబట్టి రకరకాలుగా వెళ్ళిపోతాయి. ఏముంది పట్టుకెళ్ళేది? ఏమీ లేదు. చేసిన పాపం, పుణ్యం మూట కట్టుకుని బయలుదేరుతాడు. కాబట్టి ఈశ్వరా, ఏది నీ స్మరణెక్కడుంది? లేదు.

కుంతీదేవి ఏడ్చింది భాగవతంలో అందుకే.

**శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగార రత్నాకరా**
**లోక ద్రోహి నరేంద్ర వంశ దహనా లోకేశ్వరా దేవతా**
**నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా నిర్వాణ సంధాయకా**
**నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!**

**యాదవులందు, పాండవులందు నధీశ్వర నాకు మోహవి**
**చ్ఛేదము చేయుమయ్య ఘన సింధువు చేరెడి గంగ భంగి నీ**
**పాద సరోజ చింతనముపై ననిశంబు మదీయ బుద్ధిన**
**త్యాదర వృత్తితో గదియునట్లుగ చేయగదయ్య యీశ్వరా!**

అని అడిగింది.

మనసు భగవంతుణ్ణి స్మరించడానికి అలవాటు పడి ఉండాలీ అని, ఆ స్మరణ నాకు రావాలి, ఆ భక్తి కుదరాలని భస్మధారణం చేసి తిలకధారణం చేస్తారు. చేసి పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరించాను కనుక భగవంతుడు చెప్పినట్లు బ్రతకాలని కోరుకుని చీకటి విడవకముందే అర్ఘ్యప్రదానం చేస్తూ సంధ్యావందనం చెయ్యాలి. సంధ్యావందనం చెయ్యడానికి ఆచమనం చెయ్యాలి. ఆచమనం నేను మీతో చెప్పాను అనుత్తరీయశ్చ-ఉత్తరీయం లేకుండా ఆచమనం చెయ్యకూడదు. కాబట్టి ఆ ఆచమనం చేసేటప్పుడు అమృతమార్గమూ అంటారు. వేళ్ళు ఇలా

పెట్టి తీసుకోవాలి. తీసుకున్నప్పుడు ఇక్కడ కింది పెదవి తగలాలి. ఎక్కడ పడితే అక్కడ పెదవి పట్టి జుర్రకూడదు. ఎక్కడా చప్పుడు రాకూడదు. ఆచమనం చేసినా, ఆచమనం ఆపినా మధ్యలో ఎక్కడా శబ్దం ఉండకూడదు. చేసినా, చెయ్యకపోయినా ఒకలాగే ఉండాలి. అంటే కొత్త శబ్దం ఉండకూడదు. అంత నిశ్శబ్దంగా ఉండాలి ఆచమనం చేస్తే. కింది పెదవి ఒకటే తగలాలి తప్ప పై పెదవి తగలకూడదు. అమృతమార్గమంటే అరిచేతికి చిట్టచివర కింది పెదవిని తాకించి పైకెత్తి పుచ్చుకోవాలి. పుచ్చుకున్నప్పుడు మూడుమార్లు పుచ్చుకోవాలి. ఎక్కువ నీరు పుచ్చుకోకూడదు. మినపగింజ మునిగినంత నీరు మాత్రమే పుచ్చుకోవాలి లోపలికి. గుటక లోపలికి వెళ్ళిపోతే తప్ప రెండోసారి ఆచమనం చెయ్యకూడదు. గుటక దిగిపోవాలి. **ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా**– ఈ మూడు నామాలతో చేస్తారు.

గమ్మత్తేమిటంటే అసలు ఏ పదహారు నామాలను మనం పూజ ప్రారంభంలో స్మరిస్తామో అందులో రామనామం ఉండదు. అదీ గమ్మత్తు. ఏమి రామనామం అంత గొప్పది కదా, తారకం అని చెప్తాం కదా, రామనామంతో ఎందుకు చెయ్యకూడదు ఆచమనం? **ఓం రామాయ స్వాహా** అని పుచ్చుకోకూడదా? పుచ్చుకోకూడదు. రామనామం చాలా గొప్పదే, తారకమే. కానీ ఆ మూడు నామాలతోటే చెయ్యాలి ఆచమనం. ఎందుకు చెప్పారంటే విష్ణుసహస్రనామంలో శ్రీమహావిష్ణువుకి ఎన్నో నామాలున్నాయి. ఎన్ని నామాలున్నా, ఏ నామాన్నీ ఆచమనానికి వాడరు. ఈ మూడు నామాలే వాడతారు. కారణమేమిటో తెలుసా? మనిషికి పరమేశ్వరుడు ఒక అపురూపమైన పరికరాన్ని ఇచ్చి పంపించాడు. ఆ పరికరాన్ని సద్వినియోగం చేసుకున్నవాడు పరమేశ్వరుణ్ణి చేరతాడు. అదే స్వరపేటిక, కంఠంలో పెట్టాడు. ఆ స్వరపేటిక అరిగిపోకూడదు. ఆ స్వరపేటిక సక్రమంగా ఉందనుకోండి, మాట్లాడతాడు. **మాటలచేత దేవతలు మన్ననచేసి వరంబులిత్తురున్, జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీ, జిహ్వాగ్రే మిత్ర బాంధవాః జిహ్వాగ్రే బంధనం ప్రాప్తి జిహ్వాగ్రే మరణం ధ్రువం.** భగవన్నామం చెప్పి తరించిపోతాడు.

మిగిలిన ప్రాణులకు ఆ అధికారం లేదు. రామ అనమంటే ఎనభై నాలుగు లక్షల జీవరాశులలో ఎనభై మూడు లక్షల తొంభై తొమ్మిదివేల తొమ్మిది వందల

తొంభై తొమ్మిది జీవులు అనలేవు. రామా అని నేర్పగా, నేర్పగా అంటుంది కాబట్టి చిలుక రామచిలుకయ్యింది. రామ శబ్దం చెప్తే మనం శ్రీరామ, శ్రీరామ, శ్రీరామ అనగలం. రామా అన్న మాట అన్నంతమాత్రంచేత పాపరాశి ధ్వంసమవుతుంది. మాట్లాడగలగడం ఒక ఎత్తు అయితే, ఏది మాట్లాడాలో అది మాట్లాడగలగడం జీవితంలో గొప్ప అదృష్టం. పనికిమాలిన మాటలు మాట్లాడడానికి ఉపయోగించినంతగా తనని తాను తరింపచేసుకోవడానికి పనికివచ్చే మాటలను మాట్లాడడానికి జీవి ఇష్టపడదు. ఎందుచేత అంటే మనసు వ్యామోహాన్ని కోరుకుంటుంది. అది మంచి మాట, భగవత్సంబంధమైన పలుకు, భగవన్నామాన్ని పలుకుతూ ఉండడాన్ని ఇష్టపడదు. అందుకే స్వరపేటిక ఉంది కదా అని, మాట ఉంది కదా అని భగవన్నామం నేను పలుకుతానంటారేమో, అదంత సాధ్యమయ్యే విషయం కాదయ్యా భగవన్నామం పలకడానికి భగవదనుగ్రహం ఉండాలి. ఎవరు భగవంతుని అనుగ్రహానికి పాత్రుడయ్యాడో వాడే భగవన్నామాన్ని చెప్పగలడు. అందుకే పెద్దలైన వారెవ్వరూ నేను భగవన్నామం చెప్తానని చెప్పలేదు. భగవన్నామం నా చేత పలికించమని పరమేశ్వరుణ్ణి అడిగారు.

**హరునకు నవ్విభీషణున కద్రిజకుం దిరుమంత్ర రాజమై**
**కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తి హరించు చుట్టమై**
**పరగినయట్టి నీ పతితపావననామము జిహ్వపై నిరం**
**తరము నటింపజేయు మిక దాశరథీ! కరుణాపయోనిధీ!**

అని అడిగారు గోపరాజుగారు. అయ్యా, రామా, నీ నామాన్ని నా నాలుక మీద నర్తింపచేయవయ్యా అని అడిగారు. ధూర్జటి కాళహస్తీశ్వరశతకంలో కోరుకున్నాడు.

**పవి పుష్పంబగు నగ్ని మంచగు నకూపారంబు భూమీస్థలం**
**బవు శత్రుండతి మిత్రుడౌ విషము దివ్యాహారమౌ నెన్నగా**
**నవనీ మండలి లోపలన్ శివ శివేత్యా భాషణోల్లాసకిన్**
**శివ నీ నామము సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా.**

అని

భాగవతంలో పోతనగారు **బ్రహ్మహత్యానేక పాతపులకగ్ని కీలలు హరినామ కీర్తనముల్** అన్నారు. ఎంతెంత పెద్ద పాపాల్ని కాల్చేసే అగ్నిహోత్రం భగవన్నామం. ఆ భగవన్నామాన్ని పలికితే చాలు–

**కూలిన చోట కొట్టుబడి, కుందినచోట మహాజ్వరాదులం**
**వ్రేలిన చోట సర్పముఖపీడల నందినచోట నార్తులై**
**తూలినచోట విష్ణుభవదూరుని చేర్కొనిరేనిమీదన**
**క్కాలుని యాతనావితతి గానరు పూనరు దుఃఖభారముల్.**

అంటారు. తన్నుకుని పడిపోయినప్పుడు కూడా భగవన్నామం చెప్పగలగాలి. తలుపు సందులో వేలు పడిపోయినా అబ్బా అనకుండా రామా అనగలగాలి. జ్వరమొచ్చినప్పుడు కూడా భగవన్నామం పలకగలగాలంటే మనసుకి అంత తర్ఫీదును ఇవ్వాలి.

అప్పయ్య దీక్షితులవారని యజుర్వేదంలో పుట్టలేదని ఏడ్చాడాయన. మహానుభావుడు అంతటి శివభక్తితత్పరుడు. ఆయనకు విష్ణుభేదం లేదు. అంత గొప్ప శివభక్తుడు. ఆయన ఒకానొకప్పుడు తన శిష్యుల్ని పిలిచి ఒరేయి, నేను పిచ్చెక్కే మందొకటి తాగేస్తాను. దాని ప్రభావం ఒక గంటన్నరసేపుంటుంది. అప్పుడు నేను ఉన్మాదిగా ఉంటాను. నేను తెలివిలో జాగ్రత్తగా ఉన్నప్పుడు భగవన్నామం చెప్పడం గొప్ప కాదు, నేను ఉన్మత్తావస్థలో ఉన్నప్పుడు ఏది పేలుతున్నానో మీరు కిటికీల దగ్గర కూర్చుని రాయండి. గురువుగారి నోటివెంట వస్తోంది, తప్పుడు మాటలు మాట్లాడారని రాయడం మానకండి. నా మనసు దేన్ని పట్టుకుంటోందో చూడాలి. రాయండిరా అన్నారు. అంటే శిష్యులు రాశారు. గంటన్నరలో ఆయన పరమేశ్వరుడి మీద అద్భుతమైన స్తోత్రం చెప్పారు పిచ్చివాడై. ఉన్మత్తశతకం అని అద్భుతమైన స్తోత్రం చెప్పారు అప్పయ్య దీక్షితులవారు. పిచ్చెక్కిన స్థితిలో చెప్పారాయన. చంద్రశేఖర భారతీస్వామివారు చెప్తుండేవారలా. ఉన్మత్తావస్థలో శ్లోకాలు చెప్తే శిష్యులు రాసుకుంటుంటే మరునాడు శృంగగిరి పీఠంలో వింటుండేవారాయన. మనసుకు అంత తర్ఫీదు ఇవ్వాలి. పైన కూర్చున్న బుద్ధి, మనసుని తోక జాడించకుండా నిలబెట్టగలగాలి. నోర్మూయ్, ఈ శరీరం వదిలిపెడితే మళ్ళీ వస్తుందనుకుంటున్నావా? భగవన్నామం పలుకు,

భగవన్నామం కాసేపు చెప్పు భగవన్నామం అని ప్రయత్నపూర్వకంగా నామం చెప్పడానికి దానికి అలవాటు చెయ్యాలి.

భగవన్నామానికి ఒక లక్షణముంటుంది. అందుకే భజన సంప్రదాయం వచ్చింది. మీరు చూడండి జయ జయ శంకర, హర హర శంకర, కామాక్షి శంకర, కామకోటి శంకర, శృంగేరి శంకర, శారద శంకర, కాలడి శంకర, కైలాస శంకర అని భజన చేశారనుకోండి. ఒక గంట భజన చేసి మీరు ఇంటికెళ్ళిపోతూ ఉంటే జయ జయ శంకర, హర హర శంకర, కామాక్షి శంకర, కామకోటి శంకర అంటుంది నోరు. మీరు దానికి ఏది తర్ఫీదు ఇచ్చారో అది అంటుంది. దానికి ఆ లక్షణం ఉంది. తర్ఫీదు ఇవ్వకపోతే మనది తప్పు. బుద్ధిది తప్పు. తర్ఫీదు ఇవ్వాలి. ఇస్తే అదే పలుకుతుంది. అది పసిపిల్లాడి లాంటిది. దానికి మీరు ఏమీ ఇవ్వలేదనుకోండి, అది అగ్గిపుల్లా నోట్లో పెట్టుకుంటుంది, ప్లగ్ కన్నాల్లో వేళ్ళూ పెడుతుంది.

అమ్మ పసి పిల్లాడి ముందు ముచిక కోసేసి రెండు వంకాయలు పడేస్తుంది. వాడు వాటిని పట్టుకుంటాడు, పైకెత్తుతాడు, నోట్లో పెట్టుకుంటాడు, కొరుకుతాడు, పళ్ళుండవు, మింగలేడు, దానితో ఆడుకుంటాడు, దాన్నిండా చొంగ కార్చేస్తాడు, కింద పడేస్తాడు, ఆఖరికి వాడికి తెలుస్తుంది. అమ్మ నన్ను ఏమార్చేసిందని వాడు పసికడతాడు. ఆ రెండు వంకాయలూ అవతల పారేసి ఏడుపు మొదలెడతాడు. అమ్మ కనిపెడుతుంది వీడు కనిపెట్టేశాడురోయ్ అని, ఆ రెండు వంకాయలూ తీసుకెళ్ళి కడిగేసి అక్కడ పెట్టి, వాడిని ఎత్తుకుని ముద్దు పెట్టుకుని, మళ్ళీ వెంటనే నిన్న రాత్రి నాన్నగారు నెల్లూరులో ఉపన్యాసాలు అయిపోయిన తరువాత బయలుదేరి కాకినాడ వచ్చేసిన రెండు టికెట్లు పట్టుకెళ్ళి చేతిలో పెడుతుంది.

వాడు మళ్ళీ ఆ టికెట్లు అటు తిప్పుతాడు, ఇటు తిప్పుతాడు, నోట్లో పెట్టుకుంటాడు, ఉండ చుడతాడు, కాసేపు ఆడుకుంటాడు, చింపేస్తాడు. వాడికి మళ్ళీ గుర్తొచ్చింది అమ్మ నన్ను ఏమార్చిందిరోయ్ అని. మళ్ళీ ఏడుస్తాడు. మళ్ళీ వెడుతుంది. కాసేపు ఏ ప్లాస్టిక్ డబ్బాలాంటిదేదో అక్కడ పెడుతుంది. కాసేపు దానితో ఆడతాడు, ఆ మూతలతో ఆడతాడు మళ్ళీ ఏడుస్తాడు. పడుకోబెడుతుంది. అమ్మ ఏమార్చిందని తెలుసుకుని ఏడుస్తున్న పసిపిల్లాడిలాంటి మనసుకి భగవత్

సంబంధాన్ని మార్చి మార్చి ఇవ్వాలి బుద్ధి. ఇస్తే వాడు క్షేమంగా ఉంటాడు. ఏమీ ఇవ్వకపోతే వాడే ఎంచుకుంటాడు. వాడే చేస్తాడు. ఏదో ఒకటి చెయ్యాలి. ఏదో ఒకటి చెయ్యాలి కాబట్టి వాడు ఫినాయిల్ సీసా తీసి దాని మూత తీసుంటే దాన్ని నోట్లో పోసేసుకుంటాడు. మీరేమీ ఇవ్వలేదు, వాడు తాగేశాడు. మీరిచ్చారు, వాడు భద్రంగా ఉంటాడు. ఎక్కడైనా పసిపిల్లవాడు వృద్ధిలోకి వచ్చాడంటే అమ్మదే ఆ ఘనత. అలా వెయ్యి కళ్ళు పెట్టి చూసుకుంటుంటుంది. బుద్ధి మనసుని అలా చూసుకుంటుంది. పరమేశ్వరుడు స్వరపేటిక ఇచ్చాడు. ఆ కంఠం, ఆ వాణి, ఆ మాట అంత గొప్పవి. ఆ మాట చేతనే తరించిపోతాడు. ఇక మళ్ళీ పుట్టవలసిన అవసరాన్ని కూడా పోగొట్టుకుంటాడు.

ఆ స్వరపేటిక చాలా గొప్పది. రాత్రల్లా నిద్రపోతాం మనం. నిద్రపోయినప్పుడు దాన్ని కూడా పొర ఆవహిస్తుంది. ఆవహించి అది కూడా పొడారిపోతుంది. పొడారిపోయిన తరువాత దానితో పని చేయించకూడదు. పొడారిపోయిన స్వరపేటిక మీద మొట్టమొదట ఏది పడితే అది పడకూడదు. పడకుండా ఉండడానికి శాస్త్రంలో ఏం చేశారంటే భగవన్నామంతో ఆచమనం చేయించారు. ఏం కేశవా, నారాయణా, మాధవా ఈ మూడు నామాలే ఎందుకు చెప్పాలి? అంటే మీరు జాగ్రత్తగా గమనించండి. ఓం కేశవాయ స్వాహా అన్నాననుకోండి కే, కే అన్నపుడు నాలుక ఇలా వంగుతుంది. ఇలా వంగి ఏదో ఫ్లై ఓవర్‌లాగా, నాలుక పైకెత్తిన మధ్య భాగం వెళ్ళి అంగిటిని నొక్కుతుంది. అంగిటిని నొక్కితే తప్ప క కారం పలకదు. అంటే శబ్దాలు ఉత్పన్నమయ్యేటప్పుడు– ఒకలా ఉత్పన్నమయ్యే శబ్దాన్ని క కారంతో భగవన్నామంతో పలికిస్తారు మొట్టమొదట. అందుకని కేశవాయ స్వాహా, రెండవది నారాయణా స్వాహా అన్నప్పుడు నాలుక ఇలా ఉంది, ఇలా అవుతుంది డొప్పలా. ఇలా అయ్యి పైకెక్కి ఈ పైన ఉండే దంతపంక్తి వెనుక భాగాన్ని నొక్కుతుంది. నారాయణా స్వాహా, నారాయణా స్వాహా అన్నప్పుడు. అప్పుడు ఒక రకంగా నాలుక తగిలితే వచ్చే శబ్దాలను స్వరపేటిక పలుకుతుంది.**మాధవాయ స్వాహా,** రెండు పెదవులు కలుసుకుంటే వచ్చే శబ్దాన్ని ఉత్పన్నం చేస్తుంది. అక్షరాలు, శబ్దాలు ఎన్ని రకాలుగా వస్తాయో, నాలుక ఎలా వంగితే, పెదవులు ఎలా కలిస్తే, ఎటువంటి శబ్దాలు వస్తాయో అటువంటి వాటిని, ప్రధానమైనవి ఉత్తి

అక్షరాలు కాకుండా భగవన్నామాలుగా కూర్చి ఆ నామం చెప్పి, నీరు మినపగింజ మునిగినంత నీరు లోపలికి పుచ్చుకున్నారనుకోండి లూబ్రికేషన్ అంటారు.

సైకిల్ చైన్‌లో చిన్నది చుక్కా, చుక్కా పెట్టుకుంటూ ఇలా తిప్పుతాడు. చైనంతా తడుస్తుంది. అన్ని కన్నాల్లో చుక్కా, చుక్కా ఇంధనం వేసి గిర గిర తిప్పుతాడొకసారి ఆ నూనెంతా అంటుకోడానికి. అలా కేశవాయ స్వాహా– మినపగింజంత నీటితో స్వరపేటికను శుభ్రం చేసుకుంటాడు. నారాయణాయ స్వాహా– మళ్ళీ ఆ శబ్దంతో శుభ్రం చేస్తాడు. మళ్ళీ మాధవాయ– స్వాహా– శుభ్రం చేస్తాడు. ఇన్ని రకాలుగా పలకడానికి వీలుగా దాంట్లోకి నీరు చేరి శుభ్రమవుతుంది. అయ్యాక ఇప్పుడు సైకిల్ చక్రాన్ని పెడల్ తిప్పినట్లు గబగబా, **గోవిందా, మధుసూదనా, విష్ణు, త్రివిక్రమా, వామనా, శ్రీధరా, హృషీకేశా, పద్మనాభా, దామోదరా, సంకర్షణా, అనిరుద్ధా, అధోక్షజా, నారసింహా, అచ్యుతా, జనార్దనా, ఉపేంద్రా, హరయే, శ్రీకృష్ణాయ నమః.**

షోడశసంస్కారాలు– పదహారు సంస్కారాలు మనిషికి ఉంటాయి అంత్యేష్టితో కలిపి. చంద్రుడు శోడషకళాప్రపూర్ణుడు. పదహారు పరదేవతా స్వరూపం కదలికలు. అందుకని పదహారు నామాలు చెప్తారు. చెప్పి అప్పుడు పూజ ప్రారంభం చేస్తాడు. అందుకని ఆచమనంలో భగవన్నామాలు కేశవా, నారాయణా, మాధవా అన్న నామాలతోటే స్వాహాకారం చెప్పి స్వాహా అంటే దేవతలకిచ్చానని. ఏ దేవతకి? స్వరపేటికను అధిష్ఠించి ఉన్న వాగ్దేవికి. ఆ తల్లి అలాగే అనుగ్రహాన్ని ప్రసరించి నాయందు పలికి, భగవన్నామాన్ని పలికి, పలికి నేను తరించి పోవాలన్న కోరికతో ఆచమనం చేస్తాడు. ఆచమనం చేసి సంధ్యావందనం చేస్తాడు.

యజ్ఞోపవీతం ఉన్నవాళ్ళు సంధ్యావందనం చేస్తారు. యజ్ఞోపవీతం లేకపోతే మేం సంధ్యావందనం చెయ్యక్కర్లేదు కదండీ అని కూర్చోకూడదు. సంధ్యా వందనం సూర్యోదయాత్పూర్వం అర్ఘ్యమిచ్చి చేసినట్లే, యజ్ఞోపవీతం లేనివాళ్ళు స్కాందపురాణాంతర్గతమైన సూర్యస్తుతిని పారాయణం చేయాలి తప్ప ఉత్తినే కూర్చోమని చెప్పలేదు. ఆ సూర్యనారాయణమూర్తిని స్తోత్రం చెయ్యాలి స్నానంచేసి. అది అయిన తరువాత అప్పుడు సాధారణంగా లోకంలో ఏం చేస్తారంటే సుప్రభాతపఠనం అని ఒక ప్రక్రియ. సుప్రభాతాన్ని పాడతారు.

సుప్రభాతం చదవడంకాదు, సుప్రభాతం పాడారు అంటారు. సుప్రభాతం పాడారు అన్న మాటకి **అర్థమేమిటంటే భగవంతుణ్ణి నిద్రలేపారు అని. భగవంతుడు** నిజంగా నిద్రపోతాడా? ఆయన కూడా నిద్రపోయాడనుకోండి, **అసలీ లోకాల్ని రక్షించేవాడెవడు?** ఆయన నిద్రపోడు. ఆయన నిద్రపోడూ అని నేనన్నాననుకోండి. వెంటనే మీకు అనుమానం వస్తుంది. మరి ఏవండీ శయనైకాదశి, ఉత్థాన ఏకాదశి అని రెండున్నాయి కదా. విష్ణువు పడుకున్నారంటారు, విష్ణువు లేచారంటారు కదా. మరి ఆ రెండు తిథులు ఉన్నప్పుడు ఆయన పడుకున్నట్లే కదా. అంతకాలం పడుకున్నాడూ క్షీరసాగరంలో అంటారు కదా. పడుకోవడం, లేవడం ఉన్నప్పుడు భగవంతుడు పడుకోకపోవడమన్న ప్రక్రియ ఎక్కడుందని నన్నడగవచ్చు.

అది నిద్ర కాదు. కామశిఖ నిద్రకాదు. మళ్లా అది **నిద్రాముద్రాం నిఖిల జగతీ రక్షణే జాగరూకం** అది దక్షిణాయనం. ఉపాసనలో బయట ఎన్ని బిల్వదళాలు వేస్తున్నాడని కాదు, బయట ఎంత అభిషేకం చేస్తున్నాడని కాదు. లోపల మనసు భగవంతుడి దగ్గర ఎంత నిలబడి ఉన్నదీ చూస్తూ ఉంటాడు. లోపలి చూపు కొరకు-లో చూపుతో చూడ్డానికి పై నేత్రాలను మూసి ఉంటాడు. మూసి ఉండి ఎవడు ఉపాసన చేస్తున్నాడో వాడ్ని పట్టుకుని ఉద్ధరింప చేస్తాడు. అందుకని **నిద్రాముద్రాం నిఖిల జగతీ రక్షణే జాగరూకం.** బాగా తెలివిగా ఉన్నాడు. ఇలా చూడ్డం కాదు. లోచూపుతో నీ లోపలికి, నా లోపలికి చూస్తూ ఉంటాడు. అదీ విష్ణువు నిద్ర. కామశిఖ నిద్ర కాదు. ఆయన కర్మ ఆయన పడుకోడానికి? పడుకోడాయన. పడుకోని వాడిని నిద్రలేపడమేమిటి? పడుకోనివాడు కృష్ణావతారంగా వస్తే నందవ్రజంలో ఉన్న గోపకాంతలందరూ ఆయన్ని పడుకోబెట్టేసే ప్రయత్నం చేశారు. ఏదో స్నానం చేయించేశారు. ఆయన్ని తీసుకొచ్చారు, ఒక బట్ట ఉయ్యాల వేశారు, అందులో పడుకోబెట్టారు,

**జోజో కమల దళేక్షణ, జో జో మృగరాజ మధ్య జో జో కృష్ణా**
**జో జో పల్లవకర పద, జో జో పూర్ణేందు వదన జో జో యనుచున్.**

ఆ కృష్ణపరమాత్మని ఉయ్యాల ఊపారు, ఊపారు, ఊపారు ఎప్పుడూ స్థిరంగా ఉండే పరమాత్మని ఊపేశారు కదలికలు. అన్నీ ఊపి ఇలా తీసి చూస్తే ఇలా ఉన్నాడు పత్తికాయల్లా కళ్ళేసుకుని. ఏంటమ్మా గూడ జారిపోతోంది, ఎంత

ఊపినా పడుకోడేంటి అంటే, ఇంకో గోపకాంత వచ్చింది. ఆవిడా ఊపింది. ఎంత ఊపితే పడుకుంటాడు? పడుకోడు. పాపం ఒక వృద్ధగోపిక కాదు, కాదు పడుకోబెట్టుకోవాలి ఒళ్ళో అని ఆ తొడ మీద తల పెట్టుకుని బోర్లా పడేసి, వీపు మీద జో కొడుతూ ఇలా, ఇలా ఆడించింది. ఇంతా జోకొట్టి పడుకున్నాడేమోనని ఇలా చూస్తే చక్కగా రెండు కళ్ళూ విప్పి చూస్తున్నాడు. ఇదెక్కడి పిల్లాడమ్మా, రాక్షస పిల్లాడు, పడుకోడేమిటమ్మా నీ కొడుకు అని యశోదనన్నారు.

అప్పుడాయన వీపు మండి పోయిందట. ఆదికూర్మాన్ని వీపుమీద మోసి క్షీరసాగరమథనంలో సహకరించినా కూడా మండిపోనంత మండిపోతే, వీపు ఎందుక్కొడుతున్నారురా వీళ్ళు నన్నిలా అని, ఎందుకు జో, జో, జో అని కొడతారు ఏమిటి దీనికర్థం అని ఆలోచించాడట. ఓహో, ఈ భూలోకంలో ఒక దిక్కుమాలిన లక్షణముంది. వీళ్ళు నిద్రపోతారు, నాకు నిద్ర లేదు, అలవాటులేదు, వీళ్ళు నన్ను నిద్రపొమ్మని కొడుతున్నారిలా.

**లోకములు నిదురవోవగ**
**జోకొట్టుచు నిదురవోని సుభగుడు రమణుల్**
**జోకొట్టి పాడ నిదురం**
**గైకొను క్రియ నూరకుండె కనుదెఱవకయున్.**

వాళ్ళలా జోకొట్టేస్తుంటే ఓహో కళ్ళు మొయ్యకపోతే వీళ్ళిలాగే కొట్టేస్తారని నిదురపోయినవాడిలా కళ్ళు మూసుకున్నాడట. హమ్మయ్యా, పడుకున్నాడమ్మా నీ పిల్లాడని కొట్టడం మానేసి పడుకోబెట్టారు. కాబట్టి నిజంగా పరమేశ్వరుడు నిద్రపోతాడా? నిజంగా పరమేశ్వరుడు నిద్రపోడు. నిద్రపోయింది మనం. నిద్రపోయినవాళ్ళను లేచినప్పుడు ప్రభాతం, భాతం అంటే కాంతి. ప్రభాతం కాంతి రావడానికి ముందు ఉన్న చీకటి. ఇక విచ్చిపోతుంది. ఆ చీకట్లో వినపడే సమస్తశబ్దాలనూ, కనబడే ప్రతి విషయాన్నీ భగవంతుడితో ముడివేసి చూడాలి. అది సుప్రభాతం. ఆయనకి కాదు మనకి. మనం భగవంతుడితో ముడివేసి చూశాం.

**ఆకాశసింధు కమలాని మనోహరాణి, ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః**

ఈశ్వరా, అదిగో ఆకాశం ఎర్రబారుతోంది. పరమేశ్వరా లేవండీ నిద్ర.

**ఉన్మీల్య నేత్రయుగ ముత్తమపంజరస్థాః పాత్రావశిష్ట కదలీఫల పాయసాని।**
**భుక్త్వా సలీల మథ కేలిశుకాః పఠంతి శేషాద్రిశేఖర విభో తవ సుప్రభాతమ్॥**

అదిగో స్వామీ, రెండు చిలుకలు మామిడిచెట్టు మీద కూర్చుని మామిడిపండు రసాన్ని పీల్చి ఒకదాని నోట్లోకి ఒకటి పెట్టుకుంటున్నాయి. చిలుకలు లేచి అరుస్తున్నాయి. లేద్దూ నువ్వు లేవ.

**యోషాగణేన వరదధ్ని విమథ్యమానే,**
**ఘోషాలయేషు దధిమంథన తీవ్రఘోషాః**
**రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుంభాః,**
**శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్,**

జ్ఞాపకం చేసుకోవడం. ఆ నందవ్రజంలో చీకటిగా ఉండగానే నువ్వు లేచి, గబగబా ఆవుల్ని, దూడల్ని అన్నిటినీ తీసుకుని చద్దెన్నం మూట తగిలించుకుని ఆ కొమ్ము బూరా ఊది గోపాలబాలురందర్నీ లేపి అరణ్యంలోకి వెళ్ళేవాడివి. మరిచిపోయావా? అదిగో నందవ్రజంలో నీకు గుర్తుందా, నువ్వు పుట్టిన తరువాత పాడీ, పంటా ఎక్కువై పోతే బాగా తోడుకున్న పెరుగులోకి కవ్వాన్ని దింపి మీ అమ్మ యశోద చల్ల చిలుకుతుంటే, కవ్వమేమో చర్, చస్ అంటుంటే కుండకీ, కవ్వానికీ దెబ్బలాటొచ్చిందా అన్నట్లుగా ఉండేది. అదిగో ఆ చప్పుళ్ళు వినబడడంలా చల్ల చేసిన చప్పుడు, లే అంటారు. అంటే నిజంగా ఆయన నిద్రపోయాడా? మీరు భగవంతుని వైభవాన్ని జ్ఞాపకానికి తెచ్చుకుంటున్నారు. ప్రకృతినంతటినీ కూడా భగవంతుడితో ముడివేస్తున్నారు. సుప్రభాతం. ఆయనకి కాదు మనకి సుప్రభాతం.

అందుకే శ్రీశైల మల్లికార్జున సుప్రభాతంలో

**పాతాళ గంగాజల మధ్యన నిర్మలాంగాః,**
**భస్మత్ త్రిపుండ్ర సమలంకృత ఫాలభాగః**
**గాయంతి దేవ ముని భక్త జనాధ్వంతం**
**శ్రీమల్లికార్జునవిభో తవ సుప్రభాతమ్.**

పాతాళ గంగలో స్నానం చేసి విభూతి పుండ్రాలు పెట్టుకుని, బొట్టు పెట్టుకుని ఓ మల్లన్నా అని అరుస్తూ భక్తులందరూ వస్తున్నారు ఈశ్వరా లేవండీ.

శ్లోకం వచ్చినవాడు శ్లోకం పాడతాడు. శ్లోకం రాకపోతే ఆ సుప్రభాతాని కంతా, సామగ్రంతా పూజకి కావలసినవన్నీ ఒక్కొక్క సంభారం, దగ్గర పెట్టుకుంటూ

ఒంటి చర్మం తీసి చెప్పులు కుట్టిన కక్కయ్య వచ్చేను మేలూకో, మేలూకో జగదీశా మేలూకో పరమేశా మేలుకొనీ మమ్మింకా ఏలూకో అని మేలుకొలుపులని పాడుతుండేవారు. అది పరమశివునికి కక్కయ్య అన్న భక్తుడు ఒంటి చర్మం తీసి చెప్పులు కుట్టాడు. ఆ కక్కయ్య వచ్చాడు లేవద్దా శివా, లేవండీ అని మేలుకొలుపు. జానపదులు జానపదులస్థాయిలో మేలుకొలుపులు పాడతారు. అందరూ మేలుకొలుపులు పాడతారు. ఎందుకని? నిజానికి పరమేశ్వరుడికి కాదు మేలుకొలుపు. మనకి మేలుకొలుపు. సు ప్రభాతం. ఆ ప్రకృతిలో పరమేశ్వర వైభవాన్ని స్మరిస్తూ చక్కగా పాటలు పాడుతూ భగవంతుణ్ణి నిద్ర లేపుతారు. అంటే నిజానికి దానిలో మైమరచిపోతారు. మైమరచిపోయి పూజ గదిలోకి వెళ్ళిన తరువాత భగవంతుడు కనబడడం కాదు. ఆ సుప్రభాతం పాడుకుంటూ పూజాసంభారాలన్నీ అక్కడ చేర్చేటప్పటికి–

**కమలాకుచ చూచుక కుంకుమతో**
**నియతారుణితాతుల నీలతనో।**
**కమలాయత లోచన లోకపతే**
**విజయీభవ వేంకట శైలపతే॥**

అక్కడికెళ్ళేటప్పటికింక తవ సుప్రభాతం అనడు. విజయీభవ అంటాడు. ఈశ్వరుడికి వీడు విజయీభవ చెప్పడమా? అదేమిటి? అంటే లే, లే, లే అన్నాడు. పరమేశ్వరుడేం చేశాడు? తండ్రి కదూ ఉండలేక గభాల్న పడుకున్నవాడు లేచి బయటికొచ్చేశాడు. పడుకున్నవాడు లేచి బయటికొచ్చేస్తే ఎలా పడుకున్నాడు రాత్రి? అమ్మవారితో కలిసి పడుకున్నాడు. ఆవిడా తన చెక్కుల కుంకుమ పత్ర భంగ సంజనితా అంటాడు నంది తిమ్మన పారిజాతాపహరణంలో. ఆవిడ ఒంటి నిండా కస్తూరికాది మంచి మంచి అంగరాగకాలన్నీ అలదుకొని పడుకుంది. ఆమె రాత్రి పరమేశ్వరుణ్ణి కౌగిలించుకుంది గాఢంగా. కౌగిలించుకుంటే ఆమె కుచములమీద ఉన్న కస్తూరి ముద్రలు నల్లగా ఉన్న వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలం మీద కనబడ్డాయి. ఆయన మనం పిలిచామని గబగబా లేచి బయటికొచ్చేశాడు. ఆయన

అసలే నల్లటి ఒళ్ళు. దానిమీద ఎర్రటి చుక్కలు కనబడ్డాయి. మనం చూసి రాత్రి కౌగలించుకుని పడుకున్నాడు అమ్మవారిని అనుకుంటామేమో, నా కనువాపు తగులుతుందేమో స్వామికని

**కమలాకుచ చూచుక కుంకుమతో నియతారుణి తాతుల నీలతనో, కమలాయత లోచన లోకపతే**

తామరరేకుల్లాంటి కళ్ళు ఇలా బరువుగా ఎత్తి వస్తున్నప్పుడు చిన్న ఎర్ర జీరలతో స్వామీ, చూసేశాను నీ వక్షఃస్థలం, కనువాపు తగులుతుందేమో కప్పేసుకో ఉత్తరీయం. **విజయీభవ వేంకట శైలపతే.**

**న చ తుర్ముఖ షణ్ముఖ పంచముఖ**
**ప్రముఖాఖిల దైవతమౌలిమణే।**
**శరణాగత వత్సల సారనిధే**
**పరిపాలయ మాం వృషశైలపతే॥**

పొంగిపోతూ అప్పటివరకూ బాగానే తెస్తాడు సామగ్రి. ఇక ఈ పొంగులో తెచ్చిన తమలపాకులే తెస్తాడు. పెట్టిన పూలే పెడతాడు. ఆనందఝరి లోపల. అది అనుభవించడం, ఆ రోమాంచితమవడం సుప్రభాతం.

అది మల్లికార్జునుడికంటే

**నమః శివాభ్యాం, నవ యౌవనాభ్యాం**
**పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం**

**నగేంద్ర కన్యా వృష కేతనాభ్యాం**
**నమో నమః శంకర పార్వతీభ్యాం.**

తల్లి పార్వతీదేవిని కౌగిలించుకున్న పరమశివుడు రాత్రి పార్వతీదేవి గడ్డాన్ని ఇలా పుణికితే సంతోషంగాను, ఆమె బుగ్గలకి రాసుకున్న ఎర్రని కస్తూరికాది చుక్కలు మొదలైనవి అయ్యవారి వేళ్ళ చివర కనబడ్డాయట. అవి కనబడితే శివా మీరు అమ్మవారి శరీరావయవాలను స్పృశించడం వల్ల ఆవిడ కుంకుమ రేఖలు వేళ్ళకంటుకొని కనబడుతున్నాయి. ఇద్దరూ కౌగిలించుకొని అలాగే వచ్చేశారు

మా కోసం. అయ్యో, అయ్యో అయ్యో స్వామీ నమస్కారం, నమస్కారం ఇంత ప్రేమా అని లోపల అనుభవించాడనుకోండి. ఇక్కడ వాళ్ళ కదలికలు కనబడితే రోమాంచితమవుతుంది. ఆనందంతో నిలబడతాడు. అందుకే సుప్రభాతం నిలబడి చదవాలి. ఏకాంతసేవలో కూర్చుని ఉండాలి. ఏకాంత సేవలో నిలబడకూడదు. సుప్రభాతంలో కూర్చోకూడదు. అది నియమం. ఇప్పుడు సుప్రభాతపఠనం చేశాడు. మనస్సు ఎంతో ఆనందాన్ని పొందింది. ఎంతో శాంతిని పొందింది, పూర్తిగా భగవంతుని వైపు అభిముఖం అయ్యింది. ఇప్పుడు వెళ్ళి పూజ ప్రారంభం చేశాడు.

పూజ ప్రారంభమంటే ఏం చేస్తాడు? రాత్రివేళ పూజామందిరంలోకి ఉగ్రభూతాలు ప్రవేశిస్తాయి. ప్రవేశించి అవి ముందు పూజ చేసే ప్రయత్నం చేస్తాయి. నిర్మాల్యం తీసేస్తాయి. ఎందుకంటే ఫలితం వాళ్ళకెళుతుంది. వాళ్ళు వచ్చి ఉన్నారేమో అందుకని

**ఉత్తిష్ఠంతు భూత పిశాచాః ఏతే భూమి భారకాః ఏతేషామవిరోధేనః బ్రహ్మ కర్మ సమారభేః**

నీకూ, మాకూ దెబ్బలాటేం లేదు. మేమూ తెల్లవారగట్ల పూజ చేసుకుంటాం కాబట్టి మీరిక్కడ్నించి వెళ్ళిపోండి అని ఆ పూలు వాసన చూసి ఎడమపక్క నుండి పడేస్తారు. ఆచమనంలో మీరొక విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి. అసలు ధర్మపత్నీ స్వీకారం ఎందుకు చేస్తారో తెలుసా? గృహిణిని ఎందుకు పొందుతారో తెలుసా? ఆచమనం ఆవిడ వెయ్యాలి. ఏదో ఊరొచ్చినపుడు భార్య పక్కన లేకపోతే సరిగానీ, బ్రహ్మచారిగా ఉన్నప్పుడూ తానే ఆచమనం చేసి, గృహస్థుగా ఉన్నప్పుడూ తానే ఆచమనం చేస్తే ఇక భార్య ఎందుకు కాఫీ పెట్టడానికా? ఆవిడ ఏ విధంగా ధర్మపత్ని? ఆవిడనెలా ఉద్ధరించినట్లు? అదికాదు. ఆవిడ పూజంతా పక్కన కూర్చోదు. మీకు కావలసినవి తయారుచేస్తుంది. ఆమె అధికారం ఏమంటే ఆచమనం ఆవిడ వెయ్యాలి.

తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారని మహానుభావుడు. మొన్న నాతో శ్రీశైలం వచ్చాడు వాళ్ళబ్బాయి. రాఘవనారాయణ శాస్త్రిగారి పెళ్ళయి తరువాత మేడమీద కూర్చున్నారు. తండ్రిగారూ, మామగారూ కలిసొచ్చి

రాఘవనారాయణ శాస్త్రిగారిని నువ్వు పెళ్ళెందుకు చేసుకున్నావురా అబ్బాయ్ అన్నారు మామగారు. ఆయనకి కోపం వచ్చింది. పిల్లనిచ్చి సాయంకాలం నా దగ్గరికొచ్చి పెళ్ళెందుకు చేసుకున్నావని అడుగుతారా! అని మామగారూ, మీరెందుకు చేసుకున్నారో నేనూ అందుకే చేసుకున్నానందామనుకున్నారు. అనుకుని తప్పు, పితృపంచకంలో ఒకరు మామగారితో అలా మాట్లాడకూడదని ఎందుకు అడిగి ఉంటారు మామగారీ ప్రశ్న నన్ను అని కళ్ళు మూసుకుని ధ్యానం చేశాడు. ఆయనకి బాలాదేవత కనబడుతుండేది. బాలాంబికను ధ్యానం చేశాడు. అమ్మవారు వెంటనే బుద్ధి ప్రచోదనం చేసింది. అమ్మా, బ్రహ్మచారిగా చేసినంత కాలం ఆచమనం చేశా. ఇంకా ఆచమనం నేను చెయ్యడమేమిటి? ధర్మపత్నిని స్వీకరించాను. ఆచమనం వెయ్యడానికి భార్య ఉండాలింక. అందుకని ఎడమచేత్తో తీసి ఎన్నాళ్ళు వేసుకుంటాను? నేను ఎడమచేత్తో వేసుకుంటే దూష్యం. ఎడమచేత్తో ముట్టుకోకూడదు. బ్రహ్మచారిగా ఉన్నప్పుడు పక్కనెవరూ ఉండరు కాబట్టి తీసి వేసుకున్నాను. ఒప్పుకున్నారు ధర్మపత్నిని స్వీకరించాక కూడా నేను ఎడమచేత్తో ఆచమనం చేసి పూజ మొదలుపెడితే ఇంకేమి గృహస్థాశ్రమం? ఆమె కుడిచేతితో తీసి తన కుడిచేతిలో వెయ్యాలి. అదీ ఉపకరణమవడమంటే. ఒకరికొకరు బాసటగా నిలబడడమంటే. ధర్మంలో ఆచమనం దగ్గర ప్రారంభం. అంటే దాని ఉద్దేశ్యం ఎవరు ముందు స్నానం చేస్తారని గుర్తు. ఆయన కాదు ఆవిడే.

అందుకే శ్రీకాళహస్తి క్షేత్రంలో శ్రీకాళహస్తీశ్వరుడికి మొదటి అభిషేకం ఉండదు. జ్ఞానప్రసూనాంబకే మొదటి అభిషేకం. ఆవిడ స్నానం చేసి ఆయనకు సంధ్యావందనానికి కావలసిన నీళ్ళు పెట్టేస్తే ఏముందండీ సంధ్యావందనానికి? కాస్త ఆచమనపాత్రతో నీళ్ళూ, కలశంతో కాసిని నీళ్ళూ ఒక పళ్ళెం, అయిపోయింది ఆచమనం. అది చేసుకోవడానికి చాలు. మిగిలినవి పూజాసంభారాలన్నీ ఆయన గాయత్రి చేసుకునే లోపల తీసుకొస్తుంది ఒక్కొక్కటీ, ఒక్కొక్కటీను. ఈ లోగా పట్టండి అంటుంది. ఆయనిలా చెయ్యి పడతాడు. ఆవిడ కుడిచేత్తో ఆచమనం వేసేస్తుంది **కేశవాయః స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా**, చెయ్యి కడుక్కుంటాడు. ఆవిడ పాత్ర అక్కడ పెట్టి వెళ్ళిపోతుంది. అందుకూ ఇల్లాలు. ఏ ఇంట ఇల్లాలు ఆచమనం వేసిందో ఆ ఆశ్రమం ధర్మ్యం. ఆ ఇల్లు ధన్యం. అంతేకానీ ఆయనే ఎడమచేత్తో వేసుకు తాగేస్తుంటే ఇంకెందుకు పూజ? అందుకు

కాదు వైదికమైన ఆశ్రమం. కాబట్టి ఆ పూజ ప్రారంభం. పూజ అన్న మాటను మీరు జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. పూజ అంటే మనమేమంటాం? ఎవరు పూజ చేశారో వారు పూజార్హులవుతారు. పూజ అంటే గౌరవం, పూజ అంటే నివేదన, చెప్పుకొనటం. పూజకి పర్యాయపదం నివేదన. పూజ ఎవడు చేశాడో వాడు పూజార్హుడవుతాడు.

అంటే ఇప్పుడు మీరు పూజించి పూజనీయులయ్యారా? పూజించి అవతలివాడు గొప్పవాడయ్యాడా? అవతలివారిని గౌరవించి మీరు గౌరవానికి పాత్రులయ్యారు. భగవంతుణ్ణి పూజించి భగవంతుడి వాత్సల్యానికి పాత్రులవుతారు. పూజ అన్నమాటకి అర్థం అది. పూజ దేనికి చేస్తారంటే భగవంతుని వాత్సల్యానికి పాత్రులవడానికి చేస్తారు. అసలు భగవంతుని వాత్సల్యానికి మనమెందుకు పాత్రులం? ఎందుకు కావాలి? ఆయన ఏమిటి చేశాడు మనకు ఉపకారం? ఆయన ఉపకారం ఇది చేశాడూ అని చెప్పడానికి ఆధారమేముందసలు? అంటే నేను ఒక్క మాట చెప్తాను, కొంచెం జాగ్రత్తగా అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యండి. మనం సుఖాభిలాషులం. మనకి సుఖం కావాలీ, సుఖం కావాలీ అని వెంపర్లాడతాం. ఇదేం పెద్దగగనమైన వేదాంత సిద్ధాంతం కాదు. తేలికగా పట్టుకోగలరు. పరమేశ్వరుడు మనుష్యులందర్నీ తయారుచేశాడు. మిగిలిన జీవకోటిని పక్కనపెట్టండి. ఇప్పుడు వాటి గొడవెందుకు? మనుష్యులను ఆలోచించండి. అందరు మనుష్యులనూ తయారుచేశాడు. చారెడేసి కళ్ళు పెట్టాడు. చూసే శక్తిని తీసేశాడు. చక్కటి చెవులు పెట్టాడు శ్రీకారాల్లాంటివి, కానీ వాటికి వినే శక్తి తీసేశాడు. సంపంగి మొగ్గలాంటి ముక్కు పెట్టాడు, వాసన చూసే శక్తి తీసేశాడు. మెరిసిపోతున్న వెండిపళ్ళెం లాంటి చర్మం పెట్టాడు, స్పర్శశక్తి తీసేశాడు. ఎర్రగా తాంబూలం వేసుకున్న నాలు లాంటి నాలుక పెట్టాడు, రుచి చెప్పే శక్తి తీసేశాడు. ఇక సుఖం, దుఃఖం ఈ రెండూ ఏమైనా ఉన్నాయా? మీరు చెప్పండి నాకు. అవేమైనా ఉంటాయా?

అక్కడొక జలపాతం ఉంది. నా కెందుకు? ఏమిటి చూస్తాను? అక్కడ వీణానాదం ఉంది. నేనేం వింటాను?

రామాయణం ఉంది నేనేం చదువుకుంటాను. ప్రవచనం చెయ్యాలి. రామాయణం చదివితే కదూ ప్రవచనం. వాఙ్మయమంతా ఎందుకు పనికి

వస్తుందింక? ఓ పువ్వుంది. దాని వాసనేం చూస్తారు? భార్య ఉంది. ఎలా ముట్టుకుంటారు? కొడుకున్నాడు.తడిమి ఎలా పరవశించిపోతారు? ఎలా పొంగిపోతారు కౌగలించుకుని పుత్రగాత్ర పరిష్వంగమని? లేదూ మధురపదార్థముంది, ఎలా సంతోషిస్తారు, దానిని నాలుకమీద వేసుకుంటే రుచి తెలియనప్పుడు? బొగ్గు వేసుకుంటే ఏమిటి? మిఠాయి వేసుకుంటే ఏమిటి? సుఖమన్న మాట ఏమైనా ఉందా ఇంక? ఇక బ్రహ్మాండంలోవున్న ఏ సుఖ స్థానాలూ నీకు పనికివచ్చేవి కావు. మిమ్మల్ని సుఖపెట్టవు, దుఃఖపెట్టవు. నా నాలుకమీద తీసుకొచ్చి ఇంత బొగ్గు గుండ పారేశారు, తెలిస్తే కదూ? మింగేస్తాను. లడ్డూ పడేశారు, తెలిస్తే కదూ మింగేస్తాను. అసలది లడ్డో, బొగ్గో చూడ్డానికి కన్నేది? వచ్చినవాడు నోరు తెరూ అంటే వినడానికి చెవి ఏది? నోరు తెరు అనడానికి, తెచ్చిందేమిటో తెలియడానికి వాడికి స్పర్శ ఏదీ? చూడ్డానికి వాడికి కన్నేదీ? ఇంకసలు సుఖమేది? దుఃఖమేది? ప్రపంచమంతా అయోమయం. కానీ ఆయనేం చేశాడు? ఉదారుడై నువ్వేం చేశావురా, ఎంత డబ్బిచ్చావురా అని అడగలేదు. అడక్కుండా కన్ను, ముక్కూ, చెవి, నాలుక, చర్మం పెట్టి, వీటి ఐదింటికీ ఐదు శక్తులు పెట్టాడు. శబ్ద, స్పర్శ, రస, రూప, గంధాలనిచ్చాడు అయిదింటిని. చెవులు వింటాయి, కన్ను చూస్తుంది, నాలుక రుచి చెప్తుంది, ముక్కు వాసన చెప్తుంది, చర్మం స్పర్శ చెప్తుంది. ఈ ఐదూ ఇచ్చాడు కాబట్టి ఒకే ఇంద్రియంతో కొన్ని కోట్ల భోగాలనుభవిస్తున్నాడు, ఒక భోగం కాదు.

నేను మిమ్మల్ని చూసినప్పుడు ఒకలా పొంగిపోతాను. నా భార్యని చూస్తే ఒకలా పొంగిపోతాను. మా అమ్మగారి పాదాలు కనబడినప్పుడు ఒకలా పొంగిపోయేవాణ్ణి. మా నాన్నగారి చేతులు కనబడినప్పుడు ఒకలా పొంగిపోయేవాణ్ణి. మా గురువుగారు కనబడితే ఇప్పుడూ అంత పరవశించిపోతాను. పరమేశ్వరస్వరూపం కనబడితే పొంగిపోతాను. ఒక పెద్ద వేపచెట్టు కనబడితే కారాపి అబ్బా, ఎంత చెట్టు చూడండి అంటాను. పెద్ద ఊడలు దిగిన మర్రిచెట్టు కనబడిందనుకోండి. అబ్బా, దక్షిణామూర్తి కూర్చున్న చెట్టులా ఉంది. ఏదీ ఒకసారి ఆపండి దాని కిందకెళ్ళొద్దామంటాను. ఆ జలపాతం ఏమిటండీ అంత గొప్పగా పడుతోంది? ఏమి మల్లెల తీర్థమంటాను. ఏమి జ్యోతిర్లింగమండీ, ఏమి శ్రీశైలపర్వతశిఖరమండీ అంటాను. ఒక్క కంటితో ఎన్ని భోగాలనుభవిస్తున్నాను! దానికేమైనా అంతుందా అసలు? ఎన్ని భోగాలు

ఒక్క కంటినడ్డుపెట్టుకుని. ఈశ్వరుడు ఆ కంటిని, కంటికి చూడగలిగిన శక్తిని, అదేపనిగా వాడుతుంటే దస్పిపోతున్న కంటిని జాగ్రత్త పెట్టడానికి చాలా అందమైన రెప్పని, కొట్టుకి షట్టర్ లాగేసినట్లే ఇలా పడిపోయి మళ్ళీ ఆ వేడి తగ్గించేసి మళ్ళీ ఇలా లేచిపోతూ తల మీద వెంట్రుకలు పెరిగిపోతూంటే కనురెప్ప వెంట్రుకలు మాత్రం పెరగకుండా అంతే ఉండి, తల వెంట్రుకలు ఇలా దిగిపోతే అది మాత్రం ఏదో డొప్పలా ఇలా లేచి ఇలా ఉంటాయి. అది రెప్ప ఇలా పడిపోతే ఈ కనురెప్ప వెంట్రుకలు ఇలా కార్బైడ్ వైర్ ఫెన్సింగ్ వేస్తారే అలా అడ్డొస్తే, ఏ చీమో లోపలికి వెళదామనుకున్నా అవి అడ్డేస్తాయి. పైకీ ఎక్కలేకా, కింద నుంచీ దూరలేకా పక్కకెళ్ళిపోతాయి. నిద్రపోతున్నప్పుడు కూడా రక్షించడానికి పెరగని వెంట్రుకలతో అంత అందమైన కనురెప్పని అవి మొయ్యగలిగినంత వెంట్రుకల కూర్చెతోటే అంత మెత్తగా, అంత సున్నితంగా తయారుచేసి, నా కంటిని రక్షిస్తున్న పరమేశ్వరుడికి నేను ఏమిచ్చి ఋణం తీర్చుకుంటాను? నిజంగా నా కంటిని రక్షించుకునే కర్తవ్యం నా మీదే పెట్టి ఉంటే ఈశ్వరుడు, నా బ్రతుకేమైపోను? ఎంతటి మహాశిల్పి? మహానుభావుడు.

నేను ఒక కాగితం మీద నాలుగు గీతలు గీస్తే కాసిని నీళ్ళు పడితే చెరిగిపోతాయి. ఏ నాడు గీశాడో నా చేతిమీద గీతలు, ఎన్నిమాట్లు కడుక్కున్నానో ఆ గీతలలాగే ఉన్నాయి. ఏది పెట్టి గీశాడో ఆ గీతలు. ఎంత గొప్ప శిల్పి! ఒక్కొక్క ఇంద్రియంతో ఎన్ని కోట్ల సుఖాలిస్తున్నాడాయన! ఒక్క చెవి. ఒక్క చెవితో ఎన్ని శబ్దాలను విని ఆనందిస్తున్నాం. ఇప్పుడు ప్రవచనం విని ఆనందిస్తున్నారు. ఇంటికి వెళ్ళిన తరువాత వచ్చీ రాని మాటలు మనవడు మాట్లాడతాడు. పోతన భాగవతంలో పిల్లలు వచ్చీ రాకుండా మాట్లాడే మాటలు **తనయుల సంభాషణముల జనకులకున్ కర్ణయుగళి సద్భూషణముల్** అంటారు. కొడుకు మాటలు వింటే తండ్రి పొంగిపోతాడు. తల్లి మాట వింటే పరవశించిపోతాడు. తండ్రి మాట్లాడుతూంటే ధైర్యాన్ని పొందుతాడు. గురువుగారు మాట్లాడుతూంటే జ్ఞానాన్ని పొందుతాడు. వీణానాదం వింటే కన్నులు మూతపడి ఎంతో ఆనందాన్ని పొందుతాడు. కోయిల పాట వింటే పరవశించిపోతాడు. ఒకచోట ఒకాయన చక్కని పాట పాడుతూ ఉంటే ఎంతో సంతోషాన్ని పొందుతాడు. ఇన్ని శబ్దాలను చెవులతో విని పరవశించి పోవడానికి ఆయన కర్ణభేరిని పెట్టి వినగలిగిన లక్షణాన్ని

పెట్టాడే, ఆ శబ్దాలన్నీ కూడా వెళ్ళకుండా ఉండిపోయేటట్లు పెట్టాడనుకోండి, నేను మాట్లాడిన మాటలు ఎక్కడికీ వెళ్ళకుండా అలాగే ఉండిపోయాయనుకోండి. అసలు ఈ ప్రపంచమంతా ఎంత గందరగోళమైపోతుంది. పిచ్చెక్కిపోయి నరాలు బద్దలైపోతాయి. మాట్లాడిన మాటలు ఆకాశగుణకాలై ఆకాశంలో ప్రయాణిస్తూ వినబడిన తరువాత వెళ్ళిపోయి ఆగిపోయేటట్లుగా మళ్ళీ నిర్ణయం చేశాడు. ఏమి ఉదారుడవు! ఆయన ఈ ఐదు ఇంద్రియాలనూ ఇచ్చి ఉండి ఉండకపోతే, బ్రహ్మాండంలో సుఖాలను అనుభవించడానికి ఏమైనా ఉందా మనుష్యులకు? అసలా జీవితానికి అర్థమేమైనా ఉందా? ఏమీ లేదు. ఆ ఐదూ మనకిచ్చాడు. ఈ ఐదింటినీ మనం రోజూ పగటిపూట వాడుకుంటున్నాం.

అధోక్షజుడు అంటారు. విష్ణువు అధిపతి. వాటిని వాడేసుకుంటాం. ఈ కంటితో అదే పనిగా చూస్తాను. తెల్లవారగట్ల లేచినప్పటినుంచి రాత్రి వరకు. ఇప్పుడీ చెవితో ఎన్నో వింటాను. నాలుకతో ఎన్నో తింటాను. ఈ స్పర్శేంద్రియంతో ఎన్నో ముట్టుకుంటాను. చీకటి పడిపోయిన తరువాత ఇది బడలిపోతుంది. అలసిపోయి మేము డస్సి పోయామురా మాకు శక్తి అయిపోయిందీ అంటుంది. నేను నిద్ర అనే సుఖాన్ని పొందడానికి భగవంతుడికేం చేశాను? నేనేం చెయ్యలేదు. వెళ్ళి కటిక నేల మీద ఒక చింకి చాప వేసుకుని అలా పడుకున్నాను చెయ్యి పెట్టుకుని. పరమేశ్వరుడు నిద్రాకాలిక సుఖాన్నిస్తాడు. నిద్ర సుఖస్వరూపం. నిద్ర బాధాకరమనుకోండి అసలెవడూ నిద్రపోడు. నిద్ర సుఖస్వరూపం. అందుకే అబ్బా, ఎంత హాయిగా ఉందోనండీ, పడుకున్నానంటాడు. ఆ నిద్ర అన్న సుఖంలో ఇంద్రియాలని మనసులోకి తీసుకెళ్ళి, మనసుని ఆత్మలోకి తీసుకెళ్ళి, సెల్‌లో ఛార్జింగ్ అయిపోతే బ్యాటరీ పెట్టి మళ్ళీ ఛార్జ్ చేసినట్లు రాత్రల్లా మళ్ళీ ఇంద్రియాలకన్నింటికీ కూడా శక్తినిస్తాడు. శక్తినిచ్చి మళ్ళీ నిద్రలేచేటప్పటికి ఇంద్రియాలన్నీ మళ్ళీ పనిచెయ్యడానికి సిద్ధపడ్డాయి. రాత్రల్లా ఇంద్రియాలకు శక్తినిచ్చిన వాడు పరమశివుడు. అందుకే రాత్రి శివస్వరూపం.

బడలిపోయిన ఇంద్రియాలకు మళ్ళీ శక్తినిచ్చేవాడు మహానుభావుడై, ఆయన అందుకే మూడు ప్రళయాలను చేస్తాడు. ఆత్యంతిక ప్రళయం, మహా ప్రళయం, స్వల్పకాలిక ప్రళయం. స్వల్పకాలిక ప్రళయం అంటే నిద్ర. ఏమీ తెలియకుండా

కొంతసేపు పడుకుంటాడు. ఇంద్రియాలు శక్తి పొందుతాయి. **ఆత్యంతిక** ప్రళయమంటే జ్ఞానం. మహా ప్రళయమంటే తనని పొందలేకపోయిన జీవుల్ని తాను పొందేస్తాడు. నల్లపూసల్లా కిందపడిపోయి ఉంటే తనని పొందలేక మైనం ముద్దలా వచ్చి మధ్యలో పడతాడు. పడితే అవే దానికంటుకుంటాయి. అలా తీసేసుకుంటాడు తనలోకి. అది మహాప్రళయం. మూడూ కారుణ్యంతో చేస్తారు తప్ప శివుడు క్రౌర్యమూర్తి కాడు. అందుకే సదా విష్ణు, సదా బ్రహ్మల్లేవు. సదాశివ. అందుకే పంచమంత్రపఠనం చెప్పి పరమశివుడి విషయంలో ప్రత్యేకంగా చేస్తారు.

అందులో **ఈశాన స్సర్వ విద్యానాం ఈశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతిః బ్రహ్మా శివోమే అస్తు సదామే,** ఎప్పుడూ సదా శివుడే.

ఆయన్ని తిట్టి తిట్టి పడుకుంటాడు వాడు. అంత తిట్టి పడుకున్నవాడికి రేపు తిట్టడానికి మళ్ళీ శక్తినిస్తాడు. అదీ ఆయన ఔదార్యం! ఆమె అన్నపూర్ణ. నేను పెట్టిన అన్నం తిని మా ఆయన్ని తిడుతున్నాడని ఊరుకోదు. పిల్లాడు బాగుపడతాడులే ఎప్పుడో అప్పుడు అని మళ్ళీ పెడుతుంది. ఇప్పటికీ కేరళలో ఒక అన్నపూర్ణ దేవాలయం ఉంది. పగటిపూట భక్తులకి అన్నం పెడతారు. రాత్రి బాగా చీకటిపడిపోయిన తరువాత పదింటికి ఆ వంట చేసిన పదార్థాలతో కలిపి తీసుకెళ్ళి అరణ్యంలో పెడతారు. దొంగలు బయటికొస్తే పట్టుకుంటారని రాక ఆకలితో ఏడుస్తున్నారేమోనని అక్కడ పెడితే, అక్కడ దొంగలు తింటారు. పొద్దున వెళ్ళి పాత్రలు తెచ్చుకుంటారు. అదీ అన్నపూర్ణ అంటే. వాళ్ళిద్దరూ

**వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.**

ఆయన మహానుభావుడు అంత ఛార్జింగ్ ఇచ్చాడు. అంతగా ఇంద్రియాలకు శక్తినిస్తాడు. బ్యాటరీ ఫుల్. డోంట్ వేస్ట్ ఎనర్జీ అని చెప్పి స్క్రీన్ మీద సెల్‌కి పడినట్లుగా, చాలు, ఇంద్రియాలు శక్తినిపొందాయి. ఇక లేవవచ్చు. సక్రమంగా వినియోగించుకో అని తెలివొచ్చిందీ అని ఏర్పాటు చేస్తాడు. అయినా పడుకుంటానంటే నీ కర్మ. నువ్వు మొదలుపెట్టుకోవచ్చు. ఇక ఇంద్రియాలను వాడుకో అంటాడు. పూజ అన్న మాటకి అర్థమేమిటో తెలియకుండా పూజ చేసినంత కాలం అది తంతు. పూజ అంటే ఏమిటో తెలిసి చేస్తేనే పూజ. పూజ

నివేదన. పూజ కృతజ్ఞతావిష్కారం. పూజ ఈశ్వరవాత్సల్యానికి హేతువు. పూజ అంటే దేనితో మొదలుపెడతాం? దీపంతో మొదలుపెడతాం. ఎందుకు దీపం? ఈశ్వరుడికి దీపం లేకపోతే కనబడదా ఆయనకి? మనకి కనబడదా? ఎందుకా దీపం? అంటే అసలు దీపాలలో కెల్లా పెద్ద దీపం పరమేశ్వరుడు. దీపం పెట్టి ఉపనిషత్తులో ఒక మంత్రం చెప్తారు.

**న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం నేమా విద్యుతోభాతి కుతోయ మగ్నిః త్వమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ విధం విభాతి–**

అంటారు. సూర్యచంద్రులు కూడా ఎక్కడ ప్రకాశించరో, వాళ్ళ ప్రకాశం కూడా దేనిముందు వెలవెలబోతుందో అటువంటి ప్రకాశస్వరూపుడు పరమేశ్వరుడు. మరి దీపమెందుకు?

**లోకంబులు లోకేశులు, లోకస్థులు దెగిన దుది నలోకంబగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం డే కాకృతి వెలుంగు నతని నే సేవింతున్.**

అంటారు పోతన. లోకాలు, లోకస్థులు, లోకేశులు అందరూ మడిసిపోయిన తరువాత ప్రళయజలాలలో కటిక చీకట్లో లోకాలు తేలుతూ ఉంటే, ఆయనొక్కడే అన్ని చీకట్లకీ ఆవల తనంత తానుగా తానొక్కడే ప్రకాశిస్తూ ఉంటాడు. అటువంటి స్వయం ప్రకాశకుడైన పరమేశ్వరుడికి దీపం పెట్టడమెందుకు? అంటే దీపం పెట్టడం ఆయనకు వెలుతురు కొరకు కాదు. ఈశ్వరా, మీరు నాకు కన్నిచ్చారు. నేను నిన్న వాడుకున్నాను. రాత్రి మళ్ళీ దానికి శక్తినిచ్చారు. మళ్ళీ లేచి వాడుకోవడం మొదలుపెడుతున్నాను. మీరు ఈ కంటికి శక్తినిచ్చి ఉండి ఉండకపోతే అసలు నయనం, నాయకా.

**సర్వేంద్రియాణాం నయనం ప్రధానం సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం.**

కన్నే ముందు పరుగెడుతుంది. దాని వెనక మిగిలిన ఇంద్రియాలు పరిగెడతాయి. ఈ కన్ను నాకిచ్చి రక్షించావు కనుక, కన్ను వెలుతురుకు ప్రతీక. కనుక నీకు నేను దీపం పెట్టి కృతజ్ఞత చెప్తున్నాను. అందుకు దీపం పెడతారు. అది తెలియకుండా ఒక వత్తి వెయ్యనా? రెండు వత్తులు వెయ్యనా? మూడు వత్తులు వెయ్యనా? దీపం అటు పెట్టనా? దీపం ఇటు పెట్టనా? ఎటు పెడితే ఏం?

ఎటు పెట్టినా కాదు, అసలు ముందు నీకెందుకు పెట్టాలో తెలిసి ఉండాలి. పిల్లి ఇటు వస్తే ఇబ్బందా? అటెళితే ఇబ్బందా? ఇలా వస్తే ఇబ్బందా? నీ మీద పడి కరవకుండా ఉంటే చాలు. అలా దీపం ఎందుకు పెట్టావో అసలు తెలిసుంటే పూజ. అసలు దీపమెందుకు పెట్టావో తెలియకుండా దీపం పెట్టేసి అది వెండి కుందులో పెడితే ఎవడికి కావాలి? ప్రమిదలో పెడితే ఎవడికి కావాలి? ఎందులో పెడితే ఎవడికి కావాలి? దీపం పెట్టడం ప్రధానం కాదు. దీపమెందుకు పెట్టావు? నీ మనసు కృతజ్ఞతావిష్కారం చెయ్యాలి. ఈశ్వరా, మీరు నాకు కన్నులు ఇచ్చి ఉండి ఉండకపోతే మా బ్రతుకు ఎంత దారుణంగా ఉండి ఉండేది! అసలు జీవితంలో తొంభై శాతం సుఖం పోయినట్లే. అసలు నేనేం చేశానని నాకు కళ్ళిచ్చావు? నువ్వు ఎంత ఉదారుడవై కళ్ళిచ్చావు. నేను ఒకవేళ ఒక్క కన్నే ఇస్తే పాడు చేసుకుంటానేమోనని రెండు కళ్ళిచ్చావా? ఎంత ఉదారుడవయ్యా! అని నీకు కృతజ్ఞత పెల్లుబికితే దీపం పెట్టి కృతజ్ఞత చెప్తావు.

అలాగే పరమేశ్వరుడు చర్మాన్నిచ్చాడు. ఈ చర్మం ఒక్కచోట కొంచెమిలా ఉత్తరించుకుందనుకోండి, కొంచెం తెగి పైకి లేచిందనుకోండి. అంతే ఈగలు, చీమలు, పురుగులు దాని చుట్టూ చేరుతాయి రక్తమాంసాల కోసం. అసలు ఆ చర్మాన్ని కానీ ఉత్తరించేశారనుకోండి ఎవరూ ఇక చూడరు. భయపడి పారిపోతారు. హడలిపోతారు. అటువంటిది ఇంత అందంగా ఉండడానికి ఒక తొక్క కప్పి దానికి రంగు పెట్టావా. ఆ తొక్క రంగు కోసమే కదూ ప్రపంచం మాయలో కొట్టుకుపోతోంది. కాబట్టి ఈశ్వరా, మీరు దీనితో కప్పి ఉండి ఉండకపోతే, దీనిని కప్పినా దీనికి స్పర్శ లేకపోతే, ఎవడో వచ్చి బ్లేడుతో కోసినా తెలియదు. ఎక్కడ ముట్టుకున్నా తెలిసే ఏర్పాటు చేశారా? ఏమి అద్భుతం పరమేశ్వరా? నాకు ఇంత కృప చేశారు. పైగా మీరు చూడండి నేను ఒక గజం గుడ్డలో ఇన్ని బియ్యం పోశాననుకోండి, మూట కట్టాననుకోండి అవి నిలబడతాయి. అందులో తీసుకొచ్చి బస్తా బియ్యం పోసి మూట కట్టమన్నాననుకోండి ఎలాగో అలా పోసి మూట కడితే పిట్లిపోతుంది ఆ గుడ్డ. ఆ గజం గుడ్డలో బస్తా బియ్యమెక్కడ పడతాయి? పరమేశ్వరుడు కొత్తగా చర్మాన్ని ఎప్పుడైనా పెట్టాడా తీసుకొచ్చి? నేను పుట్టినప్పుడు ఇంతున్నాను. కొంత చర్మం ఉంది. వీడు పెద్దవాడవుతున్నాడని చెప్పి ఇంత చర్మం ముద్ద పట్టుకొచ్చి

మా అమ్మకిచ్చి ఇది అలదుతూ ఉండు వీడికి అన్నాడేమిటి ఎప్పుడైనా? అనలేదు. పిట్లిపోకుండా, పగిలిపోకుండా ఇదే చర్మం ఎలా సాగిందో ఇంత మనిషినైనా? ఇదే చర్మం వార్ధక్యంలో కెళితే ఎలా ముడతలు పడుతోందో? ఏమి ఆశ్చర్యం? ఏమి ఈశ్వరసృష్టి? పరమేశ్వరా మీరు ఈ చర్మంతో కప్పారు కాబట్టి లోపలవన్నీ సక్రమంగా ఉన్నాయి. లేకపోతే ఈ నెత్తురూ, మాంసమూ అన్నీ తినేసేవి. ఇంత రక్షణ చేశారు. నేను మీకు ఏమివ్వగలను? అందుకని నేను నా చేత్తో చందనం తీస్తాను. బజార్లో అమ్మిన డబ్బా తీసుకొచ్చి నీళ్ళు కలిపి రాసెయ్యమని కాదు. నీవు నీ చేత్తో చందనం తియ్యాలి. ఇంట్లో చందనపు చెక్క, చందనపు సాన లేదంటే అంతకన్నా కృతఘ్నుడైన యజమాని లోకంలో ఇంకొకడుండడు. ఈశ్వరుడు పెట్టిన చర్మం అనుభవిస్తున్నావా? కోట్లు తినేస్తున్నావా? నీ ఇంట్లో చందనపు చెక్క, సాన లేవా? ఏమనుకోవాలి? ఇలా అడగడు కాబట్టి ఆయన ఈశ్వరుడు. ఆయనా ఇదే మాట నిన్ను అని ఉంటే ఒక్క గజం చర్మం ఇంకొకడికి కావాలి పట్టుకుపోతున్నానంటే ఏమై ఉండేవాడివి? కాబట్టి ఈశ్వరా మాకు స్పర్శనిచ్చారు. ఎన్ని సుఖాలు అనుభవిస్తున్నామో. తల్లి పుట్టుకని ఆశీర్వచనం చేస్తే ఒక సంతోషం. నాన్నగారు వచ్చి నాన్నా అని భుజం మీద చెయ్యి వేస్తే పెద్ద ధైర్యం.

గురువుగారు వచ్చి ఒరేయి **శివో రక్షతు, శివో రక్షతు** అని తల మీద చెయ్యి పెడితే పరమేశ్వరుడి చెయ్యి తగిలినంత ఆనందం. ఒక్కొక్క స్పర్శకి ఒక్కొక్క సంతోషం. ఒక జాజిపువ్వుని ముట్టుకుంటే పరమానందం. ఒక గులాబీ పువ్వు రేకులు ఇలా ముట్టుకుంటుంటే ఎంత సంతోషమో. ఈశ్వరా, ఏమి నీ వైభవం! కాబట్టి నేను చందనాన్ని నీకు ఒళ్ళంతా అలదుతాను నీవు నాకు చర్మం ఇచ్చినందుకు. అందుకని నా కృతజ్ఞత ఆవిష్కరిస్తున్నాను. అందుకని చందనాన్ని అలదుతాడు. ఆయనకీ చల్లగా ఉంటుంది. కాబట్టి స్పర్శేంద్రియం ఇచ్చినందుకు చందనం. ఇక ఆయన నాలుకిచ్చాడు. ఎన్ని పదార్థాలు తిని రుచులు చూస్తున్నానో. తీపి ఒకటే తింటున్నానేమిటి? తీపిలో లడ్డూ తీపి, చక్కెరపొంగలి తీపి, పాయసం తీపి, ఏదో కాజా తీపి, రకరకాల తీపులు, ఎన్ని తీపులు తింటున్నానో, ఎన్ని పళ్ళు తింటున్నానో, ఎన్ని రుచులు తింటున్నానో, ఇంత అనుగ్రహాన్ని నాకిచ్చావు. అంటే మనసు సాత్త్వికంగా ఉందా? లేదా? ఆ కృతజ్ఞతని స్మరిస్తోందంటే సాత్త్వికంగా ఉంది. నువ్వు నైవేద్యం పెట్టే పదార్థం కూడా సాత్త్వికంగా ఉండాలి.

అంతేకానీ సమోసాలు పెట్టకూడదాండీ, మసాలా దోసెలు పెట్టకూడదాండీ అని అడగకూడదు. నువ్వు రాజసికంగా లేవు. నువ్వు సాత్త్వికంగా ఉన్నావు. అందుకని పండు పెడతాడు, బెల్లంముక్క పెడతాడు, బెల్లం వేసి వండిన పదార్థం తీసుకొస్తాడు. బెల్లానికి నిలవ దోషం లేదు కాబట్టి ఆ పదార్థాలు నివేదన చేస్తారు. నాలుకిచ్చినందుకు ఈశ్వరుడికి కృతజ్ఞతను ఆవిష్కరించడం, ఒక పండు పెట్టడం.

అందుకే ఆయన అన్నాడు

**పత్రం, పుష్పం, ఫలం, తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి**

నాకు లేనిది కాదు. నేను సృష్టించిందే. కొత్తగా వాడు తెచ్చి నాకివ్వడానికి వాడి దగ్గరేముంది? వాడు సృష్టించిందేమైనా ఉందేమిటి? వాణ్ణి వాడే సృష్టించుకోలేదు నేను సృష్టించాను. వాడి గుండెకాయ వాడు పెట్టుకున్నాడా? వాడి మూత్రపిండాలు వాడుపెట్టుకున్నాడా? వాడి చిన్న పేగులు వాడెట్టుకున్నాడా? నేను పెట్టినవే, నేను పెంచినవే. ఈ సృష్టి అంతా నాదే. కానీ వాడు ప్రేమతో తెచ్చి నాకు ఒక్క పండు పెట్టి ఈశ్వరా, మీరు తినడానికి పెట్టానండీ, ఇన్నీ నాకిచ్చారు కదా మీరూ తినాలని పెట్టానండీ అంటే పొంగిపోతాడు. నివేదన. వాడి మనసు చెప్తే చాలు పరవశిస్తా. వాడు నాకివ్వడానికేముంది?

భగవాన్ రమణ మహర్షి ఒక మాట చెప్తుండేవారు. తెనకటికి ఒకాయనకి గయ్యాళి పెళ్ళాం ఉండేదట. ఆవిణ్ణి ఏమైనా కొంచెం నైవేద్యానికి చెయ్యవే అంటే కోప్పడేది. పాపం ఎప్పటినుంచో ఇంత చలివిడి చేసి పెట్టవే, ఇంత చలివిడి చేసి పెట్టవే అంటే ఏదో ఒకరోజున ఇంత చలివిడి ముద్ద చేసి ఇచ్చింది. ఇదిగోనయ్యా నైవేద్యం పెట్టుకో అంది. ఆయన దాన్ని తీసుకొచ్చి **శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం** అన్నాడు. శుక్లాంబరధరం తెల్లగా ఉంటాడు విఘ్నేశ్వరుడు. ఈ చలివిడి ముద్దలాగే అనిపించింది. ఆయన పళ్ళెంలో పెట్టి దానికొక తలకాయ పెట్టి చిన్న తొండం పెట్టి బొజ్జ, కాళ్ళు దానికిందకెళ్ళిపోయాయి కనపడేదేముంది. కొంచెం ఇలా ఇలా అంటే రెండు పాదాలు పెట్టి దానికి పూజ చేసేశాడు. అంతా అయిపోయిన తరువాత నైవేద్యం పెట్టాలి ఏదీ? మళ్ళీ చలివిడి పట్రావే అంటే ఇంకేమైనా ఉందా? అందుకని మళ్ళీ చలివిడి పట్రా అని అడగలేక ఆయనేం చేశాడంటే, అయ్యో, అయ్యో, చలివిడంతా విఘ్నేశ్వరుణ్ణి చేసి, పూజ చేసేశాను.

ఇప్పుడు నైవేద్యం పెట్టడానికి చలివిడేది? అందుకని ఏమనుకోకండి విఘ్నేశ్వరా అని ఆయన బొజ్జ గిల్లి కొంచెం చలివిడి ఇక్కడ పెట్టి నైవేద్యం పెట్టాడు. ఆయన బొజ్జ గిల్లి చలివిడి ఆయనకే పెట్టినట్టు పరమేశ్వరుడు ఇచ్చిందే పరమేశ్వరుడికి నివేదన చెయ్యాలి తప్ప నువ్వు సృష్టించిందీ, తేగలిగిందీ ఉందేమిటి లోకంలో? లేదు.

అందుకే అంటారు శంకరులు శివానందలహరిలో –

**గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే**
**విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః ।**
**సమర్ప్యైకం చేత స్సరసిజ ముమానాథ భవతే,**
**సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో ॥**

ఎక్కడో తిరుగుతాడు. సరోవరాల్లో తిరుగుతాడు, పర్వతాల్లో తిరుగుతాడు. పర్వతాలెక్కుతాడు, చెట్లెక్కుతాడు. ఎవడు తెమ్మన్నాడురా ఇవన్నీ. తెచ్చావు మంచిదే నీ మనసు పెట్టావా? నీ మనసు పెట్టనిదానికి నాకివన్నీ తీసుకొచ్చి నాకిస్తే నాకు కావాలా? అవన్నీ నావి కావూ? నాది నాకిస్తే గొప్పేముంది? మా ఇంటికొచ్చి మా బీరువా తీసి బాగా అంచున్న పంచె ఒకటి తీసి మీ కోసమే, మీ పంచెల చాపుల్లోంచి ఒకటి తెచ్చానని చెప్పి పంచె ఒకటి ఇచ్చారనుకోండి. నేనేం పొంగిపోతానేమిటి? అది నా పంచే. కానీ ఏమండీ. నా దగ్గర ఇప్పటికీ పంచెలచాపు లేదు. ఇది నేనే ఇచ్చానని ఇచ్చేస్తున్నాను, ఇంత అంచు పంచె మీకిస్తున్నానని సంతోషంగా ఇచ్చారనుకోండి. మీ ప్రీతికి మీరే ఇచ్చారని నేను సంతోషపడతాను. అవునా, కాదా? అంతే. ఎవరో గడుసు భార్య తన భర్తతో ఒక వంద రూపాయలివ్వండి మీ జీతం వచ్చాక ఇస్తానంది. అలా భగవంతుని కివ్వగలిగిందేముంటుంది. భగవంతుని కివ్వడానికేముండదు. ఆయన సృజించిన దానిలోనుంచే ఆయనకివ్వాలి. మనసు ఆయనకివ్వవలసి ఉంది. ఆ నివేదన. ఆవిష్కారం. భగవంతుని ముందు త్రికరణశుద్ధిగా ఆవిష్కరించడం. అదీ అందుకని నైవేద్యం వచ్చింది. మనకు రసేంద్రియం ఇచ్చాడు కాబట్టి ఆయనకు ఒక పండో, ఫలమో నైవేద్యం పెడతాం. కృతజ్ఞత. ఇక ఆయన మనకి చెవులిచ్చాడు. చెవులు, ముక్కు ఇచ్చాడు.

ముక్కు. ముక్కు వాసన. ఆయన వాసనని మనకిచ్చాడు కాబట్టి ఎన్ని వాసనలు చూడగలుగుతున్నామో! అసలు వండిన పదార్థం తినడం ఒక ఎత్తు. వాసన పీల్చెయ్యడం ఒక ఎత్తు. అబ్బా, ఇవాళ ఏం వండుతున్నావే, పులుసు ఘుమఘుమ లాడిపోతోందంటాడు భర్త ఇక్కడే. ఎంత సంతోషపడిపోతుందో ఆ ఇల్లాలు. వాసనచేత ఎంత తృప్తి పొందుతున్నావు. పువ్వుల వాసన చూసి ఎంత ఆనందపడి పోతున్నావు. అన్ని వాసనలు పీల్చడానికి మనకి పరమేశ్వరుడు అనుగ్రహించాడు కనుక ఆయనకి సుధూపః ధూపం వేస్తాం. ధూపం వేయడమంటే ఇలా ఇలా తిప్పమని కాదు. వాసన చూడ్డానికి ముక్కు దగ్గర ఇలా పెట్టి తీసేస్తే చాలు. పొగ అలముకుంటుంది. ఏది మీరు ఉపచారం చేస్తున్నారో అది మనసు పెట్టి చేశారూ లేదూ అన్నది తెలిసిపోతుంది. ఆయనకి సుధూపః ఆయనకి ముక్కుతో పీల్చాల్సిన దానికి ఇలా ఇలా ఎందుకు? ఆ తిప్పడమేమిటి? అంటే నీకు మనసు లేదు. నీవు ఎందుకు చేస్తున్నావో తెలియదు. ఏదో చెయ్యాలి. వాడు తిప్పాడు, నేను తిప్పాను. కాబట్టి గుళ్ళో తిప్పారు. ఇలా అన్నిచోట్లా తిప్పారు. ప్రతీవాడికీ ధూపమంటే తిప్పేయాలి తప్ప, అరే ధూపమంటే ముక్కుతో పీలుస్తాడురా. మనం వాసన చూస్తున్నాం కాబట్టి, అవకాశం మనకిచ్చాడు కాబట్టి మనం కృతజ్ఞత చెప్తున్నాం. అందుకని ఆయనకి ధూపం వేస్తున్నాం. ముక్కు దగ్గర ఇలా పెట్టి తీసేస్తే చాలు. ఓ కట్ట వెలిగించి వీడు రెండు నిమిషాలు పూజ చేసి తలుపేసి వచ్చేస్తాడు. ఆయనా ఊపిరాడక అవి ఎప్పుడైపోతాయా అని చూస్తూ ఎంత గిజగిజలాడిపోతారు. అసలు నీకా భావనేదీ? అసలు పూజా మందిరంలో నువ్వు పూజించేవాడు ప్రాణంతో ఉన్నాడు. వాడు పరమేశ్వరుడు. వాడు నీ పూజ అందుకుంటున్నాడన్న భావన నీకుంటే తుంటరి పనులు చెయ్యం.

వెనకటికి ఎవరో పిల్లాడు విఘ్నేశ్వరుడికి పూజ చేశాడు. ఒక్క మార్కూ రాలేదు. నీకు పూజెందుకని అది తీసి ఆ పక్కనెట్టాడు. సరస్వతీదేవికి చేశాడు. రెండు మార్కులు కూడా రాలేదు. అక్కడ పెట్టేశాడు. శివుణ్ణి తీసుకొచ్చి అక్కడెట్టాడు. ధూపం వేశాడు. ఈ సారైనా వస్తాయేమో చూద్దామనుకుంటున్నాడు. ఈయన చేస్తున్నాడు ఇంకా పూజ. అగరొత్తులు అక్కడ పెట్టి కళ్ళు మూసుకుని ధ్యానం చేసి చూశాడు. ఈ అగరొత్తుల పొగ అలా వెళ్ళింది. విఘ్నేశ్వరుడు,

సరస్వతీదేవి దగ్గరకెళ్ళింది. ఆయనకి ఎక్కడలేని కోపం వచ్చి గబగబా వెళ్ళి, విఘ్నేశ్వరుడి ముక్కుకో గుడ్డా, సరస్వతీదేవి ముక్కుకో గుడ్డా కట్టాడు. ఒక్క మార్కు వేయించలేదు కానీ అగరొత్తులు పీల్చేస్తున్నారా ఇక్కడ కూర్చుని అని. వాళ్ళిద్దరూ ప్రత్యక్షమయ్యారు. అదేమిటీ, పూజ చేస్తే ప్రత్యక్షమవ్వలేదు. ముక్కులకి గుడ్డలు కడితే ప్రత్యక్షమయ్యారు? నువ్వెప్పుడైనా మేము ఉన్నామని పూజ చేస్తే కదరా? విగ్రహమని చేశావు. విగ్రహం లాగానే ఉన్నాం. ఇవాళ మేము అగరొత్తుల పొగ పీల్చేస్తున్నామని మేము ఉన్నామని నమ్మి ముక్కుకి గుడ్డ కట్టావా, ప్రత్యక్షమయ్యామన్నారు. నువ్వు ఉన్నాడని భావిస్తే కదూ ఉండడం. అది విగ్రహమని నువ్వు కట్టలు, కట్టలు వేసి అర్థంలేని పూజ చేసేసి. ఒక్కొక్కడు పూజ చేస్తే నిజంగా ఆ పెళ్ళాం ఎంత కష్టపడాలో. నీళ్ళు చిమ్మేస్తాడు. వరదలు. పూజ చేసి లేచిపోతే పూజకి కూర్చున్నప్పుడు ఎలా ఉందో అలా ఉండాలి. అంత అందంగా చెయ్యాలి పూజంటే. అంత చక్కగా ఉండాలి పూజంటే. అలా చేసింది పూజ. అంత నిండు మనసుతో చేసింది పూజ. కాబట్టి నీకు వాసన చూసే అధికారమిచ్చాడు. ధూపం వేశావు. పరమేశ్వరుడు ఎన్ని శబ్దాలు వినడానికి అధికారమిచ్చాడో. అసలు శబ్దమే మనిషి జీవితం పండడానికి కారణం. వినడంవల్లే కదూ జ్ఞానం కలుగుతుంది!

**శృణ్వంపః అని. భద్రం కర్ణేభి స్సృణ్యామ దేవాః** మా చెవులు భద్రంగా ఉండుగాక. మంచి మాటలు మా చెవిని పడుగాక అని కోరుకుంటారు. అటువంటి చెవులిచ్చాడు. ఎన్నో వింటున్నాం. అందుకని ఆయనకి కృతజ్ఞతగా పువ్వులతో పూజ చేస్తాం. మీరు నన్నొకటి అడగవచ్చు. కంటికీ, దీపానికీ సంబంధముంది. ముక్కుకీ ధూపానికీ సంబంధముంది. చర్మానికీ గంధానికీ సంబంధముంది. నాలుకకీ నైవేద్యానికీ సంబంధముంది. చెవుకీ పువ్వుకీ సంబంధమేముందండీ అని అడగవచ్చు. పువ్వు ఎక్కడుందో ఆ పువ్వు కోసమే తుమ్మెదలన్నీ ఝుంకారం చేస్తూ వెళతాయి. పువ్వు దగ్గరికి వెళ్ళి నిశ్శబ్దంగా వాలి మకరందాన్ని పీలుస్తాయి. నేను గిన్నెలో తీసుకెళ్ళి అక్కడ మకరందం పెట్టినా అది వాలి తీసుకోదు. భ్రమరాల ఝుంకారాలన్నీ పువ్వుల కొరకే కాబట్టి అవి పువ్వులవే తప్ప ఇంకొకరివి కావు.

మీరు నేను వస్తున్నానని చెప్పి నాకు విడిదిచ్చి ఒక గది పెట్టి ఆ గదిలో నేను పళ్ళు తోముకోవడానికి ఒక బ్రష్షు, పేస్టు దగ్గర్నించి అన్నీ అక్కడ పెట్టారు. ఇప్పుడు నేను వాడుకున్నానా, వాడుకోలేదా అనవసరం. అవన్నీ ఎవరివి? నావే. వాడుకున్నా నావే, వాడుకోకుండా వదిలేసినా నావే. వెళ్ళిపోతూ అవి నేను వాడుకోలేదు ఇంకెవరికైనా వినియోగించండి అని చెప్పి వెళ్ళిపోతేనే అవి మీవి. లేకపోతే నావే. నేను పట్టుకెళ్ళిపోయినా దోషంలేదు. నా కొరకిచ్చారు కాబట్టి నావే. అవునా, కాదా? అలా అంటే ఏమండీ మీకు గది ఇస్తే మంచాలు కూడా పట్టుకుపోతారా అనుకోకండి. నేన్నది మీరు అంటారు. అలా అర్థం చేసుకొమ్మని కాదు. ఉపమానాన్ని ఉపమానంగా అర్థం చేసుకోవాలి దాని ప్రయోజనం వరకు. కాబట్టి భ్రమరాల ఝుంకారాలు పుష్పాలవి. కాబట్టి పుష్పాలకు శబ్దాలున్నాయి. పుష్పాలతో పూజ శబ్దాన్ని వినడానికి. ఈశ్వరుడు చెవులిచ్చినందుకు కృతజ్ఞత.

అందుకని పంచ సంఖ్యోపచారిణి అని లలితాసహస్రంలో అమ్మవారికి పేరు. అయిదు ఉపచారాలచేత ప్రీతి పొందుతుంది. ఏమిటవి? గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాలు. ఈ అయిదూ ఎందుకంటే అమ్మవారికి. ఈ అయిదూ మనకిచ్చి అమ్మవారు తృప్తి పొందడానికి అనుగ్రహించింది కాబట్టి ఆమెకి అయిదు ఉపచారాలు. కాదు. ఆవిడ ఇంకా చాలా ఇచ్చింది. పడుకోడానికి మంచమిచ్చింది, పరుపిచ్చింది, కొడుకునిచ్చింది, కూతుర్నిచ్చింది, కన్యాదానం చేసుకునే అవకాశమిచ్చింది. కొడుక్కి స్నాతకం చేసి ఉపనయనం చేయడానికి అవకాశమిచ్చింది. కారిచ్చింది, కారులోకి పెట్రోలు కొనుక్కోవడానికి డబ్బిచ్చింది. ఇల్లిచ్చింది. ఫ్యానిచ్చింది. ఏ.సి ఇచ్చింది. పడుకుంటే ఆలౌట్ ఇచ్చింది. ఆవిడ ఇవ్వనిదేముంది? అన్నీ ఇచ్చింది. అన్నీ ఇచ్చింది కాబట్టి షోడశోపచారాలు.

కాదు **చతుష్షష్ట్యుపచారాఢ్యా**- అరవైనాలుగు ఉపచారాలు. ఆమె నీకు ఎన్నిచ్చిందో నువ్వన్ని ఉపచారాలు చెయ్యొచ్చు నీకు మనసుంటే. కనీసంలో కనీసం నీవు సుఖాలను అనుభవించడానికి హేతువులైన శబ్ద, స్పర్శ, రస, రూప, గంధాలు అయిదింటికీ కృతజ్ఞత ఆవిష్కరించడానికి గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాలను కూడా పెట్టని ఇల్లు కృతఘ్నుల ఇల్లు. కాబట్టి ప్రతి ఇంటా పూజ అన్న మాటకి అర్థమేమిటంటే మనస్సు, వాక్కు, వాటితోపాటుగా కర్మేంద్రియాలు ఏకీకృతమవ్వాలి. అయితే పూజ చేస్తున్నాడు అని పిలుస్తారు.

అందుకే మీరు చూడండి పూజలో ఏం చేస్తారంటే, మీ మనస్సుని నిలబడేటట్లుగా చెయ్యడానికి మీరు మీ ఇంటికొస్తే మహాత్ములకు ఏం చేస్తారో అదే చేస్తారు. మహాత్ముల మాట పక్కనబెట్టండి. మా తమ్ముడొచ్చాడనుకోండి నేను కూర్చుని ఉన్నాను. అకస్మాత్తుగా మా తమ్ముడొచ్చాడు. నేను లేచి ఏమంటాను, ఒరే ఒరే ఎప్పుడొచ్చావురా, ఏమిటి అకస్మాత్తుగా వచ్చావు రా, రా, రా అని ఎలా వచ్చావు? అన్నయ్యా, అన్నయ్యా నిన్ను చూడాలనిపించిందన్నయ్యా రాత్రి జనరల్ కంపార్టుమెంట్ ఎక్కి వచ్చాశానన్నయ్యా అంటే, అయ్యయ్యో ఎంత పని చేశావురా వెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కో ముందు, స్నానం చెయ్యి ఒక తువ్వాలు ఇవ్వవే వాడికి అని, స్నానం చేసిరా అంటే అన్నయ్యా బట్టలు కూడా పెట్టుకోలేదన్నయ్యా ఆఫీసు నుంచే రైలెక్కేశాను. దానికి ఫోన్ చేసి చెప్పాను మా అన్నయ్యని చూడాలనిపిస్తోంది వెళ్ళిపోతున్నానని. ఏం ఫరవాలేదురా నా పంచొకటి ఇయ్యి వాడికి అని పంచొకటిస్తాను. రా, రా కాస్త ఫలహారం చెయ్యి అని ఫలహారం పెడతానా. ఇవన్నీ నాకు ప్రేమ ఉంటేనేనా నేను చేస్తున్నాను. ఈశ్వరుడి విషయం అంతే. ఆవాహయామి రండి ఈశ్వరా కూర్చోండి. ఆవాహయామి అయిపోయింది. మంత్రం వెంటనే గబగబా చదివెయ్యమని కాదు. ఆవాహయామి ఆగాలి. ఆగితే పూజ. లేకపోతే తంతు. ఏదీ ఆయన కూర్చుంటాడు. ఆయన పట్టుపంచె కట్టుకుని వచ్చి కూర్చుంటే పాదపీఠం ఉంటుంది కింద. ఒక కాలు మడిచి, కుడికాలు దింపి ఆయన పాదపీఠం మీద పెడితే నీకు కనబడాలి ఆయన పాదం. ఆ పాదం కనబడితే, తెల్లటి గోళ్ళు కనబడితే రెండు చేతులతో చూసి నువ్వు తలవంచి తాకించి నమస్కరించి,

**ఏకంజన్యం చ నతిక్షమం మపరం చ ఆకుంచ పాదాంబుజం మధ్యే: విష్కర పుండరీక మభయం విన్యశ్చ హస్తాంబుజం త్వాం పశ్యేన విషేదుషిం ప్రతి కలంకారుణ్య కూలంకషా స్వారాపాంగ తరంగ మంబ మధురం ముగ్ధం ముఖం బిభ్రతీం**

అంటారు పరాశర భట్టారకులు శ్రీగుణరత్నకోశంలో. ఏదీ స్వామీ, రెండు పాదాలకు పూజ చేద్దామనుకుంటున్నాను, కిందకు దింపండి అంటే ఆ కుంచితపాదాన్ని కూడా కిందికి దింపి పాదపీఠం మీద పెడతాడు. పెట్టి కూర్చుని

అమ్మవారూ, అయ్యవారూ కూర్చుంటే ఆయన వచ్చి కూర్చుని పాదపీఠంమీద పాదాలు పెట్టింది నీ మనసులో కనబడాలంటే **'ఆవాహయామి'** ఆగాలి. ఆయన కదలికలు కనబడాలి. **పాదయోః పాద్యం సమర్పయామి** స్వామీ కాళ్ళు కడుక్కోండి. ఆయన రెండు పాదాల మీద, అమ్మ పాదాల మీదా నీళ్ళు పోసి నీ ఉత్తరీయంతో తుడిచావు. **హస్తయోః అర్ఘ్యం సమర్పయామి** వాళ్ళిలా నాలుగుచేతులూ చాపితే స్వామీ, అమ్మా నువ్వు నీ చేత్తో ఆ ఉద్ధరిణితో నీళ్ళుపోస్తే వాళ్ళిలా అంటే నువ్వు నీ పైబట్ట తీసి వాళ్ళ చేతులు, వాళ్ళ చేతుల కింద నీ చెయ్యి వేసి పైన నీ బట్టతో ఇలా తుడిస్తే అమ్మవారి ఉంగరాలు, అయ్యవారి ఉంగరాలు నీ అరిచేతికి నొక్కుకుంటుంటే, నువ్వు మెత్తగా తుడిచి పొడి ఆరిపోయిన తరువాత వాళ్ళిలా దగ్గరికి పెట్టుకుంటే అప్పుడు **ముఖేః ఆచమనీయం సమర్పయామి** మూడుమాట్లు నీళ్ళు పుచ్చుకోండి. ఆచమనం నువ్వు చేస్తే మూడు మాట్లా, ఈశ్వరుడికైతే తమలపాకు చివరితో ఇలా దులిపావా. ఏమిటి నీ పూజ? నువ్వు పూజ చేశావని ఎలా అంగీకరించను నేను? మూడు మాట్లు ఇలా వేస్తే ఆయన ఇలా పుచ్చుకుని లోపలికి పుచ్చుకుంటే ఆయన చెయ్యి కదిలితే, కంకణాలు కదిలితే ఆయనిలా చెయ్యి పైకెత్తితే ఆయన ఉంగరాల కాంతులు నీకు కనబడుతుంటే అమ్మవారి చెయ్యి, గాజులు కనబడితే అప్పుడు ఆయనిలా పుచ్చుకుని మళ్ళీ ఇలా అంటే మూడుమాట్లు వేస్తే, మూడుమాట్లు పుచ్చుకుంటే ఆయన చేతులు నువ్వు తుడిస్తే కడిగి అప్పుడైంది ఆచమనీయం. ఏదీ ఎక్కడాగావు నువ్వు? ఒక్క ఉపచారానికి నువ్వు ఆగావా? ప్రతి ఉపచారం యాంత్రికమే, ప్రతి ఉపచారం తంతే, ఏం పూజ చేశావు? పూజ పేరుతో నటన చేశావు. పూజ చేయలేదు. చేసి నిజమైతే ఆగాలి ఉపచారం దగ్గర. ఎక్కడ ఆగావు? ముఖేః ఆచమనీయం సమర్పయామి. స్వామీ స్నానం చెయ్యండి.

**ఆపో హి ష్ఠా మయోభువ, స్తాన ఊర్జే దధాతన మహేరణాయ చక్షసే.**
**యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః, ఉశతీ రివ మాతరః.**

– అంటూ పైకి మంత్రం నడుస్తుంది. నువ్వు కళ్ళు మూసుకుంటే వాళ్ళు స్నాన సాకీలు కట్టుకు కూర్చుంటే నువ్వు అభిషేకపాత్ర పట్టుకుని గోరువెచ్చటినీళ్ళు వాళ్ళ తలమీద నుంచి పోస్తుంటే శంకరాచార్యులవారంటారు **ప్రాతః స్మరామి** అని.

**ఆ తల్లి దిగ్గస్తిభిః కనక కుంభ ముఖావసృష్ట**
**స్వర్వాహినీ విమల చారు జలప్లుతాంగీమ్**
**ప్రాతర్నమామి జగతాం జననీమ శేష**
**లోకాధినాథః గృహిణీం అమృతాబ్ధి పుత్రీమ్–**

అంటారు. ఆ తడిసిపోయిన బట్టలతో ఉన్న పార్వతీపరమేశ్వరులను చూసి నువ్వు వాళ్ళ ఒళ్ళు తుడుచుకోవడానికి ప్లోత వస్త్రం ఇస్తే వాళ్ళు ఒళ్ళు తుడుచుకుంటే వస్త్రయుగ్మం సమర్పయామి నువ్వు తీసుకొచ్చి ఇవ్వక్కర్లేదు నీ భార్యకి, మీ అమ్మకి తీసుకొచ్చి ఇచ్చినప్పుడు మంచి బట్టల కొట్టులో పట్టుబట్టలు అట్టపెట్టెలో మొలతాడు కట్టి తెచ్చినట్లుగా భావించి విప్పి ఇలా తీస్తే ఆకుపచ్చటి పట్టుచీర, ఎఱ్ఱటి జరీతో ఉన్న చీర అమ్మకిస్తే అమ్మ కట్టుకుని కూర్చుంటే, అమ్మ కొప్పులో పూలు అలంకారం చేసి ఇద్దరి పాదాలు పళ్ళెంలో పెట్టి నీ భార్య బంగారు కలశంతో నీళ్ళు పోస్తుంటే నువ్వు వాళ్ళ పాదాలు కడిగి

**కదా కాలే మాతః కథయ కలితాలక్తకరసం**
**పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజన జలమ్ ।**
**ప్రకృత్యా మూకానా మపి చ కవితా కారణతయా**
**కదా ధత్తే వాణీముఖకమల తామ్బూల రసతామ్ ॥**

అంటారు శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో. నువ్వు ఆ ఉద్ధరిణితో ఆ పాత్రలో ఉన్న నీళ్ళు నీ భార్య నీ చేతిలో వేస్తే పరమశివుడి పాదాలకున్న గంధం, అమ్మవారి పాదాలకున్న లత్తుకా కరిగిన ఎరుపు, పసుపు నీళ్ళు నోట్లో ఇలా పోసుకుంటూ ఉంటే త్రిపురాంతకంలో ఇచ్చిన తీర్థంలా ఘుమఘుమలాడిపోతుంటే ఆ తీర్థాన్ని మూడుమాట్లు లోపలికి పుచ్చుకుని కన్నులు మూతలుపడి చెయ్యి కడుక్కుని పళ్ళెంలో ఉద్ధరిణిలో నీళ్ళుతీసి నీ భార్యకిస్తే ఆమె రెండు రాళ్ళ ఉంగరం పెట్టుకుని, ఒక ముత్యపుటుంగరం పెట్టుకుని, నీ భార్య ఇలా చెయ్యి పడితే ఆమెకి వేస్తే ఆమె తాగితే, నీకు ఇల్లాలై నీకు వంట చేసి పెట్టి నీ గోత్రాన్ని వృద్ధిలోకి తెచ్చి పెట్టి నీకు బిడ్డల్ని కని నీకు శాంతి స్థానమైనందుకు నీ భార్యని నువ్వు ఉద్ధరించవలసిన ప్రక్రియ అది. నువ్వు వాళ్ళ పాదాలు కడిగి, పాదాలు వత్తి వాళ్ళకి లత్తుక అలంకారం చేసి అప్పుడు పుష్పార్చన. ఒక్కొక్క పుష్పంతో చేస్తే అష్టోత్తరం లేకపోతే సహస్రం. మూడొందల డెబ్బై ఏడు, నాలుగు వందల

ఎనభైరెండు నామాలుండవు. ఉంటే నూట ఎనిమిది, లేకపోతే వెయ్యి అంతే. ఏం మధ్యలో అంకె ఎవరికీ రాదా ఋషులకి. కాదు నూట ఎనిమిది నామాలతో పూజ అంటే రహస్యమేమిటంటే నేను సంతోషంగా ఉండాలీ అంటే నేనొక్కణ్ణీ సంతోషంగా ఉంటే చాలదు. నా భార్య, మా అమ్మ, మా నాన్న, నా కొడుకు, నా కూతురు, నా అల్లుడు, నా బంధువులు, నాది విశాలహృదయమైతే యావత్ ప్రపంచం సంతోషంగా ఉండాలి. ఎవ్వరూ బాధపడకూడదు.

ఎవరు పుట్టినా ఇరవై ఏడు నక్షత్రాలలో పుడతారు. అందుకే పుట్టుకా, చావు నక్షత్రం చూస్తారు. ఒక్కొక్క నక్షత్రానికి నాలుగుపాదాలు. ఏదో ప్రథమ పాదం, ద్వితీయ పాదం, తృతీయ పాదం, చతుర్థ పాదం అంటాం కదా! ఒక్కొక్క నక్షత్రానికి నాలుగు పాదాలైతే ఇరవై ఏడు నక్షత్రాలకి ఒక్కొక్క దానికి నాలుగేసి పాదాల చొప్పున ఇరవై ఏడు ఇంటూ నాలుగు, నూట ఎనిమిది పాదాలు. నూట ఎనిమిది పాదాలలో ఈ ప్రపంచంలో ఎన్ని జీవులు పుట్టాయో అవన్నీ సంతోషంగా ఉండాలి. అందుకని నూట ఎనిమిది నామాలతో పూజ. నీకు తృప్తి తీరలేదు వెయ్యి నామాలు. సహస్రం అంటే వెయ్యి కాదు అనంతం. పరవశం ఉంటే చెయ్యాలి. అంత సమయం లేదనుకుంటే పదహారు. లేదనుకుంటే మూడు. కానీ నువ్వు చేసే తత్త్వాన్ని బట్టి చెయ్యాలి. విఘ్నేశ్వరుడికి చేస్తే పదహారు నామాలతో చెయ్యాలి.

**సుముఖ శ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః ।**
**లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ॥**

**ధూమ్రకేతు ర్గణాధ్యక్షో ఫాలచంద్రో గజాననః ।**
**వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబః స్కందపూర్వజః ॥**
**షోడశైతాని నామాని యః పఠేత్ శృణుయాదపి ।**

పరమశివుడికి చేస్తే అష్టమూర్తి తత్త్వం.

**భూరంభాం స్యనలోఽ నిలోఽ ంబర మహర్నాథో హిమాంశుః పుమాన్**
**ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।**
**నాఽన్యత్కించ న విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

ఎనిమిది నామాలతో చేస్తే చాలు

**భవాయ దేవాయ నమః,**
**సర్వాయ దేవాయ నమః,**
**ఈశానాయ దేవాయ నమః,**
**పశుపతే దేవాయ నమః,**
**రుద్రాయ దేవాయ నమః,**
**ఉగ్రాయ దేవాయ నమః,**
**భీమాయ దేవాయ నమః,**
**మహతే దేవాయ నమః.**

ఆవిడకి చెయ్యాలన్నా **భవస్య దేవస్య పత్నే నమః.** మళ్ళీ ఇవే పక్కన పత్నీ పెట్టేస్తే ఆవిడకి. ఎనిమిది నామాలతో ఆయనకి, పదహారు నామాలతో శ్రీ మహా విష్ణువుకి చెప్పేస్తే చాలు. అదికూడా నీకు సమయం లేకపోతే

**శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే.**

నిజంగా అంత ముఖ్యమైన పని ఉంటే రామ, రామ, రామ అని అక్షతలు వేసి వెళ్ళిపోతే చాలు. రా రెండు మ అయిదు అంకెల్లోకి మారిస్తే. రామ రామ రామ రెండు ఇంటూ అయిదూ ఇంటూ రెండు ఇంటూ అయిదూ ఇంటూ రెండూ ఇంటూ అయిదు. రెండు అయిదులు పది, పది రెండ్లు ఇరవై, ఇరవై అయిదులు వంద, వంద రెండ్లు రెండు వందలు, రెండు వందల అయిదులు వెయ్యి. **సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే.** విష్ణుసహస్రం, శివసహస్రం చదివి పూర్తి చేసేసినట్లే. కాబట్టి రామ, రామ, రామ అని అక్షతలు వేసి వెళ్ళిపో నీకంత సమయం లేకపోతే.

కోటేశ్వరరావుగారు చెప్పారండీ అని రోజూ రామ రామ రామ అని అక్షతలు వేసెయ్యమని కాదు నా ఉద్దేశ్యం. నీ ఓపికను బట్టి, నీ సమయాన్ని బట్టి, దేశాన్ని, పరిస్థితిని బట్టి పూజ నిర్వహించుకోవాల్సి ఉంటుంది. పూజ అంటే మనసు నిలబెట్టడమే పూజ. దానికి ఈశ్వరుడు ప్రసన్నుడవుతాడు.

పదార్థంచేత కాదు, నిజానికి నీ మనస్సు చేత ప్రసన్నుడవుతాడాయన. అటువంటి పూజాప్రక్రియయందు మా ఇల్లు చిన్నదండీ. మేం పూజామందిరం ఎక్కడ పెట్టుకోవాలండీ అని పూజ నుంచి తప్పించుకోవడాన్ని శాస్త్రం మినహాయింపు ఎవ్వరికీ ఇవ్వలేదు. అంగుష్ఠమాత్రవిగ్రహాన్ని పూజ చెయ్యాలి. బొటన వేలంత విగ్రహం కన్నా పెద్దది పూజామందిరంలో ఉండడానికి వీల్లేదు. ఎవరో పెద్ద పెద్ద ఉపాసకులైతే తప్ప. నీకు అంత అవకాశం లేకపోతే పూజని ఎంత దగ్గర చేశారో తెలుసా? పరమశివుడికి ఒక్క పూజ అంటే పరమశివ సంబంధమైన సాలగ్రామం మనకు నర్మదానది ఓంకారకుండంలో దొరుకుతుంది. బాల లింగం అంటారు. ఒక సాలగ్రామాన్ని తెచ్చుకుని ఓ చిన్న పళ్ళెంలో పెట్టి అలాగే అమ్మవారు శ్రీకాళహస్తి దగ్గర ఉన్న సువర్ణముఖీనదిలో సువర్ణముఖీసాలగ్రామమని ఉంటుంది. లోపల బంగారు తీగెలా ఉంటుంది. ఆ సాలగ్రామాన్ని తీసుకొచ్చి పళ్ళెంలో పెడితే అమ్మవారు. షోణానదీ దగ్గర దొరికే షోణభద్రా అనే సాలగ్రామాన్ని చిన్నది తెచ్చుకుని పెట్టుకుంటే విఘ్నేశ్వరుడు. అలాగే మనం గండకీనది నేపాల్‌లో దొరికే సాలగ్రామాన్ని చిన్నది తెచ్చి అక్కడ పెడితే శ్రీమహావిష్ణువు. అలాగే తంజావూరు దగ్గర ఉండే వల్లమ్మన్ అనే ఊరిలో దొరికే స్ఫటిక సాలగ్రామం ఉంటుంది తెల్లగా చిన్నది. అది తెచ్చి పళ్ళెంలో పెట్టుకుంటే ఒక సాలగ్రామం. పంచాయతన పూజ అని శంకర భగవత్పాదులు నిర్ణయించారు. మీకు ప్రధానదేవత ఎవరో ఆయన్ని మధ్యలో పెడతారు. మిగిలిన వాళ్ళు నాలుగు పక్కలా ఉంటారు. ఎవరు ఏ స్థానాల్లో ఉండాలన్నది మాత్రం కొంచెం చూసుకోవాలి. నేను సూర్యుణ్ణి ఆరాధిస్తాననుకోండి స్ఫటికాన్ని మధ్యలో పెట్టి సాలగ్రామాన్ని మిగిలిన నాలుగూ చుట్టూ పెడతాను. నేను గాణాపత్యం అనుకోండి గణపతిని మధ్యలో పెట్టి శివ, అంబిక, విష్ణు, ఆ పక్కన సూర్యుణ్ణి పెడతాను. నేను శివారాధకుడిననుకోండి శివుణ్ణి మధ్యలో పెట్టి విష్ణువు, గణపతి, సూర్యుడూ, అంబికా పెడతాను. ఈ అయిదే పంచాయతన పూజ.

ఇంట్లో అనారోగ్యం ఎవరికీ లేకుండా సూర్యుడు. విఘ్నాలు రాకుండా విఘ్నేశ్వరుడు. స్థితికారుడై రక్షణకు విష్ణువు. జ్ఞానప్రదాత శివుడు. సమస్తమైన కదలికలను నియంత్రించే శక్తి స్వరూపిణి పరదేవత. సుబ్రహ్మణ్యస్వరూపం

అగ్నిహోత్రం, నీరాజనం. హారతి సుబ్రహ్మణ్యుడు. పూజంతా పూర్తయిపోతుంది. నా ఇంట మందిరం లేదు, చోటు లేదని తప్పించుకోవడానికి అంగీకరించలేదు. ఎంతోసేపు కూడా అక్కరలేదు. అయిదు సాలగ్రామాల్ని చిన్న భరిణ కొనుక్కొని, ఆ భరిణెలో పెట్టేసి మళ్ళీ పొద్దున్న లేచి నీళ్ళతో తడిపి తుడిచేసి బొట్టు పెట్టేసి అయిదింటినీ పెట్టేసి ఎండిపోయిన మారేడు దళాలు, ఎండిపోయిన తులసి దళాలు ఒక చిన్న డబ్బాలో పెట్టుకుని తీసి నామాలతో వేసేసి, ఎండిపోయిన కిస్‌మిస్ పళ్ళో, చిన్న బెల్లం గడ్డ నైవేద్యం పెట్టి నువ్వు మూత పెట్టేసి ఆ చిన్న డబ్బా తీసికెళ్ళి గూట్లో పెట్టేసినా తప్పులేదు. పూజ మానేస్తే మాత్రం ద్రోహం. నువ్వెలా చేశావు? ఎక్కడ చేశావని శాస్త్రం అడగలేదు. ఇంత భరిణెలో అయిదు సాలగ్రామాలు పెట్టుకుని పూజ చెయ్యొచ్చు.

శంకర భగవత్పాదులంతటివారు అంగీకరించారు పంచాయతన పూజ, ప్రతిపాదన చేశారు. వాటికి విగ్రహాలైతే అక్కడక్కడ కొంచెం సన్నసన్నగా ఉంటాయి. వాటిని తుడవటమదీ చాలా కష్టం. నిత్యాభిషేకం చాలా కష్టం. వాటికేముంది పళ్ళెంలో పెట్టి ఇలా నీళ్ళు పోసి ఒలికిపోకుండా గిన్నెలోకి పోసేసి అయిదింటినీ తీసి పొడిబట్టతో తుడిచేసి కాస్త గంధం తీసి రాసేసి బొట్టు పెట్టేసి నాలుగు అక్షతలు వేసేసి కిస్‌మిస్ పళ్ళు నైవేద్యం పెట్టి డబ్బాలో పెట్టి మూత పెట్టేసి నువ్వు తీసికెళ్ళి మీ ఇంట్లో పర్సూ అవీ దాచుకునే చోట భరిణె కూడా పెట్టేసుకున్నా కూడా, నన్ను నమ్మండి, తప్పుకాదు పూజే. మీకు ఎంత ఉందీ అని కాదు నీ మనసున్నదా? అది ప్రధానం. ఇంక ఇంతకన్నా ఈశ్వరుడు నీకేమిటి చేసి అవకాశమివ్వాలి పూజ చెయ్యడానికి? ఏమండీ గండకీనది అన్నారు, తంజావూరు అన్నారు ఇవన్నీ మాకెక్కడ తెలుసు? మేమెక్కడ తెచ్చుకోం ఈ సాలగ్రామాలంటావా, అయిదు చిన్న చిన్న మూర్తులు, చిన్ని చిన్ని మూర్తులు నుంచోపెడితే పడిపోతాయనుకుంటే అయిదింటిని పడుకోబెట్టి భరిణెలో పడుకోబెట్టి పూజ చెయ్యి. నిన్ను ఈశ్వరుడు కాదంటే నేనున్నాను. ఆయననడు. ఆయన అంగీకరిస్తాడు. మనసు ప్రధానం. నీకు చెయ్యాలన్న ఆర్తి ప్రధానం. ఆర్తి ఉంటే నువ్వు పూజ చెయ్యవచ్చు. ఆ పూజ అంత గొప్పది. అందుకే పూజనివేదనం నైవేద్యం. నైవేద్యమంటే అన్నీ ఈశ్వరుడికి చెప్పుకోవడం.

నేను నా కూతురికి పెళ్ళి సంబంధం మాట్లాడడానికి బయలుదేరుతున్నాను. నేనెవరికి చెప్పాలో తెలుసా? పూజామందిరంలోకెళ్ళి ఈశ్వరా, కూతుర్నిచ్చారు, కూతురికి పెళ్ళి నిర్ణయం చెయ్యడానికి వెళుతున్నాను మాట్లాడడానికి, మీరు కూడా నా వెంట రండి, మీరు పెద్దలు మాకు. మీరు కూడా నా వెంట వచ్చి నా చేత మంచి మాటలు మాట్లాడించండి. నా కూతురి అభ్యున్నతికి తగిన సంబంధమైతే నిర్ణయం చేయించండి అని నువ్వు ఈశ్వరుణ్ణి నీ వెంట పిలవాలి. నేనిక్కడ ఉపన్యాసాలు చెప్పి ఇంటికెళతాను, ఇంటికెళ్ళిపోయి గబగబా ఎక్కడికో వెళ్ళకూడదు. కాళ్ళూ చేతులు కడుక్కుని సింహాసనం దగ్గరికి వెళ్ళి ఈశ్వరా, ఏ ఇబ్బందీ లేకుండా నెల్లూరు తీసుకెళ్ళావు. నాకేమీ రాదు. నన్ను నీచేతి పనిముట్టుగా స్వీకరించి మూడు రోజులు నాతో మాట్లాడించారు. పాపం పిచ్చివాళ్ళు, ఎంత దగ్గర దగ్గరగా కూర్చున్నారో నీ మీద భక్తితో తండ్రీ. ఇదంతా మీ అనుగ్రహం. నన్ను మీచేతి పనిముట్టుగా అలాగే ఉంచండే అని ఒక నమస్కారం పెట్టి వెళ్ళి స్నానం చేసి పూజకి రావాలి. అంతేకానీ అసలు పూజ గదిలోకి వెళ్ళకపోతే? నిన్ను చూసినవాడు వాడు, పలికించినవాడు వాడు. నీకు ఆర్తి ఉండవద్దూ చూద్దామని. ఏం మీ ఆవిణ్ణి చూడ్డానికి ఉత్సాహమా! కూతుర్ని చూడ్డానికి ఉత్సాహమా! ఏదీ నీ తండ్రిని చూడ్డానికి ఉత్సాహమేదీ? పెద్ద పండగొస్తోంది బట్టలు కొనుక్కుంటున్నావు ఇంట్లో అందరికీ. నీ సింహాసనంలో ఉన్న స్వామికో డెబ్బై రూపాయలు పెట్టి పంచెలచాపు, అమ్మకో అరవై రూపాయలు పెట్టి చీర కొను. మీ అందరికీ బట్టలా. అయనకెప్పుడు పత్తితో ఇంత వస్త్రయుగ్మమా. ఏం ఓ నూట యాభై రూపాయలు పెట్టి వాళ్ళిద్దరికీ ఓ ముతక పంచైతే ఆయన కాదన్నాడా? ఒక ముతక పంచె, ఒక ముతక చీరా పెట్టు. అమ్మా పండగ కదూ మీరు కట్టుకోవాలని తెచ్చా. పెద్దవాళ్ళు కదూ ముందు మీకిస్తున్నాను మీరు కట్టుకోండి. పిల్లలు స్నానం చేస్తున్నారు. నేనూ వెళ్ళి కట్టుకుంటాను అని వాళ్ళిద్దరికీ బట్టలు పెట్టు. వాళ్ళు పరవశించి పోతారు.

కైలాసంలో పరమేశ్వరుడు సరిపోయినా, సరిపోకపోయినా ఆ పంచె కట్టుకుని, నా తల్లి పరదేవత ఆ చీరె కట్టుకుని కూర్చుంటుంది. కూర్చుని పొంగిపోతారు వాడిచ్చాడురా మనకి అని. సరిగంచు పట్టుచీర ఇవ్వగలిగిన శక్తిని నీకిస్తారు. కృతజ్ఞత, కృతజ్ఞత మనసు ప్రధానం. మనసు లేకుండా ఎన్ని తెచ్చి అక్కడ

పెట్టండి ఈశ్వరుడు కాలితో తంతాడు. ఇవన్నీ నేను సృష్టించినవి మనసేదిరా అంటాడు. పూజయందు కృతజ్ఞత. పూజయందు నివేదన. అది ఎక్కడివరకూ వెళ్ళాలంటే ఏది చేస్తున్నా ఆయన స్మరణలో ఉండాలి. ఏమీ చేతకాని గొల్లకాంతలు తలమీద నీటిబిందె పెట్టుకుని వెళ్ళిపోతూ ఉంటారు. చేతులూపుకుంటూ, మాటలు మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ వెళ్ళిపోతుంటారు. వాళ్ళు వెళ్ళిపోతూంటారు కానీ అడుగుతీసి అడుగువేస్తున్నపుడు ఎక్కడైనా తడబడితే రెండు చేతులూ కడవని పట్టుకుంటాయి. కడవమీద దృష్టి ఉన్నట్లూ, ఇంట్లో పనిచేస్తున్న దాసి ఇంటిలోని పిల్లవాడు ఏడుస్తాడేమో పాలివ్వాలని గబగబా పనిచేస్తూ తన పసిపిల్లవాడిమీద మనసు పెట్టుకున్నట్టు. ఏ కదలికలూ లేకుండా తాను శాంతిగా ఉండి బయట ప్రపంచాన్ని గరిపిన దక్షిణామూర్తిలా నువ్వు లోపల పరమేశ్వరుణ్ణి పట్టుకుని పైన ప్రపంచంలో తిరుగుతూ ఉండాలి. ఆ స్థితి కలగడం పూజ విస్మృతి. అది చిట్టచివర నీకు ఈ ప్రపంచమంతా పూజామందిరమే. ఎక్కడ చూసినా ఈశ్వరుడే. ఈశ్వరుడు కానిదీ, ఈశ్వరుడు లేనిదీ నీకుండదు. అదిగో ఆ స్థితిని పొందడానికి పూజామందిరాన్ని ప్రాతిపదికగా స్వీకరిస్తారు. నివేదనా – ఆయనకి చెప్పడం అలవాటవ్వాలి. నీ కొడుకు పరీక్షకి వెళుతున్నాడు. తలుపుతీసి ఆయనకి చెప్పాలి పరీక్షకు బయలుదేరుతున్నాడు స్వామీ రక్షించండని. పరీక్షకెళుతున్నపుడు రక్షించమని అడిగావు. ఆ పిల్లాడికి నూట ముప్పై ర్యాంకొచ్చింది సెల్లు తీసి నీ చెల్లెలికి ఫోన్ చేశావు. నీ అన్నయ్యకి ఫోన్ చేశావు. నీ వదినకి ఫోన్ చేశావు. కానీ పూజాగృహంలోకి వెళ్ళి ఆయనకి మాత్రం చెప్పలేదు. నిన్ను పరిపాలించేటట్టుగా చేస్తుంది. అది విగ్రహం నేనే తెచ్చా కాశీ నుంచి అన్నావు, అది విగ్రహంగానే పడుంది. నీ భావనచేత పరమేశ్వరుడు. చెట్టుమీదుంటే కొమ్మ, గూట్లో పెడితే కొమ్మ, పూజామందిరంలో ఉంటే అమ్మ. నీ భావం చేత పరమేశ్వరుడు.

కాబట్టి **యద్భావం తద్భవతి.** ఆ మనసులోంచి పూజ రావాలి. అది పూజ. నాకు సాధ్యమైనంత ఇవాళ మీ అందరికీ విభూతి పెట్టి, బొట్టుపెట్టి, సంధ్యావందనం చేయించి, ఆచమనం చేయించి, సుప్రభాతం పాడించి, పూజామందిరప్రవేశం చేయించి పూజ చేయించాను. నిజానికి నేను చేయించలేదు. ఇంకా నీరాజనం, మంత్రపుష్పం వాటి వైభవం నేను చెప్పలేదు. మనం నిత్యజీవితంలో తప్పకుండా

అనుసంధానం చేసే మాటలు మూడు ఉంటాయి. ఆ మూడు మాటల వెనక ఉండే ప్రాశస్త్యాన్ని తెలుసుకుని ఉండాలి. లేకపోతే ఏదో దోషం వస్తుందని కాదు కానీ, అవి ఎందుకు మనం జీవితంలో అనుసంధానం చేస్తున్నామో అన్న విషయం గురించి ఒక అవగాహన ఉంటే, దానివల్ల వచ్చిన ఫలితం వేరుగా ఉంటుంది. ఈ మూడు మాటలూ నిత్యకర్మానుష్ఠానంలో తప్పుకునే అవకాశముండదు. తప్పకుండా ఈ మూడు మాటలూ ప్రతిరోజూ ఆ పాటి కాస్త భగవంతునియందు విశ్వాసమున్న ప్రతివ్యక్తి జీవితంలోనూ చోటుచేసుకుంటాయి.

ప్రార్థన, స్తుతి, సూక్తం అని మూడు మాటలు. ఈ మూడు మాటల్లో మొదటిదానికి ప్రార్థన అని పేరు. ప్రార్థన అంటే మనం ఆయనని అర్థిస్తాం. ఆయనని ఒక్కసారి సంబోధించి భగవంతుడికి నమస్కారం చేసి మమ్మల్ని కాపాడు అని అడుగుతూ ఉంటాం. ప్రార్థన లేకుండా అసలు జీవితంలో ఒక్కరోజు కూడా వెళ్ళదు. అసలు నిత్యజీవితంలో లేస్తూనే ప్రార్థన. ఎక్కడికన్నా వెళితే ప్రార్థన. ఏదైనా మొదలుపెడితే ప్రార్థన. ఏం చేసినా ప్రార్థన చేసి ప్రారంభం చేస్తాం. అసలు ప్రార్థన అన్నమాటకి అర్థమేమిటి? ఎందుకు ప్రార్థన చెయ్యాలి? అంటే దాన్ని కొంచెం జాగ్రత్తగా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. ఈ శరీరం పరమేశ్వరుడు దేనికొరకిస్తాడంటే, ఇది సుఖదుఃఖాలు రెండూ అనుభవించడానికి ఒక సాధనం. ఇది లేకపోతే సుఖమూ, దుఃఖమూ అన్న రెండూ అనుభవంలోకి రావు. ఇది ఉందనుకోండి సుఖం తెలుస్తుంది. ఏదో ఫ్యాన్ తిరుగుతోందనుకోండి హమ్మయ్య, హాయిగా ఉందండీ అంటాడు. ఫ్యాను తిరుగుతోంటే బాగుంది అన్న సుఖం ఎవరికి అందుతోంది? శరీరం ఉంది కాబట్టి అందుకుంటోంది. ఇదే శరీరానికి మోకాలు నొప్పి పెడుతోందనుకోండి దుఃఖంగా ఉంటుంది. మోకాలు నొప్పెడుతోందండీ చాలా ఇబ్బందిగా ఉందంటాడు. అంటే శరీరం ఉంది కాబట్టి సుఖం, దుఃఖం. ఈ సుఖమూ, దుఃఖమూ అన్నవి రెండూ కలిపి మనుష్యశరీరంలో పరమేశ్వరుడు అనుభవించడానికి ఏర్పాటు చేస్తాడు. కేవలం సుఖమే అనుభవించాలనుకోండి, వాళ్ళు మనుష్యులుగా పుట్టరు, దేవతలుగా పుడతారు. దేవతలుగా ఉన్నారంటే అర్థమేమిటంటే వాళ్ళకి దుఃఖస్పర్శ లేదు అని. వాళ్ళకి దుఃఖముండదు. అందుకే వాళ్ళకి ఆకలి, దప్పిక ఉండవు. దుఃఖం ప్రధానంగా దేనివల్ల వస్తుందీ అంటే

ఆకలి, దప్పిక. ఈ రెండూ దేవతలకుండవు. దీనికితోడు వృద్ధాప్యం ఉండదు. కాబట్టి వాళ్ళు సంతోషంగా ఉంటారెప్పుడూ. కానీ వాళ్ళకి కర్మానుష్ఠానం లేదు. వాళ్ళకి ఏ కర్మలూ చెయ్యడానికి అధికారం లేదు. మనుష్యుడలా కాదు. సుఖమూ, దుఃఖమూ రెండూ ఉంటాయి. సుఖమూ, దుఃఖమూ రెండు ఉండి తీరితేనే మనుష్య శరీరంలోకి వస్తాడు. చాలామందిలో కోరిక ఏముంటుందంటే దుఃఖమన్నది మాకు రాకూడదూ అనుకుంటారు. కానీ అది పొరపాటు అభిప్రాయం. దుఃఖాన్ని ఆహ్వానించాలి జీవితంలో. అంటే ఏదో నేను పెద్ద పెద్ద దుఃఖాలు ఆహ్వానించమని ప్రతిపాదన చెయ్యను. అది తప్పు అలా చెప్పకూడదు కూడా. కానీ ఏదో ఒక చిన్న దుఃఖం వచ్చిందనుకోండి ఒక కాలు నొప్పి పెట్టింది. ఏదో కాస్త తలనొప్పిగా ఉంది. అంతమాత్రంచేత భగవంతుణ్ణి నింద చేసేసి నేను ఇన్ని పుణ్యకర్మలు చేస్తున్నాను, నాకెందుకొచ్చిందీ దుఃఖం అని అడగకూడదు.

మనుష్యశరీరంలో ఉన్నారూ అంటే ఒక విషయాన్ని జ్ఞాపకం పెట్టుకోవాలి. సుఖమూ, దుఃఖమూ రెండు అనుభవించవలసిన అవసరం ఉంటేనే మనుష్యశరీరాన్ని ఇస్తారు. కాబట్టి కేవలం సుఖాలూ అనుభవించడు, కేవలం దుఃఖమూ అనుభవించడు.

**కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా।**
**ఏతి జీవంత మానందో నరం వర్షశతాదపి।**

అంటుంది సీతమ్మ సుందరకాండలో. నూరు సంవత్సరాలు బ్రతికిన వ్యక్తి తొంభై తొమ్మిది సంవత్సరాల మూడువందల అరవైనాలుగు రోజుల ఇరవైమూడు గంటల యాభై తొమ్మిది సెకండ్లు దుఃఖమే అనుభవించినా ఆఖరి ఒక సెకన్‌లోనైనా శుభవార్త వింటాడు. అంతేతప్ప అసలు శుభవార్త లేకుండా, సుఖం లేకుండా జీవితం ఉండడమన్నది ఉండదు. ఎప్పుడో అప్పుడు ఉంటుంది. కానీ మనుష్యజన్మ అన్నదానికి వెనక తాత్పర్యమేమిటంటే మనం గతంలో చేసుకున్న పాపమూ, పుణ్యమూ కూడా పరమేశ్వరుడి దగ్గర ఖాతాలో ఉంటాయి. కొంత పాపం, కొంత పుణ్యం. రెండింటినీ అనుభవించడానికి ఈ శరీరాన్నిస్తాడు. పాపం దుఃఖాన్నిస్తుంది. పుణ్యం సుఖాన్నిస్తుంది. పాపం అనుభవంలోకి వస్తున్నప్పుడు దుఃఖం వస్తుంది. పుణ్యం అనుభవంలోకి వస్తే సుఖంగా ఉంటుంది.

కానీ మీరొక గమ్మత్తు గమనించాలి. ఇవ్వాళ్టి రోజున నేను దుఃఖపడిపోతాను అని ఏ వ్యక్తీ కోరుకోడు. ఏ రోజైనా, ఏ గంటైనా, ఏ క్షణమైనా ఎవ్వరైనా సుఖంగా ఉండాలనే కోరుకుంటారు. కానీ మనుష్యశరీరంలో ఉన్నావూ అంటే అర్థమేమిటి? సుఖదుఃఖాలు రెండూ అనుభవించాలి. దుఃఖమెప్పుడొస్తుందో ఎవరికి తెలుసు? ఒక్క పరమేశ్వరుడికే తెలుసు. ఎందుకని? గతజన్మలలో చేసిన పాపం అనుభవంలోకి ఇవాళ నేను తీసుకొద్దామని ఆయన అనుకున్నాడనుకోండి. ఆయనకొక్కడికే తెలుసు కాబట్టి వీడు గతంలో చేసిన పాపాన్ని దేన్నో లెక్కలోకి తీసుకుంటాడు. వీడెప్పుడో నిష్కారణంగా అలా వెళ్ళిపోతున్న కుక్కమీదకి ఒక పెద్ద బండ విసిరాడు. దాని కాలు విరిగిపోయింది. కుయ్యో కుయ్యో అని ఏడుస్తూ అది పోయింది కాళ్ళీడ్చుకుంటూ. వీడు విక విక నవ్వాడు అయిపోయింది కొట్టాడు కాలు విరిచేశాడు ఆ జన్మ అయిపోయింది. కానీ ఈశ్వరుడు ఆ జీవుడి పాపాన్ని ఖాతాలోకి వేసుకున్నాడు. అది ఇవాళ వీడికి అనుభవంలోకి తీసుకువస్తున్నాను. ఒక కుక్క కాలు నిష్కారణంగా విరగ్గొట్టాడు. అది మూడు నెలలు బాధపడింది. ఇవ్వాళ వీడి కాలు విరుగుతుంది. మూడు నెలలు వీడూ బాధపడతాడు. ఇప్పుడా పాపానికి సమతౌల్య దుఃఖాన్ని అనుభవిస్తాడు. దానిచేత పాపాన్ని పోగొట్టుకుంటాడు అంటాడు. కానీ వ్యక్తి ఏమనుకుంటాడు? ఇవాళ నా కాలు విరగాలి, నా కంట్లో నలుసు పడాలి అని ఎవ్వడూ కోరుకోడు. ఏ రోజైనా, ఏ క్షణమైనా సుఖంగానే ఉండాలని కోరుకుంటాడు. అదే వ్యాసభగవానుడు ప్రతిపాదిస్తాడు.

**కాలోహి బలవాన్ సతతం సుఖ దుఃఖయోః**
**నరానాం పరతంత్రాణాం పుణ్యాపాపాను యోగతః**

అంటాడు. కాలం బహుబలవత్తరమైనది. కాలాన్ని కాదని ఎదురుతిరిగి నిలబడడం ఎవరికీ సాధ్యం కాదు. ఆ కాలంలో దురితం అనుభవంలోకి వస్తుంది. మీరు నేను చెప్పినమాటను కొంచెం జాగ్రత్తగా పట్టుకోగలిగితే ప్రార్థన ఎందుకు చెయ్యాలో అర్థమవుతుంది. దురితం అంటే ఇప్పుడు చేసిన పాపం కాదు. ఎప్పుడో చేశావు. అది ఈ శరీరంతో చేసి ఉండవచ్చు. జీవుడు వేరే శరీరంలో ఉండగా గత జన్మలలో చేసినదై ఉండవచ్చు. నువ్వు మనుష్యశరీరంలో ఉన్నావు కనుక, నువ్వంటే మనం మనుష్య శరీరంలో ఉన్నాం కనుక భగవంతుడు సంకల్పం

చేస్తాడు. ఇవ్వాళ వీడు ఆ పాపానికి ఫలితాన్ని అనుభవిస్తాడని నిర్ణయం చేస్తాడు. ఆ అనుభవం ఎందులో వస్తుంది? కాలంలో వస్తుంది.

కాలం భూత, భవిష్య, వర్తమాన కాలాలుగా నడుస్తూ ఉంటుంది. ఏదో ఒక రోజు ఇవాళ వీడి కాలు విరిగిపోతుందని భగవంతుడు సంకల్పం చేశాడు, ఆ ఫలితం వస్తోంది వీడికి. కానీ వీడు అంగీకరించగలడా? కాలు విరిగిపోగానే ఓ పరమేశ్వరా, గతంలో నేనేదో తప్పు చేసి ఉంటాను అందుకని నా కాలు విరిగిపోయింది. గొడవ వదిలిపోయింది పాపం పోయింది అంటాడా. అనడు. నా కాళ్ళూ చేతులూ బాగుండాలి, నాకే ఆపదా రాకుండా ఉండాలనే ప్రతివాడూ కోరుకుంటాడు. అలా కోరుకున్నవాళ్ళందరూ ఉన్నారేమో కానీ ఆపదలు రాకుండా ఉన్నవాళ్ళున్నారా? ఉండరు. ఆపద వస్తుంది. ఆపద ఎందుకొస్తుందీ అంటే, మనుష్యశరీరానికే రావడానికి కారణమేమిటంటే సుఖదుఃఖాలు రెండూ దీనితో అనుభవించి పాపాన్నీ, పుణ్యాన్నీ కూడా పోగొట్టుకుంటాడు. పోగొట్టుకుని ఇక అనుభవించడానికేమీ లేకపోతే మోక్షం. కాబట్టి ఇప్పుడు పాపానికి ఫలితం వద్దు. పుణ్యానికి ఫలితం వద్దనడు కావాలి. గతంలో ఎప్పుడో పుణ్యం చేశాడు. పోనిలేరా కాలూ విరవను, పుణ్యానికి ఫలితమూ ఇవ్వను అన్నాడనుకోండి ఈశ్వరుడు. అలా వద్దు ఈశ్వరా, పాపానికి ఫలితాన్ని ఆపండి, పుణ్యానికి ఫలితాన్ని వదలండి అంటాడు కదూ. అయినప్పుడు అసలు పాపానికి ఫలితం వస్తోంది ఇవ్వాళ అని ఎలా తెలుస్తుంది? తెలియదు. తెలిసే అవకాశం లేదు మనుష్యులకి. అలా తెలిసుంటే మనుష్యుడిగా పుట్టిన రామచంద్రమూర్తి పట్టాభిషేకం ఆగిపోవాల్సిన అవసరం లేదు. నరజన్మలో వచ్చాడు కనుక రాముడికే తెలియలేదు పట్టాభిషేకం ఆగిపోతోందని, మనమెంతటి వాళ్ళం! మనం చేసిన పాపాలేం ఉన్నాయో అవి అనుభవంలోకి వస్తాయి. ప్రతి మనుష్యుడూ కూడా రెండిటి మధ్య నలిగిపోతాడు. ఎంత దారుణంగా ఉంటుందంటే ఈ నలిగిపోవడం. రెండూ పరమబలవత్తరమైనవి.

మనుష్యుడు పరతంత్రుడు. రెండింటినీ తోసెయ్యలేడు. ఆయనకి సాధ్యంకాదు. కాలమూ ఆగదు. ఆ పాపం ఫలితమిచ్చే కాలం దగ్గరకొచ్చేస్తుంటే కాలాన్ని ఆపలేడు, రావద్దని. ఆ ఫలితమిచ్చే పరమేశ్వరుణ్ణి నువ్వు ఇవ్వవద్దని

శాసించలేదు. ఇప్పుడు రెండింటినీ ఆపలేదు కనుక నలుగుడు మధ్యలో పడిపోతాడు. కాలానికీ, పరమేశ్వరుడికీ మధ్యలో పడి నలిగిపోతాడు. ఈ నలిగిపోతున్నప్పుడు కాలం ఈశ్వర స్వరూపమే. ఆయనే **కాలః కలయితామహం** అంటాడు భగవద్గీతలో. కాలం రూపంలో నేను లెక్కలు కడుతున్నాను అంటాడు. అందుకే నిద్ర లేవగానే మనం ఇవాళ ఇది చేద్దామని అనుకుంటున్నాం. కానీ ఇది చేద్దామూ అని మనం అనుకున్నది జరుగుతుందో, మనం అనుకున్నది కాకుండా బాధపడవలసిన సందర్భం జరుగుతుందో ఎవరికి తెలుసు? తెలియదు. ఆపగలిగేవాడెవ్వడు? పరమేశ్వరుడొక్కడే ఆపగలడు

పాపానికి ఫలితం ఇవ్వకుండా ఎందుకు ఆపుచెయ్యాలి? ఒక్క కారణానికే ఆపుచేస్తారు. ఏ కారణానికి ఆపుతాడంటే, భగవంతుని ఔన్నత్యాన్ని తెలుసుకుని జీవుడు తాను చేసిన పాపపుణ్యాలను తాను అనుభవించి తీరాలన్న విషయాన్ని అంగీకరించి బొట్టు పెట్టుకున్నాడూ అంటే, పునర్జన్మసిద్ధాంతాన్నీ, కర్మసిద్ధాంతాన్నీ అంగీకరించాడు కనుక భగవంతుణ్ణి ప్రార్థన చేస్తాడు నాకప్పుడు తెలియదు అలా పాపం చెయ్యకూడదు. నిష్కారణంగా అలా వెళ్ళిపోతున్న కుక్క మీదకి బండ విసరకూడదు. దాని కాలు విరిగితే అది ఎంత బాధపడుతుందో, నా కాలు విరిగితే నా బాధ కూడా అంతే. అందులో ఉన్న బాధా, ఇందులో ఉన్న బాధా వేరు కాదు. ఏ ప్రాణి బాధపడినా ఒకలాగే ఉంటుందని నేను ఆ నాడు తెలుసుకోలేకపోయాను. తెలుసుకోలేక నేను తప్పు చేసి ఉండవచ్చు. నేనిప్పుడు ఉదాహరణ చెప్పాను కాబట్టి కుక్క కాలు విరగడం చెప్తున్నాను. మనం ప్రార్థన చేసేటప్పుడు మనకు తెలియదుగా ఏం జరుగుతుందో. కాబట్టి కచ్చితంగా నేనేవో పాపాలు చేసి ఉంటాను. లేకపోతే మనుష్యశరీరంలో ఉండను. కాబట్టి పాపఫలితం కూడా వస్తుంది. ఎక్కడో అక్కడ వస్తుంది. ఈశ్వరా, అప్పుడు నాకు తెలియదు. నేను కచ్చితంగా పాపం చేశాను. ముందు అంగీకరించి తీరాలి. నేను పాపం చేసినవాడినే కాబట్టే మనుష్యశరీరంలో ఉన్నాను కానీ అప్పుడు నేను చేసింది తెలియక చేశాను. ఇప్పుడు నేను అటువంటి పాపకర్మ చెయ్యను.

పాపకర్మ అంటే ఈశ్వరుడు ఏది చెయ్యొద్దన్నాడో అది నిషిద్ధకర్మ. నిషిద్ధ కర్మని ఆచరించడానికే పాపమని పేరు. నేనిప్పుడు ఆ పని చెయ్యను. కాబట్టి

ఈశ్వరా, నాయందు దయ ఉంచి నేనంత బాధ తట్టుకోలేను, బాధ తట్టుకోలేనూ అన్నమాటకి అర్థమేమిటో తెలుసా? నీ పాదాలకు దూరంగా జరిగిపోలేను. నాకు దుఃఖం కలిగితే ఆ దుఃఖంలో నిన్ను మరిచిపోతానేమోనని బెంగగా ఉంది. అందుకని వద్దు. నన్ను క్షమించి ఆ పాపఫలితం నన్ను విపరీతమైన దుఃఖానికి వశుడైపోయేటట్లుగా చెయ్యకుండా నన్ను నువ్వు రక్షించు అని అడుగుతారు. అదీ ప్రార్థన తాత్పర్యం. అందుకు చేస్తాడు ప్రార్థన. అందుకే ప్రార్థన చెయ్యకపోతే ఏమవుతుందీ అని అడిగారనుకోండి. ఇంకా, ఇంకా జారిపోతాడు కిందకి.

ఎలా జారిపోతాడో నేను మీకోమాట చెప్తాను. దుఃఖం రావడం ఆగదు. ప్రార్థనా లేదూ, పశ్చాత్తాపమూ లేదు. ఈశ్వరుడు ఫలితాన్నిచ్చేస్తాడు. ఫలితాన్నిచ్చేసిన తరువాత ఏమంటాడంటే భగవంతుడు నన్నింత కష్టపెట్టాడు, నన్నింత అన్యాయం చేశాడు, నేనెందుకు భగవంతుణ్ణి కొలవాలి? నేనెందుకు ఆయనకి నమస్కారం చెయ్యాలని మళ్ళీ నింద చేస్తాడు. ఆయనా నీకు ఫలితాన్నిచ్చినవాడు. నువ్వు చేసుకున్న పాపం వల్ల ఫలితాన్నిచ్చి అక్కడితో నువ్వు చేసుకున్న పాపం పోయేటట్లు అనుగ్రహించాడు. అనుగ్రహించినవాణ్ణి తిట్టావు. తిట్టిన కారణంచేత మళ్ళీ భయంకరమైన పాపం ఖాతాలో పడుతుంది. ఒక పాపాన్ని అనుభవించడంలో మళ్ళీ నూరు పాపాలు చేసి కిందకి జారిపోతాడు. అలా జారిపోకుండా ఉండాలీ అంటే ఆ భగవంతుని అనుగ్రహంతో మనసు ఎప్పుడూ పరిపక్వతతో నిలబడగలిగిన స్థితిని పొందాలంటే పరమేశ్వరుణ్ణి ప్రార్థన చెయ్యడం వినా మార్గం లేదు. అందుకే కాలానికీ, దురితానికీ మధ్యలో నొక్కుడుపడిపోతున్న వాణ్ణి పైకెత్తగలిగినవాడు ఈశ్వరుడొక్కడే. వేరొకడికి తెలియదు, వేరొకడు ఎత్తలేడు. అది సాధ్యం కాదు.

భగవత్ స్వరూపులైన మహాపురుషులు పసిగట్టగలరు. వాళ్ళు ఉద్ధరిస్తా రొక్కొక్కసారి. కానీ అదేపనిగా అందర్నీ ఉద్ధరించడం వాళ్ళకీ సాధ్యంకాదు. కానీ ఒక్క పరమేశ్వరుడు మాత్రం అపారమైన కరుణామూర్తియై ఎంతటి ఆపద తరుముకొచ్చేస్తున్నా సరే, కాపాడతాడు. అందుకే సనాతనధర్మంలో ప్రక్రియ ప్రవచనం వింటారు. ప్రవచనం చెయ్యడం, ప్రవచనం వినడం అన్న ప్రక్రియ సనాతనధర్మంలో మాత్రమే ఉంది. ఏది ప్రవచనం చేస్తారు? పురాణప్రవచనం

చేస్తారు. పురాణం అన్నమాటని మీరు అర్థం చేసుకోవాలి. పురాణం చరిత్ర కాదు. చరిత్ర వేరు, పురాణం వేరు. పురాణం అంటే

**సర్గ శ్చ, అనుసర్గ శ్చ, వంశో మన్వంతరాణి చ, వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణం-**

అయిదు లక్షణాలతో కూడుకుని ఉంటుంది పురాణం. అది మనల్ని ధర్మంలో నిలబెడుతుంది. చరిత్ర అలా కాదు. ఒక వ్యక్తి చేసిన పని చెప్పి ఆపేస్తుంది. కృష్ణదేవరాయల వారు ఎలా పుట్టారు? కృష్ణదేవరాయలవారు ఎలా పెరిగారు? కృష్ణదేవరాయలవారు ఏం చేశారు? కృష్ణదేవరాయలవారు ఎలా చనిపోయారు? చెప్తుంది చరిత్ర. కృష్ణదేవరాయలవారు? చనిపోయారంటే ఆయన శరీరం పడిపోయింది. ఆయన జీవుడేమయ్యాడు? చరిత్రకు తెలియదు. చరిత్ర వ్యక్తి కథ మాత్రమే చెప్పి ఆగిపోతుంది. అంతకన్నా చెప్పడం చరిత్రకు తెలియదు.

కానీ పురాణం అలా కాదు. జీవుడేమయ్యాడో చెప్తుంది. మీరు భాగవతం చదివారనుకోండి. అందులో భరతోపాఖ్యానం అని ఉంటుంది. అందులో ఆయన ఒక లేడిపిల్లతో బాగా వ్యామోహం పొందుతాడు. లేడిపిల్లతో వ్యామోహం పొంది మరణించినందుకు భరతుడు ఉత్తరజన్మలలో ఏమయ్యాడో చెప్తారు. చెప్పి చిట్టచివర ఆయన మోక్షానికి ఎలా చేరుకున్నాడో చెప్తారు. అంటే ఒక జీవుడు దేనితో సంగం పెట్టుకుంటే పునర్జన్మలలో ఎలా ఎలా వెళుతున్నాడో పురాణం ఒక్కటే చెప్తుంది. అందుకే పురాణప్రవచనం అంటారు, వింటారు. ప్రవచనం అంటే ప్రహృష్టవచనం ప్రవచనం. ఒక రాట పాతినప్పుడు ఆ రాటని పాతినవాడే ఊపి చూస్తాడు. ఒక కర్ర పాతుతాడు. పాతి తానే ఊపుతాడు. ఆ ఊగుతోంది బాగా, ఇది ఇంకా స్థిరంగా లేదు అని వెళ్ళి మళ్ళీ నాలుగు రాళ్ళు పట్టుకొచ్చి దాని మొదట్లో పడేసి గునపాన్ని తిప్పి బాగా దాంట్లోకి గుచ్చుతాడు. తన పాదంతో తొక్కుతాడు. తొక్కి మళ్ళీ కొంత మట్టి పోస్తాడు. ఇప్పుడు ఊపుతాడు. ఆ ఊగట్లేదు. అప్పుడు వెళ్ళిపోతాడు. రాట పాతినప్పుడు ఎంత జాగ్రత్తగా ఊపి చూసి పాతుతాడో అలా, తాను చెప్పిన విషయం అవతలివాళ్ళలో నాటుకుందో లేదో తెలుసుకోవడానికి జీవుని యాత్రనంతటినీ కూడా మనకి అభివృద్ధి కలిగేటట్లుగా, మనకి ఆ వంశానుచరితం చెప్పిన రూపం ఏది ఉన్నదో అది కథ కాదు, ఇతిహాసం.

ఇతిహాసం అంటే **ఇతి హా అసం**. ఇది ఇట్లే జరిగినది. అది కల్పిత కథ కాదు. శ్రీరామాయణం కల్పితకథ కాదు. రామాయణం జరిగిన కాలంలో, రామాయణ రచన చేసిన వాల్మీకి మహర్షి ఆశ్రమనిర్మాణం చేసుకుని లవకుశులకి తానే రామాయణాన్ని బోధించారు. కాబట్టి వాల్మీకి శ్రీరామాయణంలోని వ్యక్తి. పాత్ర అనకూడదు. పాత్ర అంటే కల్పితలకథయందు కల్పితమైన ఒక నటన ఒక వ్యక్తి చేస్తే పాత్ర అంటారు. ఆయన ఒక పాత్ర పోషించాడని నేను అన్నాననుకోండి అది జరిగినకథ కాదు. ఆయన నిజంగా అది కాదు. ఆయన నటించాడు కాసేపు. ఆయన నిజజీవితంలో కోట్లకి పడగలెత్తాడు. కాసేపు అన్నం లేనివాడిగా నటించాడు. అప్పుడు ఆయన పాత్ర పోషించాడు అంటారు. ఆయన ఆ కథలో అంతర్భాగం అనుకోండి, ఆ కథయందు ఆయనా ఒక వ్యక్తి. ఆయన పాత్ర కాదు అప్పుడు. ఆయన పాత్ర అనకూడదు. భాగవతంలో, భారతంలో వ్యాసుడు పాత్ర కాదు వ్యక్తి. వ్యాసుడు కూడా భారతంలో తాను చూడవలసిన విశేషాల్ని చూశాడు. ఎక్కడెక్కడ భరతవంశం ఆగిపోతుంటే పాండవోత్పత్తి వాటియందు తన ప్రమేయముంది. అందుకని అవి కల్పితకథలు కావు. ఇతిహాసాలు అంటారు. ఇతిహాసాలంటే ఒక్క అక్షరమూ కల్పన లేదు. ఇతి హా అసం ఇది ఇట్లే జరిగినది.

అందుకే రామాయణ, భారత, భాగవతాలు ఇతిహాసాలు. ఇతిహాసాలు అంటే అవి అట్లే జరిగినవి. నువ్వు నమ్మి అవి అలా జరిగినప్పుడు నీకూ అదే జరుగుతుంది. అక్కడ ఉన్న వ్యక్తి సరియైన మార్గంలో నడిస్తే మోక్షాన్ని పొందాడు. అక్కడ ఉన్న వ్యక్తి సరియైన మార్గంలో వెళ్ళకపోతే వైక్లబ్యాలు పొందాడు. నువ్వు దాన్ని ఆధారం చేసుకుని నీ మార్గాన్ని దిద్దుకొమ్మని చెప్పడానికి ప్రవచనం. ప్రహృష్టవచనం చేస్తారు. ఈ ప్రహృష్టవచనం, ప్రవచనం వినడం వల్ల వచ్చే ప్రయోజనం ఏమిటంటే తాను ఎందుకు, ఏ పనిచేస్తున్నానన్న విషయంలో ఒక సమగ్రమైన అవగాహన ఏర్పడుతుంది. భగవంతుడు అలా ప్రార్థన చేస్తే పాపాన్ని తీసేస్తాడా? అలా ఎవ్వరికీ అసలు పాపాన్ని అనుభవించవలసిన అవసరం లేకుండా చేసేస్తాడా ప్రార్థన చేస్తే. కచ్చితంగా చేస్తాడు. అందులో మీకు సందేహం ఇసుమంత కూడా అక్కర్లేదు. కచ్చితంగా ఆయన చెయ్యగలడు. కానీ ఒక్కటి చేస్తాడు. పాపం పోయింది అనడానికి భయంకరమైన కష్టాన్ని అనుభవించవలసినవాణ్ణి చిన్న

కష్టం అనుభవించేటట్లు చేస్తాడు. పాము కరవాలి, చీమ కరుస్తుంది. పాము కరిచి విషమెక్కి అతను వైద్యశాలలో పడుండాలి. చీమ కరిచి, మంట పుట్టి చేత్తో రుద్దుకుని కించిత్తు బాధపడతాడు. పాము కరవవలసినవాణ్ణి చీమ చేత కరిపించి విడిచిపెడతాడు. ఇవాళ పాము కరవాలి, నన్ను పాము కరవలేదు. చీమచేత కరిచి విడిచిపెట్టిందని మనకి తెలియక్కర్లేదు. భగవంతుని అనుగ్రహం ఉంటే చాలు. ఆయన అనుగ్రహం ఉన్నదా రక్షించబడతావు. ఆయన అనుగ్రహం లేదా రక్షించబడదు. అందుకే ఒక రోజు కార్యక్రమాన్ని ప్రారంభం చేసేటప్పుడు ఉద్వేగంతో ప్రారంభం చెయ్యవద్దు. రజోగుణసంబంధమైన కోర్కెలతో పరుగులు తియ్యవద్దు. భగవత్ ప్రార్థనతో ప్రారంభం చెయ్యి.

అందుకే సనాతనధర్మంలో ప్రార్థన అనేది ఏ కార్యక్రమానికీ మినహాయింపు కాదు. నేను ప్రవచనం చెయ్యడానికి కూర్చున్నాననుకోండి నేనూ ప్రార్థన చెయ్యాలి. ఎవర్ని ప్రార్థన చెయ్యాలి? ప్రధానమైన ప్రార్థన ఎవర్ని ఉద్దేశించి ఉంటుందంటే మా గురువుగారిని ఉద్దేశించి ఉంటుంది. నేను పదిమందికి చెప్పాలి. నేను చెప్పేటప్పుడు నా నోటివెంట అనవసరవిషయం రాకూడదు. అశాస్త్రీయమైనవి రాకూడదు. పెద్దలు చెప్పని విషయం నేను చెప్పకూడదు. నా బుద్ధికి తోచిందేదో నేను చెప్పెయ్యకూడదు. ఇక్కడ ఒక రెండువేల మంది కూర్చుని ఉంటే ఒక్క నిమిషం నేను అనవసర ప్రసంగం చేస్తే ఒక్కొక్కరి జీవితంలో నిమిషం చొప్పున రెండువేల నిమిషాలకు నేను జవాబుదారీ. కాబట్టి ఒక నిమిషం వృథా కాకుండా నేను ఏది మాట్లాడాలో అదే నా నోటివెంట పలికేటట్లు, గురువుగారు ఆ చెప్పేటప్పుడు నాకు అస్పష్టత కలగకుండా నా మాటలు వాళ్ళకి అర్థమయ్యేటట్లుగా నాచేత పలికించండని, నాకెవరు జ్ఞానభిక్ష పెట్టారో గురువుగారి పాదాలుపట్టి ప్రార్థన చేసి, ప్రసంగం అయిపోయిన తరువాత నా చేత పలికించిన గురువుగారికి కృతజ్ఞతలతో మంగళాశాసనాలతో ఉపన్యాసాన్ని పూర్తిచేస్తాను.

ప్రార్థన – ఏది చెయ్యండి మొట్టమొదట ప్రార్థనతో ప్రారంభం తప్ప అసలు ప్రార్థన లేకుండా ఏ కార్యక్రమం ప్రారంభం కాదు. నువ్వు ఒక సంకల్పం చేస్తున్నావు ఇది చేస్తానూ అని. కానీ నువ్వు చేసిన సంకల్పం జరగడానికీ, జరగకపోవడానికీ ఒకరున్నారు. ఆయన అనుగ్రహం మీద ఆధారపడింది. ఈ పుణ్యం వీడికి

కట్టబెట్టడానికి వీల్లేదని ఆయన అన్నాడనుకోండి. ఆయన కూర్చోనివ్వడు, ఆయన చెయ్యనివ్వడు. కాశీ వెళదామని బయలుదేరి మొఘల్‌షరాయి స్టేషన్‌వరకూ వెళ్ళి వెనక్కు వచ్చేసినవాళ్ళు నాకు తెలుసు. యాత్ర చెయ్యడానికి వచ్చి ఒక్కరోజో, రెండు రోజులో ఉండి వెనక్కు వెళ్ళిపోయినవాళ్ళు నాకు తెలుసు. ఈశ్వరానుగ్రహం లేకుండా ఈశ్వరసంబంధమైన కార్యంలో నిలబడడం కూడా సాధ్యంకాదు. పాపం అడ్డొచ్చి పాడుచెయ్యకుండా ఉండాలీ అంటే భగవంతుణ్ణి ప్రార్థన చెయ్యడం వినా మార్గం లేదు. అందుకే ఎవరు త్రికరణశుద్ధిగా, పరమభక్తితో వాడున్నాడు, వాడు ఈశ్వరుడు, వాడు శాసకుడు, వాడు తెలుసు. వాడికి నా మీద శిక్ష వెయ్యకుండా నన్ను రక్షించాలి అనుకుంటే ప్రార్థన చెయ్యాలి. ప్రార్థన చెయ్యకపోతే దురితం తన ఫలితాన్ని తాను ఇచ్చేస్తుంది.

నేను మీతో ఆ విషయాలు వేదికమీద చెప్పడం నాకిష్టంలేదు కానీ, ఒక విషయాన్ని ప్రస్తావన చేస్తాను. పరోక్షంగా పట్టుకోగలరు. ఈ భగవత్ సంబంధంలో ప్రవచనాలు చేసే అలవాటు ఉన్నకారణంచేత నాబోటి వాడికి అటువంటి అనుభవం ఎక్కువగా ఉంటుంది, చాలా మంది వచ్చి మాట్లాడుతుంటారు కాబట్టి. ఇంట్లో ఏదో ఒక పెద్ద ఇబ్బంది ఒకటి జరుగుతుంది. వాడు గతంలో ఏదో పాపం చేస్తే కదూ ఈశ్వరుడు ఆ ఫలితాన్నిచ్చాడు. లేకుండా ఎందుకిస్తాడు? ఇప్పుడు వాడేం చేస్తాడంటే భగవంతుడిమీద కినిసి కొన్ని సంవత్సరాలపాటు అనుష్ఠానం మానేస్తాడు. ఇంట్లో భగవన్ మూర్తి కూడా ఉండదు. నాకు తెలుసు కొన్ని కుటుంబాలు. తీసేసినవాళ్ళి తెలుసు. భగవంతుణ్ణి ప్రార్థన చెయ్యడు. ఇక భగవంతుని పాదాలు పట్టుకోడు. ఎవరికి నష్టం నాకు చెప్పండి. ఆయనకేమైనా నష్టం ఉందా? ఆయనకేం నష్టం లేదు. మనుష్య జీవితాన్ని నువ్వు పోగొట్టేసుకుంటున్నావు. పాపం నీది, ఫలితం నీది, చేసినదానికి ఫలితం అనుభవించావు. ఉన్న అవకాశాన్ని కూడా ఎందుకు జారవిడుచుకుంటావు? ఇప్పటికైనా భగవన్మార్గంలో నిలబడకపోతే ఎప్పటికి నిన్ను నువ్వు సంస్కరించుకోగలుగుతావు? అందుకే పెద్దలైనవారు– చాలా పెద్ద ప్రమాదమే జరిగిందనుకోండి, చాలా విశేషమైన కష్టమే వచ్చిందనుకోండి– వెంటనే భగవంతునిముందు సాష్టాంగపడతారు. కారణమేమంటే ఈశ్వరా, ఎంత పెద్ద పాపం గతంలో చేసి ఉండకపోతే నేను ఇవాళ నిన్ను నమ్మి ఉన్నా కూడా

తప్పనిసరి పరిస్థితులలో నువ్వు నాకీ శిక్షవేసి ఉంటావు. ఇక్కడితో నా పాపం పోయింది. ఇప్పటికైనా నా మనసు చెదిరిపోయి నీ పాదాలు విడిచిపెట్టెయ్యకుండా మాత్రం కాపాడు. అందుకే ధూర్జటి–

**నిను సేవింపగ నాపదల్ వొడమనీ నిత్యోత్సవం బబ్బనీ,**
**జనమాత్రుం డననీ మహాత్ము డననీ సంసారమోహంబు పై**
**కొననీ జ్ఞానము గల్గనీ గ్రహగతుల్ గుందింపనీ మేలు వ**
**చ్చిన రానీ యవి నాకు భూషణములే శ్రీకాళహస్తీశ్వరా!**

అంటాడు. నిన్ను నేను సేవిస్తుండగా **నిత్యోత్సవంబబ్బనీ** ప్రతిరోజూ నన్ను పొగుడుతూ ఉండనీ, ఆపదలు రానీ, గ్రహగతులు కుందింపనీ, గ్రహగతులు నన్ను తొక్కి పెట్టెయ్యనీ నాకు బాధలేదు. నాకు కోరిక ఒక్కటే. ఈశ్వరా, నీ పాదాలయందు విస్మృతి మాత్రం కలగకూడదు. కష్టమొచ్చినప్పుడే గట్టిగా పట్టుకోవాలి. మీరొక్కటి జ్ఞాపకం పెట్టుకోండి. భగవంతుడనేవాడు కరుణాసముద్రుడు. అందుకే దాశరథీ కరుణాపయోనిధీ అంటారు గోపరాజుగారు. అంత కరుణాసముద్రుడైన పరమేశ్వరుడు చాలా చిన్నబుచ్చేసుకునేది ఎప్పుడో తెలుసా? అంత పాపాన్ని చేసినందుకు కష్టాన్నిస్తే అప్పుడు కూడా విడిచిపెట్టకుండా భగవంతుడి పాదాలు పట్టుకున్నాడనుకోండి, వాణ్ణి చూసి ఆయన కుపితుడైపోతాడు. ఒరేయ్, ఇంత కష్టపెట్టానురా పాపం చేశావని, అయినా వదల్లేదురా నా పాదాలు నువ్వు అని ఆయన ఎంత తల్లడిల్లిపోతారో! సుఖమిచ్చినప్పుడు భగవంతుని పాదాలు పట్టుకోవడం పెద్ద కష్టమేం ఉందండీ. కష్టం కాదు. కష్టమొచ్చినప్పుడు ఈశ్వరుడి పాదాలు పట్టుకోవడంలోనే నిజమైన భక్తి ఉంది. పరిణతితో కూడిన భక్తి ఉంది.

మీరు చూడండి నా పెన్ను కనబడలేదు. నా పెన్ను కనబడకపోతే ఎప్పుడూ నా పెన్ను రాసి అక్కడ పెడితే మా అమ్మాయి తీసెయ్యడం అలవాటు దానికి. అందుకని నా పెన్ను కనబడలేదని మా అమ్మాయిని పట్టుకుని నిందచేసి ఆఫీసుకు వెళుతున్నాను. పెన్నుకనబడలేదు నువ్వే తీసి ఉంటావు. ధూర్తురాలా, ఎప్పుడూ నా పెన్ను తీసేస్తావు ఎక్కడ పెట్టావు అంటే, నాన్నగారండీ, నాన్నగారండీ నిజంగా నేను పెన్ను తియ్యలేదు నాన్నగారండీ, నాకు తెలియదు నాన్నగారండీ అంది. అయినాసరే గట్టిగా కేకలేసేశాను. గుడ్లనీరు కుక్కుకుని నాకు తెలియదు

నాన్నగారండీ, నాకు తెలియదు నాన్నగారండీ అంటోంది. నేను ఎప్పుడూ ఇంతే నువ్వు బుద్ధిహీనురాలా, అంటూ కిందకెళ్ళిపోయినా మోటారుసైకిల్ తీస్తుంటే దాని పౌచ్‌లో ముందురోజు తీసుకొచ్చిన పుస్తకానికి గుచ్చి పెన్నుంది. అరే పాపం, అది తియ్యలేదురా. నేనే మరిచిపోయాను నా మోటారుసైకిల్‌లోనే పెట్టుకున్నాను. దాన్నంత నింద చేశాననుకున్నాను. అది పరిగెత్తుకుంటూ మెట్లుదిగి నాన్నగారండీ, నాన్నగారండీ హెల్మెట్ మరిచిపోయారు నాన్నగారండీ, పట్టుకొచ్చానని ఇచ్చింది. ఇప్పుడు నాకు దాన్ని చూస్తే ఎలా ఉంటుంది? పెన్ను అది తియ్యకపోయినా తీసిందనుకుని అన్ని తిట్టేశాను. కిందకొచ్చేశాను. నేను హెల్మెట్ మరిచిపోయానని పిచ్చితల్లి పరుగెత్తుకుంటూ నాన్నగారండీ, నాన్నగారండీ అంటూ పట్టుకొచ్చింది. ఇంత తిట్టారు మంచిపని అయ్యిందిలే, పోలీసులు పట్టుకుంటే వందరూపాయలు కట్టుకుంటారని ఊరుకోలేదు. నాకోసం పరిగెత్తుకొచ్చింది పిచ్చితల్లి అని నాన్నా, నీకు సాయంకాలం వచ్చేటప్పుడు కాజాలు తెచ్చిపెడతానురా అంటాను. అనకపోయినా గుర్తుపెట్టుకుని కాజాలు పట్టుకొస్తాను ఎందుకనీ? నేను ఎవర్ని బాధపెట్టానో అదే నా వెంట పడింది. నా కూతుర్ని పెన్ను తీసిందని నేను నిందచేసినా నాకు హెల్మెట్ తెచ్చిస్తే లౌకికమైన తండ్రిని నేనే అంత పొంగిపోతే, చేసిన పాపానికి కష్టపెట్టినా విడిచిపెట్టకుండా పాదాలు పట్టుకున్న భక్తుణ్ణి చూసి పరమేశ్వరుడు ఎంత పొంగిపోతాడు! అదీ పరమేశ్వర తత్త్వం.

కాబట్టి అందుకే పెద్దలు కష్టం రావడాన్ని ఆహ్వానించారు జీవితంలో. భగవత్ కృప పొందడానికీ, పాపం పోగొట్టుకోవడానికీ మార్గం. వద్దంటావా, నువ్వు అంత తట్టుకోలేనంటావా? ప్రార్థన చెయ్యి. పరమేశ్వరుణ్ణి ప్రార్థనచేస్తే దురితాన్ని తొలగిస్తాడు. తొలగించి పెద్ద కష్టం రావలసినచోట చిన్న కష్టంతో తీసేస్తాడు తప్ప అసలు ప్రార్థన చిత్తశుద్ధితో చెయ్యకపోతే, ప్రార్థన చేయటం అన్న మాట వెనుక ఉన్న రహస్యం తెలిసి చెయ్యాలి. ఇవ్వాళ బాగున్నాను ఈశ్వరా, నేను ఇలాగే సంతోషంగా నీ కథ చెప్పుకుంటూ హాయిగా, ఆనందంగా బ్రతకాలి. తండ్రీ, నన్ను జాగ్రత్తగా చూడు సుమా, నా మనసు బెంగ పెట్టుకోకుండా కాపాడు సుమా. అది నీకొక్కడికే తెలుసు. ఎటువైపు నుంచి ఏదొస్తోందో నాకు తెలియదుగా, దాన్ని పరిమార్చి కాపాడు సుమా అని నేను ఆయన సర్వజ్ఞుడన్న భావనతో ప్రార్థన చేసి, గతంలో ఏదో చేసి ఉంటాను లేకపోతే మనుష్య శరీరంలో ఎందుకుంటాను? అది

అడ్డురాకుండా ఆయన ఆపగలడన్న నమ్మకంతో నేను ప్రార్థన చేశాననుకోండి దానికి ప్రార్థన అని పేరు. అందుకే సనాతనధర్మంలో ప్రార్థన లేకుండా అసలు ఏ పనీ ఉండదు. చిన్నపిల్లల దగ్గరి నుంచి పెద్దవాళ్ళ వరకూ అందరూ ప్రార్థన చెయ్యవలసిందే. ప్రార్థనకు మినహాయింపు లేదు. అది ప్రార్థన.

ఇక స్తుతి అని ఒకటుంటుంది. స్తుతి అన్నమాటకు అర్థమేమిటంటే అది ప్రార్థన కాదు. భగవంతుని గుణాలను తాను అనుభవించిన కారణంచేత రోమాంచితమైతే, హర్షం పెల్లుబికితే, ఎంతో సంతోషం కలిగితే, ఆ సంతోషం లోపల పట్టక వాగ్రూపంగా బయటికొస్తే దాన్ని స్తుతి చేశాడు అంటారు. స్తుతి అంటే పుస్తకం పట్టుకుని ఏదో **అన్నపూర్ణే, సదాపూర్ణే శంకర ప్రాణవల్లభే** లేకపోతే **నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్య రత్నాకరీ** అని చదువుకోవడం స్తుతి కాదు. స్తుతి అన్నమాటకు అర్థమేమిటంటే భగవంతుడి గుణాలను అనుభవించడానికి మీ నోటివెంట రావాలి. నోటివెంట వస్తున్నప్పుడు ఆ వచ్చేది ఆగిపోవాలి మధ్యలో. ఒక బిందెని పంపుకిందకు పట్టుకెళ్ళి పెడితే నిండిపోయిన బిందె ఇంక నీరు పట్టలేక అంచులవెంట ఎలా జారిపోతుందో అలా భగవంతుని గుణాలు అనుభవంలోకి వచ్చి ఆనందం కలిగి, ఆ ఆనందం లోపల పట్టక వాగ్రూపంగా బయటికొస్తూ ఆగిపోయి, కన్నులవెంట ధారగా నీరు కారిపోయి ఉండిపోయాడనుకోండి. అది స్తుతి.

నేను మీకొక ఉదాహరణ చెప్పాలంటే, ఎదురుగుండా సీతారాముల మూర్తులున్నాయి. ఎదురుగుండా సీతారాముల మూర్తులు– పోనీ అలా విడిచిపెట్టండి. ఏదో శ్రీశైలమో, ఎక్కడికో వెళ్ళాడు. సీతాదేవి ప్రతిష్ఠ చేసిన సహస్రలింగం ఉందక్కడ. ఆ సహస్రలింగానికి అభిషేకం చేసుకుంటున్నాడు. అభిషేకం చేసుకుంటుండగా అకస్మాత్తుగా ఆలోచన వచ్చింది మా అమ్మ సీతమ్మ ఈ లింగాన్ని ప్రతిష్ఠ చేసింది. అంటే మా అమ్మ ఇక్కడికొచ్చి నిలబడింది. నిలబడి మా అమ్మ అంత బరువు పట్టలేదని స్వామి హనుమ తెచ్చి ఉంటారు. పక్కనే నా తండ్రి రామయ్య నిలబడి ఉంటారు. మా అమ్మ తన చేతులతో ఈ శివలింగాన్ని పెట్టి ప్రతిష్ఠ చెప్పి ఉంటుంది. మా అమ్మ ఇక్కడే నిలబడింది. మా అయ్య ఇక్కడే నిలబడ్డారు. వాళ్ళిద్దరి పాదాలూ ఇక్కడే ఉండి ఉంటాయి. పక్కనే మా స్వామి

హనుమ నిలబడి ఉంటారు. మా అమ్మ పట్టుచీర కట్టుకుని ఉండి ఉంటుంది. ఏమి నా తల్లి సీతమ్మ. ఏమి మహాపతివ్రత. ఎన్ని కష్టాలు పడి కూడా పాతివ్రత్యాన్ని నిలబెట్టుకుని, ఎన్ని యుగాలు దాటిపోయినా పూజలు అందుకుంటోంది. అబ్బా, నా తల్లి ఇక్కడే నిలబడిందని నా కులదైవం శంకరుడు శివలింగంగా ఉన్నాడు. నా ఇష్టదైవం సీతారాములిక్కడ నిలబడ్డారని భావన కలిగిందనుకోండి ఇప్పుడు ఒక్కసారి ఈ కులదైవాన్నీ, ఇష్టదైవాన్నీ కలిపి పాదాలు గట్టిగా కౌగలించుకునే అవకాశం వచ్చింది. ఇద్దరూ అక్కడే ఉన్నారు. ఇప్పుడు నువ్వు అకస్మాత్తుగా అభిషేకం చేస్తున్నవాడికి శివలింగం మీద ఒరిగిపోయి రెండుచేతులతో ఇలా గట్టిగా కౌగిలించేసుకుంటావు. చూసేవాడికి పిచ్చాడా, వెర్రాడా ఏమిటా పని అనిపిస్తుంది. నీకు తెలుసు ఎందుకు కౌగిలించుకున్నావో. కౌగిలించుకున్నప్పుడు నీకు రోమాంచితమైపోయి శివలింగం మీద తలపెట్టి రామచంద్రమూర్తి పాదాలూ, సీతమ్మ పాదాలూ నీ చేతులకి తగులుతూంటే నువ్వు పరవశించిపోతూ అబ్బా, నా తల్లిదండ్రులు ఏమి ఆనందం నా జీవితంలో అమృతమని పొంగిపోతూ నువ్వు అప్పటివరకూ నోటివెంట ఏది చెప్తున్నావో అది నోటివెంట ఆగిపోయి, కన్నులవెంట నీటిచుక్కలు ఇలా పడితే అది ఏడుపు కాదు ఆనంద బాష్పాలు. ఒళ్ళు గగుర్పొడిచి నిలబడిపోయి ఆ ఆనందంలో ఒక్కసారి–

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్ ।**
**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥**

**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।**
**విద్వాన్ కః క స్సమర్థశ్చ క శ్చైక ప్రియదర్శనః ॥**

**ఆత్మవాన్ కో జిత క్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః ।**
**కశ్య బిభ్యతి దేవాశ్చ జాత రోషస్య సంయుగే ॥**

అని ఆ సీతారాముల గుణగణాలను స్తోత్రం చేశావు. పరవశించిపోయి, అబ్బా మా తండ్రి అంతటివాడు, మా తల్లి అంతటిది అన్న పొంగుతో కూర్చోకుండా, ఇలా రెండు చేతులెత్తి సంతోషంతో చేశావో అది స్తుతి. ఆ స్తుతి, ఆ ఆనందం, ఆ గగుర్పాటు జీవితంలో కలగాలి. అది లేకుండా బ్రతికున్నంత కాలమూ పూజ

అంటే యాంత్రికంగా చేసిన పూజ ఎంతకాలం చేస్తావు? ఆ గగుర్పాటేదీ? ఆ సంతోషమేదీ?

ఒక్క పదినెలలు కొడుకు కనబడలేదు, విదేశాలెళ్ళాడు. పది నెలల తరువాత కొడుకొస్తున్నాడు. నువ్వు ఆ విమానాశ్రయం ఆ బయటికొచ్చే గేటు దగ్గర నిలబడ్డావు. వచ్చే వాళ్ళందర్నీ చూస్తుంటావు కొడుకేనేమో, కొడుకేనేమోనని. వాడు పెట్టె లాక్కుంటూ వస్తున్నాడు. వాణ్ణి చూడగానే ఎంత సంతోషపడిపోతావు! ముఖమెలా ప్రహృష్టమైపోతుంది! ఇలా అయిపోయి వాడు రాగానే చేతులు తడిమేసి నాన్నా ఎంత సన్నబడిపోయావురా, జుట్టు తగ్గిపోయిందిరా బాగా తెల్లబడ్డావు అని గట్టిగా కౌగిలించేసుకుంటావు అయ్యో, ఇంతమంది చూస్తున్నారు బాగుంటుందా, బాగుండదా ఏమీ లేదు. ఆనందంతో కౌగిలించేసుకున్నావు కొడుకుని. నాన్నా, వేళపట్టున తిన్నావురా. అమ్మ చూస్తోంది అని గబగబా ఏవేవో మాటలు మాట్లాడేస్తున్నావు. నీ కన్న కొడుకుని పదినెలలు చూడకపోతేనే నువ్వంత తల్లడిల్లిపోయావే! కొన్ని కోట్ల, కోట్ల జన్మల అనుబంధం ఆ స్వామితో. ఆయనని పూజలో ఆరాధన చేస్తున్నప్పుడు ఎప్పుడో అప్పుడు గగుర్పాటు కలిగి ఆ సంతోషంతో రెండు చేతులెత్తి శ్లోకమో, స్తోత్రమో చేసి నీ హృదయం పరవశించిపోయి కన్నుల నీటిధారలొచ్చి, కంఠం గాద్గదికమై మాటరాక నిలబడిపోతే నీ జీవితం మొత్తం మీద పూజ చేసిన రోజు, మధురమైన క్షణమంటే అదే. ఆ గగుర్పాటు రావాలి. దాన్ని స్తుతి అంటారు. నిజానికి అందులో మాట ఉందా అంటే చెప్పడం కష్టం. అందుకే అందరూ అలా అనుభవించగలరా అంటే చెప్పడం కుదరదు.

చూడండి లలితాసహస్రనామ స్తోత్రం చదవండి అన్నాననుకోండి. గడ గడ గడ చదివేస్తారు. **శ్రీమాతా శ్రీ మహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ** అలా కూడా చదవరు. నాకు గబగబా చదవడం అలవాటు లేక అలా చదువుతున్నాను కాని

**చిదగ్నికుండ సంభూతా దేవకార్య సముద్యతా**
**ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా**
**రాగస్వరూప పాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా ॥**

**మనోరూపేక్షు కోదండా పంచ తన్మాత్ర సాయకా**
**నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా ॥**
**చంపకాశోక పున్నాగ సౌగంధికల సత్కచా**

అన్నాననుకోండి నాకు అమ్మవారి పెద్ద కబరీబంధం, అదీ ఈ భుజాల వరకూ ఉంటుంది. అమ్మవారు నడుస్తుంటే ఇలా ఇలా తగులుతుంది. నటభుజ ధమ్మిల్ల బంధమ్ముతో అంటారు పోతన. అది ఇలా ఇలా తగిలి ఇలా ఇలా ఆడుతుంది. అంత పెద్ద కబరీబంధం కాబట్టి అందులో **చంపకాశోకపున్నాగ సౌగంధిక లసత్కచా** అంతంత పెద్ద పూలదండలు తురిమి ఉంటుంది. ఆ జుట్టుకి సహజమైన సువాసన ఉంటుంది. నా తల్లి కొప్పు నల్లగా ఉంటుంది. ఆ అమ్మ కబరీబంధం కనబడితే చాలు, అజ్ఞానపు చీకట్లు విచ్చిపోతాయి. **ధునోతుంధ్వాంతం నస్తులిత దలితేందీరవనం** అంటారు శంకరులు అని మనసులో ధ్యానం కుదిరి, నేను ఆ మాట చెప్పి **చంపకాశోకపున్నాగ సౌగంధికలసత్కచా** అని నాకు ఆ కబరీబంధం ఇక్కడ కనబడుతూ ఉంటే కళ్ళు పైకి తెరిచి ఉన్నా చెయ్యి ఇలా పెట్టి, **చంపకాశోకపున్నాగ సౌగంధికలసత్కచా, చంపకాశోకపున్నాగ సౌగంధికలసత్కచా** అంటున్నాననుకోండి. మా ఆవిడ పూజామందిరంలోకి వచ్చి ఏమిటది **కురువిందమణిశ్రేణీ కనత్కోటీర మండితా** అందనుకోండి! ఫ్ఫ్ పాడుచే శాసేవే పూజ నాకు రాక కాదే, నా మనసు నిలబడిపోయింది. కబరీబంధం కనబడుతూ, అమ్మ కబరీబంధం కనబడితే పరవశించిపోయి అదే చెప్తున్నాను. ఇప్పుడు నేను లలితా సహస్రం చదవడంలో ఒక నామాన్ని స్తుతిగా మార్చేసుకున్నాను. నేను మార్చలేదు. నా మనసు పొంగుచేత అది స్తుతిపాఠమైపోయింది.

ఒకరు **కామేశ బద్ధమాంగల్య సూత్రశోభితకంధరా** అని చదివారు. అమ్మా, అమ్మ మెడలో మంగళసూత్రం, పెద్ద పెద్ద శతమానాలు కనబడ్డాయి. అమ్మా లోకంలో అందరూ పెళ్ళి చేసుకుంటారు. మగవాడు వస్తాడు తాళి కడతాడు. నువ్వో, మన్మథుడు బాణం వేస్తే మన్మథుణ్ణి కూడా కాల్చేసినవాణ్ణి పతిగా చేసుకోవడానికి ఎంత తపస్సు చేశావు! అపర్ణవై ఆకులు కూడా తినడం మానేసి నా తల్లీ, శల్యంలా నువ్వైపోతే శంకరుడు అప్పుడు నిన్ను అనుగ్రహించి పత్నిగా చేపట్టాడు. అప్పుడు

నీ మెడలో మాంగల్యం కట్టాడు. అమ్మా మిగిలినవాళ్ళు పెళ్ళిచేసుకోవడానికీ, నీవు పెళ్ళి చేసుకోవడానికీ తేడాలేదూ? మన్మథుణ్ణి కాల్చినవాడు నీకు వశుడై వంగి శంకరుడు నీ మెడలో మూడుముళ్ళూ వేస్తే వచ్చిన మంగళసూత్రమమ్మా. నీ మంగళసూత్రం వెనక నీ విజయం ఉంది, నీ తపస్సుంది, నీ వైభవముంది. ఎన్ని అవతారాలెత్తినా శంకరుడే నీకు భర్త. పాతివ్రత్యముంది. ఏమి ఇల్లాలివమ్మా అని ఆ మంగళసూత్రం గుర్తొచ్చేటప్పటికి ఏదో గుర్తొస్తోంది.

**కామేశ బద్ధమాంగల్య సూత్రశోభితకంధరా** అంటున్నాడు అరమోడ్పు కన్నులతో. అదే అంటున్నాడు ఇలా చెయ్యి చూపిస్తూ, అమ్మవారి వంక చూస్తూ అదే అంటున్నాడు. ఇప్పుడాయన సహస్రపఠనం కాదు. ఆయన స్తుతి చేశారు. ఎప్పుడు స్తుతిగా మారుతుందంటే చెప్పడం కష్టం. ఎప్పుడు స్తుతిగా మారిపోతుందంటే నీ మనసు పొంగిపోతే స్తుతిగా మారిపోతుంది. అది సర్వోత్కృష్టమైన స్థితి. అంటే భక్తి పండిందని గుర్తు. భక్తి పండితే భగవంతుడితో ఉన్న అనుబంధం బాగా జ్ఞాపకానికొస్తూంటే, ఆయన గురించి తలచుకుని, తలచుకుని, పొంగిపోతూంటే మనసు చెప్పిందే చెప్పి, చెప్పుకుంటూ, భావాలూ లోపల దండలుగా తిరిగిపోతున్నాయి. భావాలు సుమమాలలుగా మారి ఆయన మెళ్ళో పడిపోతున్నాయి. నామం ఒక్కటే తిరుగుతోంది. అప్పుడా నామం స్తుతి పాఠంగా మారింది. అదీ జీవితంలో అలవాటు కావలసింది.

అందుకే భగవత్సన్నిధానంలో కూర్చోవడమంటే, పూజకి కూర్చోవడమంటే ముందు మనసు అధ్యవసాయంతో ఉండాలి. ఆ భక్తి నిష్ఠతో ఉండాలి. దానికి బ్రహ్మముహూర్తం యోగ్యమైన కాలం. ఆ యోగ్యమైన కాలంలో కూర్చుని చేసినదేదో అది పండుతుంది. మనసు భగవంతుణ్ణి బాగా పట్టుకుని ముద్ర వేసుకుంటుంది. బ్రహ్మముహూర్తంలో నిద్రలేవడం దగ్గర్నుంచి వేదం చెప్పినట్లుగా చేసినవాడి మనసెలాగుంటుందంటే, బాగా మెత్తగా ఉన్న మట్టిలాంటిది. దాన్ని మీరు ఏ మూసలో పెట్టండి ఆ మూసైపోతుంది. మట్టి విఘ్నేశ్వరప్రతిమలు చేస్తారు. లోపల నూనెరాసి ఆ విఘ్నేశ్వర ప్రతిమలోకి మట్టి బాగా నొక్కేస్తారు. నొక్కేసి కొయ్య సుత్తి తీసి కొడతారు. కొట్టి జంతునరంతో చేసిన ఒక సాధనంతో మిగిలిపోయి పక్కన ఉన్న భాగాలు కోసి ఆ పరికరాన్ని ఎత్తి నేలకేసి కొడతారు

ఆకుమీద. కొడితే లోపల నూనె ఉంది కదూ, ఆ మట్టి బాగా నొక్కుకుని అది తిరగేసి కొట్టినప్పుడు లోపల ఉన్న భాగం విఘ్నేశ్వరస్వరూపాన్ని పొందుతుంది. అది మట్టే విఘ్నేశ్వరుడితో నొక్కుకుని విఘ్నేశ్వరుడైంది. మనసు బ్రహ్మముహూర్తంలో అధ్యవసాయంతో ఉంటే మీరు దేన్ని జపం చేస్తున్నారో, దేన్ని చూస్తున్నారో దాని ముద్ర పుచ్చుకుంటుంది. పుచ్చుకుని పునీతమవుతుంది, పవిత్రమవుతుంది. అందుకే స్తుతి.

మూడవది సూక్తం అంటారు. సూక్తపఠనం చేశాడండీ అంటారు. నిజానికి స్నానం చేసినప్పుడు అఘమర్షణసూక్తమని ఉంటుంది. ఆ సూక్తపారాయణం చేస్తూ స్నానం చెయ్యాలి. పాపాలు పోతాయి. ప్రతిచోటా సూక్తముంటుంది. సూక్తం అన్నమాటకి అర్థమేమిటంటే సుక్ ఉక్తం 'బాగా చెప్పబడింది. భగవత్ తత్త్వాన్ని ఇంతకన్నా నువ్వు చెప్పడం సాధ్యం కాదు. అంతబాగా ఋషి చెప్పేశాడు. నువ్వు ఏ రూపాన్ని చూద్దామనుకుంటున్నావో. ఆ రూపంతో భగవత్ తత్త్వం ఎలా ఉంటుందో చెప్తారు. భగవంతుడొక్కడే.

**ఏకస్త్వమేవ బోధా భవభాసిలోకే నిస్సంగదైవృషభ కేతన మల్లినాథా శ్రీ భ్రామరీప్రియ సుఖాశ్రయ లోకనాథా శ్రీమల్లికార్జునవిభో తవ సుప్రభాతం** అంటారు.

ఉన్న ఒక్క పరమేశ్వరుడే మీరేది కోరుకుంటున్నారో దాన్ని మీకివ్వడానికి యోగ్యమైన రూపాన్ని పొందుతారు. అది పరమేశ్వరసంబంధంలో ఉండే విశేషం.

భగవత్ తత్త్వంలో మార్పుండదు. మీరు కోరిన కోర్కెకి అనుగుణంగా ఈశ్వరుని రూపం మారి వచ్చి మిమ్మల్ని అనుగ్రహిస్తుంది. ఒకడు సరస్వతీకటాక్షాన్ని కోరాడు. అప్పుడు అమ్మవారు

**విమలపటీ కమలకుటీ పుస్తక రుద్రాక్ష శస్త హస్త పుటీ కామాక్షీ పక్ష్మలాక్షీ కలిత విపంచి విభాసి విరించి**

సరస్వతీకటాక్షాన్ని ఇవ్వాలనుకున్నప్పుడు ఆ శ్లోకాన్ని అనుసంధానం చేస్తారు. అప్పుడు అదే కామాక్షి సరస్వతీదేవిగా కూర్చుని తెల్లని బట్టలతో తామరపువ్వులో కూర్చుని జ్ఞానాన్నిస్తుంది. ఒకడికి డబ్బుకావాలి, అదే భగవత్ తత్త్వం ఒకానొకనాడు లక్ష్మీస్వరూపాన్ని పొందుతుంది. పొంది తామరపువ్వులో

కూర్చుని కనకవర్షాన్ని కురిపిస్తుంది. అదే భగవత్ తత్త్వం– ఒకనాడు శరీరానికి బలం, శక్తి, మేధా కావలసి వచ్చాయి దుర్గాస్వరూపంలో అనుగ్రహిస్తుంది. ప్రమాదాన్ని తొలగిస్తుంది. ఏ స్వరూపం తత్త్వమేమిటీ నువ్వు ఆలోచించి చెప్పక్కర్లేదు. ఋషి దర్శనం చేసి చెప్పాడు దాన్ని. అదే సూక్తం. అందుకే దుర్గాసూక్తం, భూసూక్తం, నీలాసూక్తం, మన్యుసూక్తం, శ్రీసూక్తం, పురుష సూక్తం అలా సూక్తాలుంటాయి. ఆ సూక్తాన్ని మీరు పరిశీలనం చేస్తే ఓ భగవత్ తత్త్వం ఇలా ఉంటుందీ అని, సాధికారికంగా మీకు తెలుస్తుంది. బాగా చెప్పబడింది. అందుకే బాగా చెప్పబడింది కనుక ఆ భగవత్ తత్త్వాన్ని పిలవడానికి సూక్తాన్నే అన్వయం చేస్తారు. అన్వయం చేసి సూక్తంలో ఉన్న భాగాన్ని మంత్రంగా మార్చి షోడశోపచారాలకు ఆ మంత్రాల్ని తీసేసుకుంటారు. పురుషసూక్తం ఉందనుకోండి అందులో–

**ఓం సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**
**స భూమిన్ విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్**

అని పక్కనే

**హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్**

అని శ్రీసూక్తంలో మొదటి శ్లోకాన్నీ, పురుషసూక్తంలో మంత్రాన్నీ రెండింటినీ కలిపి **శ్రీఉమామహేశ్వరాభ్యాం నమః ఆవాహయామి** అంటాడు. ఆ సూక్తంలో ఉన్న రెండింటినీ కలుపుతాడు. ప్రకృతినీ, పురుషుణ్ణీ పిలుస్తాడిప్పుడు. ఆ సూక్తంలో ప్రతిపాదన చెయ్యబడినవే యజ్ అంటే ఆరాధనయందు యజుర్వేదమంటారు అందుకే. ఆరాధనా ప్రక్రియయందు వేదంలో దానిని మంత్రంగా తీసుకొచ్చి, షోడశోచార పరికల్పనయందు వాడుకుంటాడు. అది సూక్తం. సూక్తం బాగా అర్థమైందనుకోండి, స్తుతిగా మారిపోతుంది. సూక్తమే స్తుతిగా మారిపోతుంది ఒక్కొక్కసారి. పరవశంతో ఉన్నాడు. విజయవాడవెళ్ళి కనకదుర్గమ్మ ముందు నుంచున్నాడు.

**ఓం జాతవేదసేసునవా మశోమమరాతి యతోనిధః తివేధః సనః పరుషదతి దుర్గాణి విశ్వా నావేవసింధుం దురితావ్యగ్నిః**

అని ఆ దుర్గాదేవి వైభవమేమిటో ఆ సూక్తంలో పైకి పాడుతూ ఆనందపడి పోతున్నాడు. ఆనందపడిపోతూ ఆ సూక్తం చదువుతున్నాడు. ఇప్పుడు సూక్త పఠనమే స్తుతిగా మారిపోతుంది. శ్లోకమే స్తుతిగా మారిపోతుంది. వచనమే స్తుతిగా మారిపోతుంది. భజనమే స్తుతిగా మారిపోతుంది. ఏది ఎప్పుడు స్తుతిగా మారినా అది నీ పొంగువల్ల మారుతుంది. సూక్తం బాగాగా చెప్పబడింది. అందుకే సూక్త అన్వయం చేసుకుంటే జాతకంచేత కనిపెట్టబడినవాటిని పరిహరించుకుంటుంది. అదీ వేదం గొప్పతనం. వేదానికి ఉపాంగాలలో జ్యోతిష్యం ఒకటి. వేదం పురుషస్వరూపాన్ని పొందితే జ్యోతిష్యం నేత్రస్థానంలో నిలబడుతుంది.

జ్యోతిష్యం దూరంగా కాలంలో జరిగిపోయేవాటిని లెక్కపెట్టడానికి పనికివస్తుంది. శాస్త్రం సరిగా చదువుకోకపోతే వ్యక్తి తప్పేమో కానీ శాస్త్రం తప్పుకాదు. వైద్యులలో ఎవరో ఒక వైద్యుడు పొరపాటున వైద్యం తప్పుచేసి ఉండవచ్చు అందుచేత వైద్యశాస్త్రం తప్పు కాదు, వైద్యుడిదే తప్పు. జ్యోతిష్యం సరిగా తెలియనివాడు ఎక్కడో లెక్కకట్టడం తప్పు కట్టి ఉండవచ్చు, జ్యోతిష్యశాస్త్రం తప్పుకాదు. నువ్వు వ్యక్తినిబట్టి శాస్త్రాన్ని చెప్పకూడదు. శాస్త్రం చదువుకుని శాస్త్రం గొప్పతనం చెప్పాలి. నీకసలు శాస్త్రప్రవేశం లేకుండా నువ్వు శాస్త్రాన్నేం నిర్ధారిస్తావు? నీకేం తెలుసని మాట్లాడతావు దాని గురించి? జ్యోతిష్యమంటే జ్యోతిష్యమే. జ్యోతిష్యంకన్నా గొప్పదేదంటే ఈశ్వరుడు. ఈశ్వరుడే గొప్పవాడంతే. ఎందుచేతంటే జ్యోతిష్యం విషయంలో ఆ మాటన్నాను కాబట్టి మీతో ఒకటి మనవి చేస్తాను.

పూర్వం ఒక మహానుభావుడుండేవాడు. ఆయన భాస్కరగణితమని గణితాన్ని కూడా రచన చేశాడు. ఆయనకు పూర్వకాలంలో గడియారాలుండేవి కావు. నీరు చుక్క, చుక్క, చుక్కా పైనుంచి కిందపడేదాన్ని బట్టి ఘటికాకాలాన్ని లెక్కకట్టి నిర్ణయం చేసేవారు. ఆయన తన కూతురి జాతకం చూశాడు. లీలావతీ గణితం అంటారు. కూతురి పేరు లీలావతి. ఆ జాతకం చూశాడు ఆమెకి వైధవ్యముంది. పెళ్ళవగానే ఆమెకి వైధవ్యం వస్తుంది. కాబట్టి ఎట్టి పరిస్థితులలో వైధవ్యం రాకుండా ఉండే అత్యంతబలమైన ముహూర్తం చూశాడు. చూసి ఆయన పెళ్ళి చేద్దాం ఆ ముహూర్తంలో ఆమెకి వైధవ్యం రాదని పీటలమీద కూర్చోబెట్టాడు.

ఆ పిల్ల పెళ్ళిపీటల మీదకొచ్చేముందు చిన్నపిల్ల కదూ, పూర్వం **అష్టవర్షా భవేత్ కన్యా** ఎనిమిదేళ్ళకే పెళ్ళి. ఆ పిల్ల ఆడుకుంటూ ఆడుకుంటూ ఆ నీరు, ఇసుక పడే సాధనం దగ్గరకు వెళ్ళి తొంగి చూసింది. ఆమె ముక్కు పుడకలో ఉన్న చిన్న ముత్యం ఒకటి జారి అందులో పడింది. ఆ నీటిబిందువు జారవలసినచోట అడ్డుపడి పడవలసిన నీటిధార సరిగాపడలేదు ఇసుక. పడకపోతే ముహూర్తం దాటిపోయింది. దాటిపోయాక సుముహూర్తమనుకుని పెళ్ళిచేశారు. వైధవ్యం వచ్చింది. ఈశ్వరనిర్ణయం గొప్పది.

జ్యోతిష్యాన్ని ఆధారం చేసుకుని జ్యోతిషంతో నెగ్గడు. ఈశ్వరానుగ్రహంతో నెగ్గుతాడు. ఎలా నెగ్గుతాడంటే ప్రమాదం జరుగుతోందని తెలిసింది. ఇప్పుడు దుర్గాసూక్తాన్ని అన్వయం చేసుకుంటాడు. దుర్గకి అధికారం ఉంది. ప్రమాదం జరిగేవాణ్ణి కూడా ప్రమాదంలో నుంచి చెయ్యిపట్టి పైకెత్తేస్తుంది. ఇప్పుడు దుర్గాస్వరూపాన్ని ప్రతిరోజూ దుర్గాసూక్తంతో, సూక్తమంటే సూక్తంలో ఏం చెప్పారో పరిశీలిస్తాడు. పరిశీలించి పరమభక్తితో దుర్గాసూక్తం చదువుకుంటాడు. జరగవలసిన ప్రమాదం జరుగుతుంది. కానీ పెద్ద ప్రమాదం జరగవలసింది బయటపడిపోతాడు. ఇంత చెప్పాను కాబట్టి అసలు ఎన్నడూ వేదికలమీద చెప్పని విషయం ఒకటి చెప్తాను.

మా గురువుగారు ఒకసారి నా దగ్గరికొచ్చి అన్నారు- ఒరేయి నాయనా నీ జాతకంలో పరమప్రమాదకరమైన సంఘటన జరగబోతోంది నీ శరీరంలో నుంచి విపరీతంగా నెత్తురోడిపోతుంది, చాలాకాలం వైద్యశాలలో ఉండవలసి ఉంటుంది. భయంకరమైన కాలం ఆసన్నమవుతోందిరా నాయనా! ఎందుకైనా మంచిది రోజూ నువ్వు దుర్గాసూక్తం చదువు. వెంటనే నువ్వు మూడురోజులలో విజయవాడ వెళ్ళిపో కనకదుర్గమ్మ దర్శనానికి అన్నారు. గురువుగారిమాట శిరోధార్యమంతే. గురువుగారి మాట సలహా కాదు, గురువుమాట శాసనం. మరునాడే బయలుదేరివెళ్ళి కనకదుర్గమ్మ దర్శనం చేసుకొచ్చాను. దర్శనం చేసుకొచ్చి దుర్గాసూక్తం పారాయణ చేస్తున్నాను. రెండు రోజులవలేదు ప్రమాదం జరిగింది నిజంగానే. కిందపడిపోయాను ఎంత పెద్ద ప్రమాదం జరగవలసిందో. కానీ బహు ఆశ్చర్యకరంగా ఈశ్వరుడు తప్పించాడు. వేసుకున్న బట్టలు

చిరిగిపోయి, మోకాళ్ళు కొట్టుకుపోయి, నెత్తురు ధారలుగా పడిపోయింది. నాకు చాలా కోపం వచ్చింది నన్ను గుద్ది పడగొట్టిన వ్యక్తిమీద. తిట్టబోయాను, మా గురువుగారు గుర్తొచ్చారు, ప్రమాదకాలం ఆసన్నమైంది దుర్గమ్మను పూజించు అని. ఓ నా తల్లి నెత్తురు ధారలుగా కారి ఆసుపత్రిలో పడిపోవలసినవాణ్ణి సన్నగా నెత్తురు ధారలుగా పడేటట్లు, బట్టలు చిరిగిపోయేటట్లు, నేలమీద పడిపోయేటట్టు, మోకాళ్ళకి దెబ్బ తగిలేటట్టు చేసి ఎముక కూడా విరగకుండా కాపాడేసింది. కాబట్టి వాణ్ణి నిందించడమెందుకని వెళ్ళవయ్యా అని పంపించేసి, నా మానాన నేనేదో వెళ్ళాను. కాస్త ఏదో శుభ్రం చేశారు చిన్న మందులు రాశారు. ఆసుపత్రికి వెళ్ళానా లేదా, వెళ్ళాను. నెత్తురు కారిందా లేదా కారింది. పడ్డానా లేదా పడ్డాను. బట్టలు చిరిగిపోయాయా లేదా చిరిగిపోయాయి. నెత్తురు కారిపోయిందా లేదా కొంత కారింది. అత్యంతప్రమాదం జరిగిందా? లేదు. ఇంత త్రుటిలో ఆవిడ తప్పించేసిందంతే. అదీ జ్యోతిష్యాన్ని ఈశ్వరుడితో కలపడతుంటే. జ్యోతిష్యం జ్యోతిష్యంగా విన్నారనుకోండి ప్రమాదం తప్పిపోదు, ప్రమాదానికి నివారణాన్ని సూచిస్తారు. ఈశ్వరానుగ్రహంగా ప్రోది చేస్తారు. ఆయన చెప్పేశాడని కాదు. మీరు భక్తితో నిలబడాలి. పాత్రత మీది. ఆయనెవరో జపాలు చేసేసి మీ పనుల మీద మీరు తిరిగేస్తే కాదు. మీరు కూడా పరమభక్తితో అక్కడ కూర్చుని ఆ తీర్థం తీసుకోవాలి, భగవంతుడి గురించి విచారణ చేయాలి. అది సూక్తం. ఇప్పుడా సూక్తాన్ని విచారణ చెయ్యాలి. దాని తాత్పర్యం, దాని వైభవం చదువుకోవాలి. ఏ దేవీభాగవతమో చదువుకోవాలి. అది సూక్తం. కాబట్టి మనకి పరమేశ్వరుడు అనుగ్రహించాడు వీటిని.

ఋషులు అనుగ్రహించారు ప్రార్థన, స్తుతి, సూక్తం. ఇందులో సూక్తం మాట దేవుడెరుగు. సూక్తం అందరూ చదవలేరు. సూక్తం అందుకే నువ్వు చదువుకోలేకపోవచ్చు. నువ్వు చదవకూడదనిదానికి, చదవలేనిదానికి పాకులాడకూడదు. వేదంలో అది రహస్యం. ఏవి స్వరప్రోక్తాలో వాటి జోలికి నువ్వు వెళ్ళకూడదు. నువ్వు గురుముఖతః నేర్చుకుంటేనే వెళ్ళాలి. గీతలుంటాయి పైకి గీతా, కింద గీతా గీసి ఉంటుంది. అలా ఉందంటే అది గురుముఖతః నేర్చుకుంటేనే చదవాలి. రుద్రాధ్యాయం ఉందనుకోండి రుద్రాధ్యాయం వచ్చు కదా అని చదవకూడదు. ఎందుచేతంటే అది స్వరప్రోక్తం. నీకు స్వరంతో చెప్పడమొస్తేనే

చదవాలి. స్వరంతో చెప్పడం రాకపోతే ఊరుకోవాలి. నువ్వు చెప్పక్కర్లేదు. స్వరంతో చెప్పినవాడు చెప్తే నువ్వు కర్మ చెయ్యి. చేసి నువ్వు ఆయన కాళ్ళకి నమస్కారం చేస్తే చాలు. ఆయన కాళ్ళకి నమస్కారం చేస్తే నీకా అనుగ్రహం కలుగుతుంది. నీకు చదువురాకపోవచ్చు. చదువు వచ్చినవాడు పైన రెండెకరాల పొలం ఇమ్మని రాశాడు. నువ్వు నిశానీ వెయ్యి చాలు, పొలం రాసినవాడికివ్వరు, నీకే ఇస్తారు వేలిముద్ర వేసినందుకు. నీకు రాకపోవచ్చు. కష్టపడి నేర్చుకుని గురువుగారి దగ్గర స్వరంతో చెప్పడం వచ్చినవాడు కనబడినప్పుడు వాడు ఇంటికొస్తే, వాడితో చెప్పించాలి కాసేపు. అందుకే ప్రతీ ఇంటా వేదపఠనం జరగాలని పెద్దలు నిర్ణయం చేశారు.

శ్రావణ, భాద్రపదమాసాల్లో వేదపండితులు తమంతతాముగా ఇళ్ళ కొస్తారు. వాళ్ళు ఇంటికొస్తే తలుపేసేసుకోకూడదు. రండి అనీ, వాళ్ళు వచ్చి ఉత్తినే కూర్చుని వెళ్ళిపోరు. ఒక్క పన్నం చదువుతామంటారు. అయ్యా, చదవండని కింద కూర్చోవాలి. వాళ్ళు చక్కగా స్వరంతో పన్నం చదువుతారు. నిస్వార్థపరులై ఉండాలి. ప్రతిదానికీ డబ్బు లెక్కకట్టి వేదం నేర్చుకున్నవాడు, అక్కర్లేని రజోగుణసంపర్కంతో లక్షలకొద్దీ డబ్బు సంపాదించే ప్రయత్నంలోకి వెళ్ళాడా, వేదాన్ని అడ్డుపెట్టి కోట్ల జన్మలు క్రిమికీటకాదులుగా నశించిపోతారు. నిస్వార్థపరుడై ఉండాలి. ప్రతిగ్రహణం ఉండకూడదని వేదం చెప్పలేదు. పరమతృప్తితో గడపాలి బ్రాహ్మణజీవితమంటే. ఎంత సంతోషంగానో ఉండాలి. **సంతోషోహి ద్విజన్మనాం.** వేదం చదువుకున్నావని గుర్తేమిటంటే అవతలివాడు నీ చేతిలో పెట్టింది అర్ధణా కాసైనా నువ్వు పొంగిపోవాలి. నా చదువు ఉపయోగపడింది వాడిని ఉద్ధరించడానికి చాలు. ఆ పొంగు నీకు లేకుండా నీకొచ్చిన విద్యకి లక్షలు లెక్క కట్టి పుచ్చుకుంటే పాతకుడివైపోతావు. డబ్బు కోసం వెంపర్లాడడం బహు తప్పు. బ్రాహ్మణ్యంలో లేదు. వ్యాసుడు స్పష్టంగా చెప్పాడు.

**యతీనాం భూషణం జ్ఞానం సంతోషోహి ద్విజన్మనాం ఉద్యాం శత్రుహననం భూషణం భూతిముచ్యతాం**

అని. యతి, సన్యాసి అంటే జ్ఞానమే. రాశీభూతమైన జ్ఞానమే సన్యాసిగా ఉండాలి. అలాగే సంతోషోహి ద్విజన్మనాం. డబ్బుకోసం వెంపర్లాడినవాడు వేదం

చదువుకున్నవాడు కాదు. అసలు వేదం చదువుకున్నవాళ్ళలా ఉండరు. నాకెందరో తెలుసు. మహానుభావులు వేదపండితులు కొంతమంది కృష్ణాజిల్లాలో లంక గ్రామాల్లో ఉండే నిత్యాగ్నిహోత్రికులు నాకు ప్రసాదాలు పంపించేవారు. వాడు నోరు కొట్టుకు చెప్తున్నాడు, వాడు పదికాలాలు బ్రతకాలని మేము అనుష్ఠానం చేసి ప్రసాదం పంపిస్తున్నాం, నీరసంగా కనబడ్డాడు నిన్న అని. అదీ బ్రాహ్మణ్యం. అదీ వేదం చదువుకోవడమంటే. అదీ తృప్తి అంటే. కాబట్టి **సంతోషోహి ద్విజన్మనాం, ఉద్యాం శత్రుహననం, భూషణం భూతిమిచ్ఛతాం**. శత్రువుల్ని చంపడంలో తాను చచ్చిపోయినా, ధర్మం కోసం పదిమందిని కాపాడడానికి తాను పడిపోవడానికి సిద్ధపడినవాడు వీరుడు, క్షత్రియుడు. ఎవరు ఎలా ఉండాలో వ్యాసభగవానుడు చెప్పాడు. కాబట్టి అంత నిత్య తృప్తితో ఉంటాడు బ్రాహ్మణుడు. ఆ బ్రాహ్మణుడు వచ్చి చక్కగా సూక్తపఠనం చేసినా, వేదమంత్రాన్ని పఠనం చేసినా నువ్వు ఇది చదవాలని నియమమేం లేదు. నువ్వు నేలమీద పడి ఒక నమస్కారం చేస్తే చాలు. నువ్వు ఇచ్చిందే అనవసరం. నువ్వు ఇచ్చినదానితో సంతోషంగా ఆయన వెళ్ళిపోవాలి అంతే. అలా ఉండాలని వేదం నిర్ణయం. కాబట్టి ప్రార్థన తప్పుకోవడానికి వీల్లేదు. ఎవ్వరైనా ప్రార్థన చెయ్యవలసిందే. ప్రార్థన చెయ్యడానికి ఒక శ్లోకమో, ఒక పద్యమో కూడా మాకు రాదూ అంటే, అంతకన్నా అన్యాయమైన జీవితం లోకంలో ఇంకొకటి లేదు.

కనీసంలో కనీసం

**శుక్లాంబరధరం విష్ణుం**
**శశివర్ణం చతుర్భుజమ్**
**ప్రసన్నవదనం ధ్యాయేత్**
**సర్వ విఘ్నోప శాంతయే॥**

అదొక్కటి కూడా నాకు రాదండీ అంటే ఇంక పరమేశ్వరుడు నీకు స్వరపేటిక ఇవ్వడమెందుకు? మనుష్యజన్మ ఇవ్వడమెందుకు? కనీసంలో కనీసం ఏదో ఒక్క పద్యమైనా వచ్చి ఉండాలి. పరమసంతోషంతో దానిని నువ్వు అనుసంధానం చెయ్యగలిగి ఉండాలి. అదీ పరమతృప్తితో నువ్వు దానిని అన్వయం చేసి నమస్కరిస్తే భగవంతుడు నిన్ను అనుగ్రహిస్తాడు. కాబట్టి ప్రార్థన, స్తుతి, సూక్తం ఇవి ఒకరోజు

కార్యక్రమంలో ఎక్కడో అక్కడ ఇముడుతాయి. సూక్తం ఇమడకపోవచ్చు కానీ అంటే వైదికంగా చదువుకోనివాడు సూక్త పఠనం చెయ్యకపోవచ్చు. కానీ స్తుతి, లోపల హర్షముంటే నువ్వు ఏం చెప్పినా ఆనందమే, నువ్వు ఏం చెప్పినా సంతోషమే. ఇప్పటికీ నాకు మా తూర్పుగోదావరి జిల్లాలో ఉన్న కొంతమంది వేదపండితులు మాట్లాడుతూ మాట్లాడుతూ వాళ్ళ గురువుగారి పేరు చెప్పి డెబ్బై ఎనిమిదేసి ఏళ్ళు, ఎనభయ్యేసి ఏళ్ళు వచ్చేసినవాళ్ళు గురువుగారి పేరు చెప్పగానే ముక్కమ్మట నీళ్ళుకారిపోతూ వెక్కి వెక్కి ఏడ్చేస్తారు గురువుగారి పేరు పూర్తిచెయ్యరు. పూర్తిచెయ్యకుండా ఆ ఊపిరి మాకు ఫణం పెట్టేశారండీ అంటారు. ఆయనా వేదం స్వరంతో చెప్పి ఊపిరి వేగంగా పీల్చి ఆయుర్ధాయాన్ని పోగొట్టేసుకున్నారు మా కోసం, మాకు పాఠం చెప్పడానికి శరీరం వదిలేశారు అని ఆ గురువుగారి పేరు చెప్పి ఏడ్చేస్తారు. ఇప్పటికీ ఉన్నారు ఎంతమంది మహానుభావులో. కృష్ణావధానులుగారని పెద్దలు. వారు ఇప్పటికీ గురువుగారి పేరెత్తేటప్పటికి ఎనభైయేళ్ళు దగ్గరికొస్తున్నాయి, ఆయన కళ్ళు చెమర్చేసి ముక్కులవెంట నీరు కారిపోయి ఒక్క నిమిషం ఇలా తలొంచేసుకుంటారు. కంఠం గాద్గదికమైపోతుంది. ఇప్పటికీ నా దగ్గర ఆయన ఎప్పుడు మాట్లాడినా వారి గురువుగారి పేరు తిన్నగా ఉచ్చరించి చెప్పింది లేదు. గురువుగారి పేరెత్తితే ఆనందబాష్పాలు వచ్చేస్తాయి. అదీ గురుభక్తి అంటే, అదీ వేదమంటే, అదీ హృదయ సంస్కారమంటే, అదీ సంపన్నత అన్నమాటకి అర్థం. కాబట్టి భగవంతుడు మనకు దేన్ని కటాక్షించాడో దానిని చక్కగా ఒకరోజు కార్యక్రమంలోకి అన్వయం చేసుకుని మనం ధన్యులం కావాలి.

ఇక మనకి పంచ యజ్ఞాలు ఉంటాయి. ఈ అయిదు యజ్ఞాలు ప్రతీ వ్యక్తి చెయ్యవలసిందే. బ్రహ్మ యజ్ఞం, దేవ యజ్ఞం, మనుష్య యజ్ఞం, పితృ యజ్ఞం, భూత యజ్ఞం. ఈ అయిదింటినీ పంచ యజ్ఞాలు అంటారు. ఎందుచేతంటే బ్రహ్మచారికి హింసాదోషం ఉండదు. బ్రహ్మచారి అన్నానికి గృహస్థు మీద ఆధారపడతాడు. బ్రహ్మచారి గృహస్థు ఇంటిముందుకు వచ్చి **భవతి భిక్షాందేహి** అంటాడు. గృహస్థాశ్రమానికి ధన్యత దేనివల్లా అంటే బ్రహ్మచారికి, సన్యాసికి భిక్ష పెడతారు. కాబట్టి బ్రహ్మచారి గృహస్థు మీద ఆధారపడిపోతారు. సన్యాసీ గృహస్థు మీదే ఆధారపడతాడు. సన్యాసి శరీరం నిలబడాలన్నా గృహస్థే ప్రధానం. గృహస్థు

అన్నాన్ని భిక్షగా పెడతారు కాబట్టి సన్యాసి నిలబడతాడు. అందుకే రామాయణంలో వాల్మీకి మహర్షి తీర్పిచ్చారు. నాలుగు ఆశ్రమాల్లో గృహస్థాశ్రమమే గొప్పది. గృహస్థాశ్రమం లేనినాడు బ్రహ్మచర్య ఆశ్రమం లేదు, సన్యాస ఆశ్రమం లేదు. కాబట్టి అటువంటి గృహస్థాశ్రమంలో వచ్చిన వాళ్ళకందరికీ కూడా అన్నం పెడతారు. బ్రహ్మయజ్ఞాన్ని కొంతమంది చెయ్యవలసి ఉంటుంది. యజ్ఞోపవీతం ధరించినవాళ్ళు చెయ్యాలి. శంకరాచార్యులవారు అవతార పరిసమాప్తి చేస్తుంటే శిష్యులందరూ వెళ్ళి అడిగారు. అయ్యా, మీరు మహా సముద్రమంతటి వాఙ్మయం ఇచ్చారు. మేమెక్కడ చదువుతాం, ముఖ్యమైన విషయాలు మాకు చెప్పండీ అన్నారు. మొట్టమొదట వారి నోటివెంట ఏది వచ్చిందో అది అత్యంతముఖ్యమైనదని అర్థమవుతుంది కదా. **వేదో నిత్య మధీయతాం మధురితం కర్మ స్వనుష్ఠీయతాం** అన్నారు శంకరాచార్యులవారు. ప్రతిరోజూ వేదం చదవండి. వేదం ఎలా చెప్పిందో అలాగే మీరు చేసే పనిని చెయ్యండి అని చెప్పారు. అంటే వేదం ప్రతిరోజూ చదువుకోవాలి.

అభివాదమని ఒకటుంటుంది. నమస్కారం చేస్తారు. నమస్కారమంటే అన్నీ నమస్కారాలు కావు. నమస్కారంలో చాలా మార్పులుంటాయి. రకరకాలుగా ఉంటుంది నమస్కారం. నమస్కారమంటే ఇలా తలకి తగలకుండా పెడితే అంజలి. అమ్మ కనబడిందనుకోండి పొట్టమీద పెట్టి పెట్టాలి ఇలా. నాన్నగారు కనబడితే నోటిమీద పెట్టి పెట్టాలి. గురువుగారు కనబడ్డారనుకోండి, గురువుగారు కనబడ్డారూ అంటే ఇంతే. గురువుగారిది శాసనం. అవధులు దాలుస్తాను అని. ఇష్టదైవం కనబడితే తలకి తగలకుండా పెట్టాలి. కులదైవం కనబడితే గుండెలమీద పెట్టుకుని పెట్టాలి. ఎక్కడైనా సాష్టాంగం చెయ్యడానికి అవకాశముంటే ఇతరదేవతల వైపు కాళ్ళు వెళ్ళడంలేదూ అంటే ఒక్క తూర్పు, ఉత్తర, పశ్చిమాలు మాత్రమే తలవైపు వచ్చేటట్లుగా నేలమీద పడి చెయ్యాలి. ఆ చేసేటప్పుడు కూడా **ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణా మోష్టాంగముచ్యతే** ఎనిమిది అవయవాలు తగిలేటట్లుగా నేలమీద పడాలి. ఆడవాళ్ళయితే పంచాంగనమస్కారమే. వాళ్ళకి సాష్టాంగనమస్కారం లేదు. వాళ్ళు నేలమీద పడి నమస్కారం చెయ్యకూడదు. ఆడవారి గుండెలు కానీ, ఆడవారి నడుముకు కింది భాగం, తొడల పైభాగం కానీ నేలని తగలకూడదు.

ఎందుకు తగలకూడదూ అంటే ఒక్కటే కారణం. ఈ సమస్తసృష్టీ నిలబడిందంటే స్త్రీ యొక్క ఆ రెండు భాగాలచేతనే కాపాడబడుతుంది. అధోభాగాలనుండి సమస్తసృష్టీ జరుగుతోంది. ఊర్ధ్వభాగంలోని స్తనాల వల్ల సమస్తసృష్టి అంతా **పోషించబడుతోంది. అవి రెండూ అత్యంతపవిత్రాలుగా పరమేశ్వరుడు భావన చేసి నువ్వు నా ముందు నమస్కరించినా నేలకి తగలక్కర్లేదని మినహాయింపునిచ్చాడు.** స్త్రీని అంత గౌరవించింది వేదం. అంత గౌరవించాడు పరమేశ్వరుడు. కాబట్టి వాళ్ళకి పంచాంగనమస్కారమే. అభివాదం అని ఉంటుంది. అభివాదమంటే పరిచయం చేసుకొనటం. ఎక్కడపడితే అక్కడ అభివాదం చెయ్యకూడదు. పదిమందిలోకి వచ్చి కూర్చుని ఉన్నాడనుకోండి. చుట్టూ జనం ఉండగా అభివాదం చేసి నమస్కారం చెయ్యకూడదు. ఆయన ప్రశాంతచిత్తుడై ఉన్నప్పుడు, ఒక్కడే ఉన్నప్పుడు వెళ్ళి పరిచయం చేసుకుంటారు.

**చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్య శ్శుభంభవతు ఆత్రేయస అర్చనానస సావాస్య త్రయారుషేయ ప్రవరాన్వితా ఆత్రేయస గోత్రః ఆపస్తంబ సూత్రః యజుశ్శాఖాధ్యాయి కోటేశ్వరశర్మ అహంభో అభివాదయే**

అని వంగుని చెప్పాలి అభివాదం చెప్తే. ఎంత వంగుని చెప్పాలీ అంటే రెండు పాదాల ప్రారంభస్థానాలను రెండు కాళ్ళతో పట్టుకోవాలి, అభివాదం అయిపోయాక. చెవులు పట్టుకు చెప్తారిలా. చెప్పి ఈ రెండు పాదాలూ పట్టుకుని మోకాళ్ళ వరకూ చేతులు జరుపుతూ పైకి లేవాలి. లేచి నమస్కరించాలి ఇలా రెండు చేతులతో. అప్పుడు అభివాదం పూర్తయ్యింది అంటారు. అంటే పరిచయం చేసుకున్నాడూ అని. అది అవకాశం ఉంటేనే చెయ్యాలి తప్ప ఎంతమంది మధ్యలో ఉన్నా అభివాదం చెయ్యకూడదు. అది అభివాదం, సాష్టాంగం. ఒక్కొక్కచోట ఒక్కొక్క నమస్కారం. అన్ని నమస్కారాలూ ఒకలా ఉండవు. నమస్కారం చేశాడూ అంటే గుర్తేమిటో తెలుసా? నేలమీద పడితే ప్రణిపాతమంటారు. స్వర్ణదండం–కర్ర–పడిపోయినట్లు పడిపోతాడు. అలా పడిపోయాడంటే నేను ఎంత కింద పడిపోవచ్చో అంత పడిపోయాను. ఇంక కింద పడ్డానికేం లేదు. అంత కిందపడ్డాను. మీరు నిలబడినవారు. నేను పడిపోయినవాణ్ణి. నన్ను మీరు పైకెత్తండి అని అడిగినట్లు. ఎవరు తన కాళ్ళ దగ్గరికొచ్చి పడిపోయారో వాడు

వృద్ధిలోకి రావాలని భగవంతుణ్ణి ప్రార్థన చెయ్యవలసిన కర్తవ్యం, ఎవడి ముందు పడ్డాడో వాడి మీద ఉంటుంది. నమస్కారం పుచ్చుకోవడం అంత తేలికకాదు. నమస్కారం పుచ్చుకోవడం పెద్ద బరువు. అంత జాగ్రత్తగా ఉండాలి నమస్కారం పుచ్చుకోవడమంటే. కాబట్టి ఆ నమస్కారం చేసే విధానంలో .వినయం ఆవిష్కృతమవుతుంది.

బ్రహ్మయజ్ఞం. బ్రహ్మయజ్ఞమంటే వేదాన్ని అభ్యసించటం తాను ఏ వేదంలో పుట్టాడో, తాను ఏ సూత్రంలో పుట్టాడో వాటి గురించి అవగాహన ఉండాలి. నోటితో చెప్పడం కాదు. ఆపస్తంబ సూత్రః అంటే నీ పెళ్ళి ఎప్పుడైంది, లేకపోతే మీ అమ్మాయి పెళ్ళి ఎప్పుడు చేశావోయి అని అడిగారనుకోండి ఆపస్తంబసూత్రులు ఎప్పుడు పెళ్ళి చేయాలని సూత్రాలలో చెప్పబడిందో అప్పుడే కూతుర్ని కన్యాదానం చేసినవాడై ఉండాలి. అప్పుడు మానేసి వసంత ఋతువులో చెయ్యడం మానేసి కార్తికమాసంలో చేశానండీ అన్నాడనుకోండి. వాడెప్పుడూ చదవలేదు ఆపస్తంబసూత్రాలని గుర్తు. ఉట్టినే నోటితో చెప్తున్నాడని గుర్తు. అభివాదం చేస్తే ప్రశ్న వేస్తే జవాబు చెప్పేటట్లు ఉండాలి. కాబట్టి ఆ ఋషుల జీవితాలు తెలుసుకొని ఉండాలి. అది సంతోషకారకం. వాళ్ళు వంశకర్తలు. బ్రహ్మ యజ్ఞం అంటే స్వాధ్యాయం. వేదం చదువుకుంటాడు. అదీ యజ్ఞోపవీతం ఉండి, గాయత్రీమంత్రానుష్ఠానం చేసే వాళ్ళకి ఉద్దేశించబడింది శాస్త్రంలో. ఒక్కొక్కరు ఒక్కొక్క పనిచేస్తారు. అందరూ ప్రభుత్వోద్యోగులే. ఒకాయన యూనిఫాం వేసుకుని పోలీసు, ఒకాయన డాక్టరు, ఒకాయన లైబ్రేరియన్. ఎవరు ఏం చేశారన్నది కాదు. ఎవరు చేసినా ప్రభుత్వసేవకులే. అలా ఒక్కొక్కరికి ఒక్కొక్క కర్తవ్యాన్ని వేదమిచ్చింది తప్ప ఒకరు ఎక్కువని కాదు, ఒకరు తక్కువని కాదు. నిజానికి ఒక్కొక్క కర్తవ్యాన్ని మోసేవాడి జీవితం చాలా కష్టంగా ఉంటుంది. అది తెలియక అదేదో చాలా పెద్ద కిరీటం అనుకుంటూ ఉంటారు. కాబట్టి స్వాధ్యాయం ప్రతిరోజూ తాను ఏ వేదంలో పుట్టాడో, ఆ వేదానికి సంబంధించిన విషయాన్ని చదువుకునే విషయానికి బ్రహ్మయజ్ఞం అని పేరు.

బ్రహ్మయజ్ఞం తరువాత దేవ యజ్ఞం అని ఉంటుంది. దేవ యజ్ఞం అంటే దేవతలకి హవిస్సు ఇవ్వాలి. హవిస్సు అంటే అగ్నిముఖంగా ఇస్తారు.

హోమగుండంలో అగ్ని గుండం వ్రేల్చి స్వాహా అంటూ నేతినీ, ఆవు నేతినీ, చరు అంటారు హవిస్సునీ, సమిధ మూడూ ఏకకాలంలో పడాలి అగ్నిహోత్రంలో. పడుతూంటే ఆ అగ్ని జ్వలిస్తూ ఉంటుంది. యథార్థానికి సనాతనధర్మంలో ఉన్న మనందరం కూడా అగ్ని ఆరాధకులం. అందరూ అగ్ని ఆరాధకులు. నిజంగా పరమసత్యం చెప్పాలంటే చెయ్యకపోతే తప్పండీ అని ఒక్కమాట చెప్తే పోతుంది తప్ప, సమర్థించుకునే ప్రయత్నం చెయ్యకూడదు. అగ్నిహోత్రం ఉండాలి ఇంట్లో. నిత్యాగ్నిహోత్రికుడై ఉండాలి. భార్య ప్రధానకర్తవ్యమేమిటంటే అది నిధనమైపోకుండా కాస్త ఊకా అదీ వేస్తుంటుంది. ఆయన దగ్గర చదువుకుంటున్న శిష్యులు సాయంకాలం సమిధాదానం చేస్తారు. సమంత్రకంగా అందులో పడేస్తారు. ఓ సమిధ పడేస్తారు. గాయత్రి చేసుకుంటారు. వేదం అలా ఉండమని ఆశ్రమనిర్ణయం చేసింది. ఆ అగ్నిని ఆరాధించి, ఆరాధించి, చిట్టచివర శరీరం వదిలేస్తే ఈ అగ్నిహోత్రాన్నే పట్టుకెళతాడు కొడుకు. మా నాన్న బ్రతికున్నంత కాలం నిన్ను ఆరాధించాడు, నీలో హవిస్సు వేశాడు. ఓ అగ్నీ మా, నాన్నగారి శరీరాన్ని హవిస్సుగా వేసేస్తున్నాను, దీన్ని కాల్చీ కాల్చక, తీసుకెళ్ళీ తీసుకెళ్ళక బాధపెట్టకుండా భగ్గున కాల్చి దేవతలకి తీసుకెళ్ళిపో. ఇంతకుముందు ఆయనిచ్చిన హవిస్సు దేవతలకిచ్చినట్లు, ఆయన్ని దేవతలకి అప్పజెప్పెయ్యమని కొడుకు మంత్రం చెప్పి అగ్నిహోత్రంలో వేస్తాడు. అంత పవిత్రంగా నడిచింది సనాతనధర్మం. అంత పవిత్రమైన జీవనం చెయ్యమని చెప్పింది. కాబట్టి మనం చేసే దాంట్లో దేవ యజ్ఞం అంటే దేవతలకి హవిస్సు ఇవ్వాలి. దీన్నే ధర్మచక్రం అంటారు. ధర్మచక్రాన్ని పరమేశ్వరుడు నిర్ణయం చేశాడు. దేవతల్ని నిర్ణయం చేశాడు. వీళ్ళు వీళ్ళు దేవతలు, వీళ్ళ వీళ్ళకి అధికారం ఉంటుంది అన్నాడు. ఇంద్రుడు వర్షం కురిపిస్తాడు. వాయువు గాలి ప్రభంజనం కాకుండా అందరికీ చక్కగా అందేటట్లుగా, వీచేటట్లుగా ఉంటాడు. అలా ఒక్కొక్క దేవతకి ఒక్కొక్క అధికారమిచ్చాడు.

అగ్నిని ప్రతివాళ్ళింట్లో వంట చెయ్యమన్నాడు.

**హవ్యం మహతి దేవానాం కవ్యం కవ్యాసి నామపి పాటంచ కుడుతేవహ్నిః శంకరస్యైవ శాసనాత్** అంటుంది లింగపురాణం. ఆయన ప్రతి ఇంట్లో వంట చేసి

పెట్టాలి. వంట బ్రాహ్మణుడు అగ్నిహోత్రుడై ప్రతి ఇంట్లో. యజ్ఞం చేసినప్పుడు దేవతలకి హవిస్సు పట్టుకెళ్ళాలి. స్వధా శబ్దంతో చేస్తే పితృదేవతలకి కవ్యాన్ని పట్టుకెళ్ళాలి. అది అగ్నిహోత్రుడి అధికారం. ఒక్కొక్క దేవతకి ఒక్కొక్క అధికారాన్ని పరమేశ్వరుడిచ్చాడు. ఈ దేవతలకి కడుపు నిండడం దేనిమీద ఆధారపడుతుందంటే మనమిచ్చే హవిస్సు వాళ్ళు తింటారు. వాళ్ళు ఆ హవిస్సు తిని సంతోషించి వీడు మాకు హవిస్సు ఇచ్చాడురా అని వర్షం కురిపిస్తారు. మనని క్షేమంగా చూస్తారు. మనమిక్కడ పంటలు పండి సంతోషంగా జీవనం చేస్తూ దేవతలకి మళ్ళీ యజ్ఞం చేస్తాం. మళ్ళీ యజ్ఞంలో హవిస్సు దేవతలు తింటారు. మళ్ళీ ప్రసన్నులై మళ్ళీ మేలు చేస్తారు. మళ్ళీ యజ్ఞం చేస్తాం. యజ్ఞమూ, దేవతలూ, అనుగ్రహమూ, మనుష్యుడూ ఇది ధర్మచక్రం. ఈ చక్రం తిరుగుతూ ఉంటుంది. ఇది యజ్ఞం అనే క్రతువు కేవలం సనాతనధర్మంలోనే ఉంది. ఇక ఏ ఇతరవిశ్వాసంలోనూ లేదు. అగ్నిముఖంగా స్వాహాకారంతో దేవతల్ని పిలిచి హవిస్సు ఇవ్వడం ఒక్క సనాతనధర్మానికే చెల్లింది. దేవతలు ప్రీతిచెంది మనకి కావలసినవాటినన్నింటినీ సమకూరుస్తారు. అందుకే ఆ యజ్ఞయాగాది క్రతువులు ఇక్కడొక్కచోటే చెయ్యాలి. భరతవర్షే, భరతఖండే ఇక్కడ జరిగితే ప్రపంచంలో ఉన్న అందరూ సంతోషంగా ఉంటారు. అందుకే ఇది పూజాగృహం. ఇది శక్తి కేంద్రం. ఇక్కడ పుట్టడం అదృష్టం. కాబట్టి యజ్ఞయాగాది క్రతువులను చేసి దేవతలను సంతోషపెట్టడం దేవయజ్ఞం అంటారు. దేవయజ్ఞం చేసి దేవతలని ప్రీతి చెందిస్తాడు.

అందుకే పూర్వం ఒక పనిచేసేవారు. అన్నం వండిన మొట్టమొదటి ఇంట్లో బ్రాహ్మణుడెవరంటే, నువ్వు పిలిచి ఎవరికైనా అన్నం పెట్టావో, పెట్టలేదో తెలియదు. నీ ఇంట తప్పకుండా వచ్చి అమ్మా నేను చేసిపెడతానని చెప్పి పంచె కట్టుకుని నీకు వంట చేసిపెట్టిన వాడెవరంటే, నీ ఇల్లాలితో కలిసి అగ్ని భట్టారకుడు. భట్టారక అన్న పేరు ఎక్కడైనా ఉందీ అంటే పూజనీయుడని గుర్తు. లలితాపరా భట్టారికా, శృంగార భట్టారక, క్రోధ భట్టారక, అగ్ని భట్టారకా. భట్టారకా, భట్టారికా– ఇవి అన్నారూ అంటే అర్థమేమిటంటే పూజించు, వెంటనే దాని అర్థమేమిటంటే గౌరవించు అని. నువ్వు పూజ చేసుకుంటున్నావు. నువ్వు ఏవో చదువుకుంటున్నావు.

నీ భార్య వంట చేస్తోంది, నీ భార్యకి తోడుగా వచ్చి నీకు అన్నం వండడానికి, నీ ఇంట పనిచేసిన బ్రాహ్మణుడు అగ్నిహోత్రుడు. ఆయన వంటచేసి పెట్టాడు నీకు. అసలు నువ్వు తినేసి ఆయన్ని ఉపవాసం పెడితే నీ తేజస్సు క్షయమైపోతుంది.

అందుకే పూర్వం నాకు బాగా జ్ఞాపకం మా చిన్నతనంలో పొయ్యి మీద వంటచేసేవారు. అన్నమంతా వండేసిన తరువాత మా అమ్మగారు కొద్దిగా మెతుకులు పట్టుకుని కాస్త నెయ్యివేసి **దివిషద్వర్గము నీమఖంబుననుసంతృప్తిన్ కాగాంచున్** అంటూ అగ్నిహోత్రుణ్ణి ప్రార్థన చేసి నేతి మెతుకులు అగ్నిహోత్రంలో వేసేవారు. కనీసంలో ఒక్క మెతుకు నేతిలో ముంచైనా అగ్నిహోత్రుడికివ్వాలి. ఆయన మొదటి బ్రాహ్మణుడు. ఆయనకి పెడితే ఇంట్లో సద్బ్రాహ్మణుడు భోజనం చేసిన తరువాత తత్ ప్రసాదాన్ని మిగిలినవాళ్ళు తిన్నట్లు. అవమానించటం అన్న మాటకి అర్థమేమిటో తెలుసా? ఉచ్ఛిష్ట నిరాకరణం. పెద్దలు తినగా మిగిలింది తాను తినాలి. అంతే తప్ప పెద్దలతో కలిసి తాను తినేశాడనుకోండి, అప్పుడు ఇద్దరూ సమానంగా తిన్నారు. ఏం గౌరవమిచ్చినట్లు? గౌరవమేం ఇవ్వలేదు. అంటే నువ్వు పూజార్హుడవు కావు అని చెప్పినట్లు. అప్పుడు సమ పంక్తిలో తింటారు. సమపంక్తిలో తినకుండా ఇంటికి వచ్చిన అతిథికి ముందు పెట్టి తరువాత తాను తింటాడు. అంటే బ్రాహ్మణోచ్ఛిష్టం. అగ్నిహోత్రుడి ఉచ్ఛిష్టాన్ని మేము తిన్నాం.

గురువుగారు వచ్చారనుకోండి, గురువుగారు తిన్నాక తినాలి. గురోచ్ఛిష్టం. ఆయన తినగా మిగిలింది. గురువుగారితో నువ్వూ కూర్చుండిపోయావనుకో కించిత్తు దోషం. అంటే సహృదయం ఉన్నవాళ్ళు దిద్దుకుంటారని చెప్పడమంతే. కాబట్టి అది ఏదో మెహర్బానీకి కాదు, మన సంస్కారమంతే. ఆ గౌరవం మనం అభ్యున్నతిలోకి రావడానికి మార్గం. ఎవరికో ఏదో ఒరగబెట్టామనుకోకూడదు మనం. అగ్నిహోత్రుడు ఇంట భట్టారకుడై ఉన్నాడు, బ్రాహ్మణుడై ఉన్నాడు. ఈయనకి ముందు నేతితో ఒక్క మెతుకైనా ఇవ్వాలి. ఇస్తే నువ్వు నిత్యాగ్నిహోత్రం చేసినట్లు. రోజూ యజ్ఞం చేసినట్లే నువ్వు. కాబట్టి ప్రతివాళ్ళూ యజ్ఞంలో పాలు పంచుకోవాలి. యాగం జరుగుతోందీ అంటే పాలు పంచుకోవాలి. తమ ద్రవ్యం కొంత ఖర్చుపెట్టాలి. యాగశాలకి ప్రదక్షిణం చెయ్యాలి. వెళ్ళి అక్కడ చక్కగా నమస్కారం చేసుకోవాలి. ఎందుకని?

మీరొకటి ఆలోచించండి. కోటేశ్వరరావుగారూ, కోటేశ్వరరావుగారూ మా ఇంటికి భోజనానికి రండి అన్నారనుకోండి. నేను మీ ఇంటికి భోజనానికి వస్తూనే విస్తరిమీద పడిపోతానా? మీ ఇంటికి భోజనానికి వచ్చి కూర్చుంటానా? ముందు కూర్చుంటాను కదూ. కాళ్ళు కడుక్కోండి అంటారు. నేను కాళ్ళు కడుక్కుని, చేతులు కడుక్కుని నా లాల్చీ విప్పి, నా బనీను విప్పేసి భోజనం చెయ్యడానికి వీలుగా సిద్ధమవుతాను. ముందు కూర్చుంటాను. తరువాత ఇల్లాలు వడ్డిస్తుంది. ఆ ఇంటి ఇల్లాలు వడ్డించి రండి అని అన్న తరువాత వెళ్ళి కూర్చుంటాను అప్పుడు కదూ పరిషేచనం చెయ్యడం. అంటే ముందక్కడ కూర్చున్నానా లేదా? యజ్ఞం జరుగుతోందీ అంటే అన్నం తినడానికి దేవతలక్కడికొచ్చి ముందు కూర్చుంటారా? కూర్చోరా? దేవతలు కూర్చుంటే లక్షణమేమిటో తెలుసా? మీరు ప్రదక్షిణం చేస్తే వాళ్ళు వరమిస్తారు.

ప్రదక్షిణం అన్నమాటకి అర్థమేమిటో తెలుసా? దక్షిణం అంటే నీకు కుడివైపు ఉన్నదీ అని గుర్తు. మనం ఎప్పుడూ ఎటుండాలంటే తూర్పు వైపు ఉండాలి. అంటే పూజ చేస్తున్నాడూ అని లెక్కపెట్టి చెప్తారు. పూజ చేసేటప్పుడు మనం తూర్పుని చూడాలి. మనం తూర్పుని చూస్తాం కాబట్టి మన కుడిచేతివైపు ఏదుంది? దక్షిణముంది. అందుకని ప్రదక్షిణం అన్నమాటకి అర్థమేమిటంటే నేను ప్రయత్నపూర్వకంగా నా కుడివైపు ఉంచానని గుర్తు. ప్రదక్షిణం చేస్తే దానిచుట్టూ నేను తిరిగినా అది నా కుడిచేతివైపే ఉంది. అంటే అత్యంతపూజనీయమై అది నాకు గౌరవాన్ని తెచ్చిపెట్టగలదు. నాకెంతో మేలు చెయ్యగలదని నమ్మితే ప్రదక్షిణం చెయ్యాలి. గురువుగారనుకోండి గురువుగారికి ప్రదక్షిణంగా వచ్చి పూలమాల వెయ్యాలి. చుట్టూ తిరిగొచ్చి పూలమాల వెయ్యాలి. అంతేకాని ఇలావచ్చి ఆ హారం వేసి వెళ్ళరు. నాకు వెయ్యవచ్చు తప్పులేదు. మీ గురువుగారు కనబడ్డారనుకోండి మీ గురువుగారికి తిన్నగా దండ వెయ్యకూడదు. మీ గురువుగారికి ప్రదక్షిణం చేసి దండవేసి వెళ్ళిపోవాలి. అంటే ఆయనను కుడిచేతిపక్కన పెట్టుకుని చుట్టూ తిరుగుతారు.

గుడికెళితే ప్రదక్షిణం. కుడిచేతివైపుంచుకుని చుట్టూ తిరిగొస్తారు. అలా ఉంచితే ఏమిటంటే గౌరవం. దానికి సంతోషిస్తారు. యాగశాలకి మీరు ప్రదక్షిణం

చేశారనుకోండి దేవతల చుట్టూ తిరిగారు. ఇప్పుడు దేవతలు సంతోషిస్తారు. దేవతలకి లక్షణమేమిటో తెలుసా? వాళ్ళు వచ్చినా, సంతోషించినా ఉత్తినే వెళ్ళరు. వాళ్ళు ఏదో ఒకటి ఇచ్చి వెళతారు. అది వాళ్ళ లక్షణం. ఎందుచేత? మీరు చూడండి మహాభారతంలో కుంతీదేవి సూర్యభగవానుణ్ణి పిలిచింది. ఆయనన్నాడు ఏదో ఒకటి ఇచ్చి వెళ్ళాలి. నేను వస్తే అలా వెళ్ళకూడదన్నాడు అది దేవతాలక్షణం. ఆవిడంది నాకేం అక్కర్లేదు, ఉత్తినే పిలిచానంది. అలా కుదరదు. నువ్వు నన్ను చూసి అబ్బా ఎంత బాగున్నాడో ఇలాంటి కొడుకుంటే అన్నావు కదూ, పుచ్చుకో అని కొడుకునిచ్చి వెళ్ళిపోయాడు. ధూర్తత్వంతో కాదు, అది దేవతాలక్షణం. ఇవ్వాలి. లేకపోతే ఆయన దేవతకాదు. యాగశాలకి ప్రదక్షిణం చేస్తారందుకే. దేవతలందరికీ ప్రదక్షిణం జరుగుతుంది. ఆ ప్రదక్షిణం చేసి, మనం యజ్ఞం చేస్తూంటే అక్కడ ఎంతో కొంత సహాయం చెయ్యాలి. ఏదో ఒక సహాయం. నీకు ఏదీ లేకపోతే కనీసం యాగశాలకి రాత్రి కాపలా పడుకోవాలి. అయ్యా నేను పడుకుంటానండీ ఏ కుక్కో లోపలికెళ్ళకుండా అని చెప్పాలి. అది అదృష్టం జీవితంలో. కాబట్టి దేవయజ్ఞం. అంటే దేవతలకి హవిస్సు ఇచ్చే ప్రక్రియ. దాన్ని చెయ్యాలి. కాబట్టి అది దేవయజ్ఞం.

మూడవది మనుష్యయజ్ఞం. మనుష్యయజ్ఞం అంటే అతిథి, అభ్యాగతి అని ఇద్దరుంటారు. అతిథి, అభ్యాగతులొచ్చారా ఇంటికీ అని అడుగుతుంటారు. అతిథి అంటే మీరు పిలిస్తే మీ ఇంటికొచ్చాడు. ఇవ్వాళ తిథి నాడు వచ్చాడు. తిథి మారిననాడు మీ ఇంట్లో ఉండడాయన. ఆయన్ని అతిథి అంటారు. మీరు ద్వాదశినాడు భోజనానికి రమ్మని పిలిచారు. ఆయన ద్వాదశినాడు వచ్చాడు. ద్వాదశినాడు వచ్చినవాడు మళ్ళీ త్రయోదశినాడు కూడా భోజనానికి రాడు. వెళ్ళిపోతాడు. ద్వాదశినాడే భోజనం చేశాడు. త్రయోదశినాడు ఆయన లేడు, వెళ్ళిపోయాడు. ఆయన్ని అతిథి అంటారు. ఒక్క తిథి ఉండగా ఒక్కసారే తిని వెళ్ళిపోతే అతిథి. ఆయన్ని మీరు పిలిచారు రమ్మని, ఆయనొచ్చాడు. ఇంకొక ఆయన్ని పిలవలేదు, కానీ ఆయనవెంట వచ్చాడు ఆయన. అందుకని ఆయన్ని మీరు అయ్యా, మీరు భోజనానికి రండి అని పిలవలేదు. కానీ ఆయనవెంట వచ్చాడు అందుకని ఆయనేం చేశాడు. రండీ భోజనానికెళదాం అన్నాడు.

ఇప్పుడు మీరు పిలవకపోయినా మీ ఇంటికి వచ్చినవాడు అభ్యాగతి. భగవత్ స్వరూపులు. అప్పుడు ఏ విచక్షణా చెయ్యకూడదు. ఏమీ ఆలోచించకూడదు. అందులో ఎక్కువా, తక్కువా ఏదీ చూడకూడదు. అభ్యాగతి ఈశ్వరస్వరూపం. అతిథి ఈశ్వర స్వరూపం. అతిథి దేవోభవ. అతిథి, అభ్యాగతి. ఒక గృహస్థు అంటే ఆయన ఇల్లు పండిందీ అని గుర్తేమిటో తెలుసా? అతిథి, అభ్యాగతి ఆ ఇంటికొస్తారు. అందునా పరమ భక్తితత్పరుడైన వాడనుకోండి ఆయన వచ్చి ఆ ఇంట ఉండి వెళ్ళిపోయాడనుకోండి పరమేశ్వరుడు ప్రసన్నుడైపోతాడు. అందుకే

**ఊరకరారు మహాత్ములు,**
**వారధముల ఇండ్లకడకు వచ్చుటలెల్లన్**
**కారణము మంగళములకు,**
**నీరాక శుభంబు మాకు నిజము మహాత్మా!**

అంటాడు గర్గుడు. భగవద్భక్తుడైనవాడు వచ్చి ఇంట్లో కూర్చుని కాసిని మంచినీళ్ళు తాగి వెళ్ళాడా, ఆ ఇల్లు తరించిపోయింది. భగవంతుడు పరవశించిపోతాడు. ఒరేయ్, భక్తుడికి అన్నంపెట్టావురా, నా భక్తుణ్ణి తీసుకొచ్చావురా, వాడు సుఖపడి వెళ్ళాడురా అని పొంగిపోతాడు. అందుకే గడపదాటి లోపలికి రావాలి భక్తులు. వీధిలో నుంచోబెట్టి మాట్లాడకూడదు. ఏ ఇంటి గడప భగవద్భక్తుడు దాటాడో ఆ ఇంటికి ఏదో శుభం కలుగుతుందని గుర్తు. కాబట్టి మనుష్యయజ్ఞం.

**అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా**

అంటారు సుందరకాండలో. ఎటువంటివాడు? ఎంత చదువుకున్నవాడు, ఎంత పూజార్హుడన్నది సంబంధంలేదు. ఇంటికి అతిథి రావడమే గొప్ప. ఆయనకి అన్నం పెట్టడమంటే అది సౌభాగ్యవిశేషం. అది ఎంత అదృష్టమో. కాబట్టి మనుష్య యజ్ఞం. నా ఆకలి ఎటువంటిదో ఆయన ఆకలీ అటువంటిది. అన్నం ప్రాణధారకం. ప్రాణాలు అన్నంవల్లనే నిలబడతాయి. ఆ ప్రాణాలు నిలబెట్టిన ఘనత నీకు చెందుతుంది. ఎందుకంటే అన్నం పెట్టలేదనుకోండి, శోషించిపోతాడాయన. అన్నం పెట్టావు కాబట్టి ప్రాణం నిలబడింది.

ఇవాళ నేను ప్రసంగం చేస్తున్నానంటే నాకు మధ్యాహ్నం ఒక పుణ్యపురుషుడు అన్నం పెట్టాడు. ఆయన అన్నం పెట్టాడు కాబట్టే నేను ఉపన్యాసం చెప్తున్నాను. లేకపోతే ఏం చెప్పను? ఇక్కడే పడిపోతాను. అన్నం పెట్టాడు కాబట్టి ప్రాణాన్ని నిలబెట్టాడు. ప్రాణాన్ని నిలబెట్టాడు కాబట్టి నేను మాట్లాడాను. నేను మాట్లాడాను కాబట్టి మీ అందరూ విన్నారు. ఇప్పుడు ఈ పుణ్యమంతటిలో ఆరోవంతు ఆయన ఖాతాలో వేస్తాడు తీసుకెళ్ళి. కాబట్టి అంత తేలికకాదు అతిథి ఇంటికి రావడమంటే. అంత తొందరగా దొరకడు. భగవంతుడు ప్రత్యక్షంగా వచ్చి కూర్చుని తినడు. మిమ్మల్ని అనుగ్రహించాలనుకున్నప్పుడు అతిథి రూపంలో వచ్చి తిని వెళతాడు. అందునా గురువు పరమభాగవతోత్తముడు అతిథిగా రావడమంటే జన్మజన్మల పుణ్యం పండితే వస్తాడు. లేకపోతే రాడు. ఈశ్వరకృప కలిగితేనే వస్తాడు. నేను చెప్పటం లేదు. సాక్షాత్తు పురాణాలు చెప్పాయి. కావ్యాలు చెప్పాయి. వేదం చెప్పింది. కాబట్టి ప్రయత్నపూర్వకంగా పిలిచి ఒకరికి అన్నం పెట్టడమన్నది నేర్చుకోవాలి. అన్నంపెట్టడమంటే ఓషధి. అన్నం పెట్టడమంటే ప్రాణం నిలబెట్టడం. అతిథికి అన్నంపెట్టి తీరాలి. అది మనుష్యయజ్ఞం.

ఇక పితృయజ్ఞమని ఉంటుంది. పితృయజ్ఞమంటే కష్టపడి తల్లీతండ్రీ బిడ్డల్ని కంటారు. వాళ్ళు సుఖపడడం కూడా మానేసి ఆ పిల్లల్ని వృద్ధిలోకి తీసుకువస్తారు. ఎన్ని ఆశలు పెట్టుకుంటారో, ఎంత తాపత్రయం ఉంటుందో. ఆఖరికి దంపతులుగా కలిసిన స్త్రీపురుషులు భర్త అంటే విపరీతమైన ప్రేమ. ఆయన లేకపోతే ఇక ఆవిడకి జీవితంలో ఏమీ లేనట్లే. ఆమె లేకపోతే ఆయనకి యజ్ఞాధికారం పోతుంది. చిత్రమేమిటో తెలుసా? వాళ్ళిద్దరూ అంత అన్యోన్యంగా బ్రతికినా వాళ్ళ శరీరం పడిపోయినప్పుడు వ్యానం వదలదు. వ్యానం అని ఒక వాయువు. అది శరీరాన్ని పట్టుకుంటుంది. పట్టుకుని విడిచిపెట్టదు. శిథిలమైపోయి పాడుపడిపోయిన మేడమీద ఒకడు, ఈ స్థలం ఫలానావారికి చెందినది, ఇది వారి యాజమాన్యంలో ఉంది, ఇది ఎవ్వరికీ అమ్మటకు, కొనుటకు అధికారం లేదు అని బోర్డు పెడతాడు. అది పాడుపడిపోయిన ఇల్లు. అయినా నాది అని బోర్డు పెట్టుకున్నట్లే ప్రాణం పోయాక కూడా శరీరంమీద వ్యామోహంతో పట్టుకుంటుందొక వాయువు. వ్యానవాయువు అంటారు. అది వదలదు. అది

ఎవరు చెప్తే విడిచిపెట్టేస్తుందో తెలుసా? కడుపున పుట్టిన కొడుకొచ్చి కూర్చుని పిచ్చి నాన్నగారండీ, పెద్దవారైపోయారు, శరీరం వృద్ధాప్యం పొందింది. ఇందులో ఉండి మీరేం చేసుకుంటారు ఇంక, అది మీకు పనికిరాదండీ, ఆ శరీరం విడిచిపెట్టేసి పితృదేవతా స్థానంలోకి వెళ్ళిపోండి. మమ్మల్ని ఆశీర్వచనం చెయ్యండి. వదిలిపెట్టెయ్యండి అని అడుగుతాడు మంత్రంతో. వదిలిపెట్టేస్తాడు. తల్లి వదిలిపెట్టేస్తుంది. కడుపున పుట్టిన బిడ్డలంటే తల్లిదండ్రులకు అంత ప్రీతి ఉంటుంది. తల్లీతండ్రీ పోతే ఏడవని వాడెవడున్నాడో వాడిని నమ్మరాదు.

నేను యథాలాపంగా అంటున్నాననుకుంటున్నారేమో, నేను బాగా గుర్తెరిగి చెప్తున్నాను. తల్లీ, తండ్రీ పోతే కంటివెంట నీరు రాకపోతే వాడిని నమ్మడం ఇక మీ జీవితంలో చేయవద్దు. తల్లికి తొంభై తొమ్మిదేళ్ళు రానివ్వండి. తండ్రికి వందేళ్ళు రానివ్వండి. వాళ్ళు శరీరం విడిచిపెట్టారంటే ఏడ్చినవాడే కొడుకు. అరవై వేల సంవత్సరాల వయసొచ్చిన దశరథ మహారాజుగారు శరీరం విడిచిపెడితే రామచంద్రమూర్తి గుండెలు బాదుకుని ఏడ్చాడు. తండ్రి తండ్రే. తండ్రిలాంటి వ్యక్తి జీవితంలో రాడు. తల్లిలాంటి వ్యక్తి జీవితంలో రాదు. తాను అన్నీ పోగొట్టేసుకున్నా బిడ్డ క్షేమంగా ఉండాలని కోరుకుంటుంది. ఆ కొడుక్కి జ్వరం వస్తే ఎవ్వరూ అనరు లోకంలో. నా ఆయుర్దాయం కూడా నువ్వు పోసుకుని బ్రతకరా నాన్నా అంటుంది అమ్మ. అంత మాట అనగలిగింది అమ్మ ఒక్కత్తే. తనకున్న సర్వస్వం త్యాగం చేసి కొడుకుకిచ్చి కొడుకు సుఖపడుతుంటే తాను సంతోషపడిపోతాడు. తాను సంతోషపడిపోవాలని కోరుకోడు. తాను పెద్ద మేడ కట్టుకోగలడు. కట్టుకోడు. కొడుకు సంతోషంగా ఉండాలని కొడుక్కి ఇల్లు కొనిచ్చేస్తాడు. తండ్రికున్న గొప్పతనమది. అటువంటి తండ్రి, అటువంటి తల్లి శరీరాన్ని విడిచిపెట్టినరోజు జ్ఞాపకం పెట్టుకుని వాళ్ళకి తద్దినం పెట్టడం కొడుకు ప్రధానమైన కర్తవ్యం. జన్మనిచ్చిన తల్లీ తండ్రికే నువ్వు తద్దినం పెట్టవే, వాళ్ళనే నువ్వు గౌరవించవే, నీతో స్నేహం కలిపిన నన్ను నువ్వు ఉద్ధరిస్తావా? నిన్ను నమ్మనా? ఎలా నమ్ముతాను? తల్లికీ, తండ్రికీ తద్దినం పెట్టనివాడితో నేను స్నేహం చేయనా, ఎలా కుదురుతుంది? ఒక్కనాటికీ కుదరదు. తల్లికీ, తండ్రికీ తద్దినం పెట్టి తీరాలి. కొంతమంది మెట్ట వేదాంతం మాట్లాడతారు. ఇక్కడ పెడితే అక్కడ అందుతుందా అండీ, బ్రాహ్మణులు అన్నం తినడానికి ఇదొక మార్గం కనిపెట్టారంటారు.

నువ్వు పెట్టిన వ్యవస్థ మీద నీకు నమ్మకమా? వేదంలో పరమేశ్వరుడు చెప్పినదానిమీద అపనమ్మకమా? ఎంత అంధత్వంతో బ్రతికేసినట్లు. తల్లికీ, తండ్రికీ తద్దినం పెట్టనివాడికన్నా కృతఘ్నుడు ప్రపంచంలో ఇంకొకడు లేడు. పితృయజ్ఞం అంటే వాళ్ళు శరీరం విడిచిపెట్టిన తిథిని జ్ఞాపకం పెట్టుకుని వాళ్ళకి తద్దినం పెట్టాలి. అమావాస్య తిథినాడు తర్పణం విడిచిపెట్టాలి. మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ వస్తారు పితృదేవతలు. కనీసంలో కనీసం తర్పణం కూడా విడిచిపెట్టకుండా బ్రాహ్మణుడికి సంభావన కూడా ఇవ్వకుండా, స్వయంపాకం కూడా ఇవ్వకుండా తాను ఉంటే పన్నెండు గంటల వేళ కనీసంలో కనీసం రెండు చేతులూ మూడుమాట్లు ఇలా ఊపాలి. నాన్నగారండీ ఏమనుకోకండి. నా దగ్గర ఇవాళ ఏమీ లేదు పెట్టలేను. ఏమనుకోవద్దని మూడుమాట్లు ఇలా ఖాళీ చేతులు ఊపితే చాలు. వాళ్ళు సంతోషించి వెళ్ళిపోతారు తప్ప కనీసం చేతులు కూడా ఊపకుండా ఉంటే వాళ్ళు ఏడుస్తూ వెళ్ళిపోతారు. ఇటువంటి దుర్మార్గుణ్ణి కన్నానని. కాబట్టి పితృయజ్ఞం. తల్లిదండ్రులకు తద్దినం పెట్టం. ద్వాదశినాడు తద్దినం పెడితే పొద్దున్న భోజనం లేదు. అపరాహ్ణభోజనమే. వేదం అంత ఔదార్యంగా మాట్లాడింది తల్లిదండ్రులకు తద్దినం పెట్టడమంటే. శుభకార్యం జరుగుతున్నా సరే నాందీదేవతలన్న పేరుతో వాళ్ళని పిలిచి ఆ ప్రాంగణంలో ఉండమని అడుగుతారు. వాళ్ళు సంతోషిస్తారు. కడుపున పుట్టిన బిడ్డలందరూ, జ్ఞాతులు కలిసి తిరిగి ఆనందపడుతుంటే వాళ్ళు సంతోషిస్తారు వచ్చి. కాబట్టి పితృయజ్ఞం.

చిట్టచివరిది భూతయజ్ఞం. అన్ని ప్రాణులలో ఉన్న వైభవాన్నీ మనమే వాడుకుంటాం. అది మనుష్యప్రాణికి పరమేశ్వరుడిచ్చిన గొప్ప వరం. మన బుద్ధిచేత మనమలా చేస్తాం. మీరు చూడండి గొర్రెకు బొచ్చుంటుంది- ఉన్ని. అది ఆ ఉన్నిచేత వెచ్చగా ఉంటుంది. మనమా బొచ్చు కత్తిరించి తీసుకొచ్చి కోటు తొడుక్కుని మనం వెచ్చగా కూర్చుంటాం. ఏనుగుకి దంతముంటుంది. కోసి తెచ్చి బొమ్మ చేసుకుంటాం. గుర్రం పర్వతం మీద పరిగెడుతుంది. దాని మీద ఎక్కి పర్వతాలు దాటుతాం. పక్షి ఆకాశంలో వెళుతుంది. మనం విమానమెక్కి ఆకాశంలో వెళతాం. సముద్రంలో చేప పరిగెత్తాలి. మనం ఓడ వేసుకుని

సముద్రాన్ని దాటుతాం. జింక చర్మం ప్రశస్తంగా ఉంటుంది. తోలు ఒలిచి తెచ్చి వేసుకు కూర్చుని జపం చేస్తాం. ప్రపంచంలో ఏ ప్రాణియందు ఏ విభూతి ఉందో దాన్ని మనకోసం వాడుకుంటాం. కుక్కకి రాత్రి తెలివిగా ఉండి ఎవరైనా వస్తే అరవడం అలవాటు. పట్టెడన్నం పెట్టి రాత్రి గొలుసులు విప్పి లోపల మనం పడుకుంటాం. కుక్క కాపలా కాసి ఎవరైనా వస్తే భౌమని అది అరిచి మన ఐశ్వర్యాన్ని కాపాడుతుంది. సమస్తప్రాణులలో ఉన్న తేజస్సుని మనిషి ఒక్కడే వాడుకుంటాడు. ఇంకొక ప్రాణిలో ఉన్న తేజస్సుని రెండో ప్రాణి వాడుకోదు. ఆకలేస్తే తింటుందేమో కానీ దాని దంతం పట్టుకెళ్ళడం, పులిగోరు పట్టుకెళ్ళి మెళ్ళో వేసుకోవడం ఇవి చెయ్యవు. ఒక్క మనుష్యుడే అన్ని ప్రాణులలో ఉన్న తేజస్సునీ తనకొరకు వాడుకుంటాడు. ఆ మనుష్యునికి ఒక కర్తవ్యం ఉంటుంది.

భూతయజ్ఞం. తానొక్కడే తిని ఉండడం కాదు. బలిపెట్టారూ అంటారు. ఇంట్లోనుంచి ప్రయత్నపూర్వకంగా ప్రాంగణాన్ని దాటి వెళ్ళమని చెప్పింది వేదం. ఆ గేటు ఏది ఉంటుందో ప్రధానద్వారం దాన్ని దాటి బయటికెళ్ళి బలి భోక్తాలుంటాయి అంటే ప్రత్యేకించి కాకి, కుక్క– ఈ రెండూ. ఈ రెండిటి కొరకు వీథిలోకి తీసుకెళ్ళి పెట్టాలి. పెడితే దాన్ని తింటాయి. కొంతమంది భోజనం చేసేటప్పుడు పిడచ పెడతారు. తప్పు అలా పెట్టకూడదు. అది దోషం. పిడచకట్టి పక్కన కొడుక్కి కూడా ఇవ్వకూడదు. పిడచలు పెట్టడమనేది ఒక్కసారే. ఇంట్లో పిడచలు కట్టి పక్క విస్తళ్ళలో పెట్టడం చెయ్యకూడదు. దాన్ని అంగీకరించదు. అన్నం తినడానికి ముందే కొంచెం అన్నం బయట పెట్టి వస్తారు. అవి ప్రధానంగా కాకులు తింటాయి, కుక్కలు తింటాయి. అవి రెండూ ఎందుకు తినాలో కూడా వేదం చెప్పింది. అవి రుద్రుడితో చేరి శ్మశానంలో ఉంటుంటాయి. రుద్రుడు శ్మశానంలో ఉంటాడు. అడిగింది అమ్మవారు ఆనుశాసనిక పర్వంలో– ఏమయ్యా, ఇంతటి మహానుభావుడివి కదా శివా, ఎందుకుంటావు శ్మశానంలో నువ్వు అని అడిగింది. అడిగితే ఆయనన్నాడు పార్వతీ, చేతకాక శ్మశానంలో కూర్చోలేదు. చోటులేక శ్మశానంలో కూర్చోలేదు. ఉన్నంతకాలం నా అంత వాణ్ణి నేనని గుండెలమీద చెయ్యేసుకుని, పొడుగ్గా ఉన్నానని ఒకడు, తెల్లగా ఉన్నానని ఒకడు, డబ్బున్నవాడినని ఒకడు, పండితుడినని ఒకడు, అధికారినని ఒకడు,

అందగాడినని ఒకడు ఓ గుండెల మీద చెయ్యేసుకుని విరగబడతారు. ఊపిరి ఆగిపోగానే నా వాళ్ళు నా వాళ్ళు అన్న వాళ్ళందరూ తీసుకొచ్చి శ్మశానంలో కాల్చేసి తల పగిలిపోగానే వెళ్ళిపోతారు. ఇంకా పూర్తిగా కాలదు. అప్పుడు నా వాళ్ళన్న వాళ్ళందరూ వెళ్ళిపోతూంటే ఒక్కడే నిలబడతాడు. అప్పుడు నేనున్నానా అని అనడానికి నేనైనా ఉండకపోతే ఏడుస్తాడని ఉన్నాను పార్వతీ అన్నాడాయన. అదీ ఆయన ఔదార్యం, మహానుభావుడు!.

పార్వతీ, భూతగణాలుంటాయి. కాకులు, కుక్కల లాంటివి నా చుట్టూ తిరుగుతుంటాయి. భైరవ అంటారు కుక్కని. ప్రాణం విడిచిపెట్టగానే భై అని అరిచి వెంటపడుతుందట అది. అందుకే దానిపేరు భైరవ. వెంటపడితే జీవుడు పరిగెడతాడు. ఆ భైరవుడు రుద్రుణ్ణి ఆశ్రయించి తిరుగుతుంటాడు. ఆ భైరవులు, ఆ వాయసాలు అంటే కాకులు. ఆ రుద్రగణాలలో ఉంటాయి. ఆ ఉన్నవి బలిభోక్తాలు. వాటికి తీసుకెళ్ళి వీథిలో అన్నం పెడితే అవి తింటాయి. అటువంటి ప్రాణులు, సమస్తభూతాలూ మనుష్యుల వల్ల బ్రతకాలి. అందుకని పట్టెడన్నం పెట్టమని చెప్పింది శాస్త్రం. అలా పెట్టకపోతే కృతఘ్నుడవైపోతావు. పట్టెడన్నం కూడా మిగలకుండా నీకూ, నీ భార్యకే సరిపోయినంత అన్నమే వండించుకుని మెతుకు లేకుండా, కొంచెం అన్నముండి పోయింది పెట్టేసుకుంటారా అంటే నువ్వు కొంచెం, నేను కొంచెం పెట్టేసుకుందాం అని ఇద్దరూ పెట్టేసుకుని సహించినా, సహించకపోయినా కక్కొచ్చేటట్లుగా మింగేసి, ఆ గిన్నెల్లో మెతుకులు కూడా లేకుండా తోమెయ్యకూడదు. పట్టెడన్నం మిగలాలి. ప్రయత్నపూర్వకంగా పట్టుకెళ్ళి అన్నంపెట్టాలి. పెట్టి తినాలి.

దేవాలయవ్యవస్థలో కూడా బలి ఉంది. బలి అన్నమాటకి అర్థం ఏదో జంతువుల్ని చంపడం కాదు. ప్రత్యక్షంగా భూతాలొచ్చి తింటాయి. అందుకే ఆ అన్నాన్ని పట్టుకెళ్ళి మేళతాళాలతోటి కొన్ని కొన్ని చోట్ల బలిహరణ మండపాలని ఉంటాయి, వాటిమీద పెడతారు. పెడితే కాకులు మొదలైనవి వచ్చి తింటాయి అక్కడ. తిన్నందుకు, పక్షులు వాలినందువల్ల దోషమొచ్చింది కాబట్టి మళ్ళీ కుంభాభిషేకం చేస్తారు. అంతే తప్ప అవి రాకుండా జాలీలు కట్టెయ్యడమవీ చెయ్యరు. పరమేశ్వరుడి దగ్గర కూడా అవి తింటాయి. మనం కూడా పెట్టాలి. దాన్ని భూతయజ్ఞం అంటారు.

పెట్టడం కూడా ఎలా పెట్టాలో తెలుసా? పరమభక్తితో, ప్రేమతో పెట్టాలి. పెట్టినప్పుడు అవి తింటూంటే చూసి మురిసిపోవాలి. ఒక కుక్క తింటోందనుకోండి అబ్బా ఎలా తింటోందో అనకూడదు. అది నోటితో కబళాన్ని ఎత్తి నాలుకతో తింటుంటే మాంసం తింటున్నట్టు తింటుంది అన్నాన్ని కూడా. ఆ తింటున్నప్పుడు ఒక ప్రాణి, ఒక కుక్క రాత్రి నేను నిద్రపోతుంటే మొరిగి కాపాడింది. రుద్రగణాలలో చేరింది. దానికి అన్నం పెడుతున్నాను అని సంతోషంగా పెట్టాలి. పరమేశ్వరుడు పార్వతీదేవితో చెప్పాడు. పార్వతీ, వీటికో అలవాటుంది. చీకటి పడిన తరువాత ఊళ్ళోకెళతాయి ఇవి. ఇక్కడ ఉన్న భూత, ప్రేత, పిశాచాలు ఊళ్ళోకెళ్ళి నిద్రపోతున్నవాళ్ళని హింసిస్తాయి. వాళ్ళు నా భక్తులు. నా పేరు చెప్పుకుని బ్రతుకుతున్నారు. వాళ్ళని పాడుచెయ్యకుండా ఉండడానికి వీటిని ఇక్కడుంచడానికి నేనేం చేస్తుంటానో తెలుసా? శ్మశానంలో రాత్రివేళ తాండవం చేస్తుంటాను. వాటన్నింటికీ సరదా. ఆ నృత్యం చూస్తూ కూర్చుంటాయి. వాటినలా కూర్చోబెడతాను. తెల్లవారుజామున బ్రహ్మముహూర్తంలో నా నృత్యం ఆపేస్తాను. ఇవన్నీ పగటిపూట సూర్యోదయమైతే ఇక వెళ్ళవు. అందులో పడుంటాయి. లోకాన్ని కాపాడడానికి శ్మశానంలో ఉండి తాండవం చేస్తున్నాను తప్ప చేతకాక కూర్చోలేదు. అదే పనిగా శ్మశానవాసి, శ్మశానవాసి అని అర్థం పర్థం లేకుండా, తత్త్వం తెలియకుండా వదరి మాట్లాడిన వాళ్ళని, ఒక్క రాత్రి నేను నాట్యం చెయ్యడం మానేస్తే ఇవి పీక్కు తింటాయి వాణ్ణి. ఏమిటో అనుకుంటున్నాడు. పిచ్చి పేలుడు పేలుతున్నాడు తెలియక శివతత్త్వమేమిటో. నోరు అదుపులో పెట్టుకోవాలి పార్వతీ! నా తత్త్వం తెలిసి బ్రతకాలి. నేను జగత్తు కంతటికీ తండ్రిని. అందరూ నా బిడ్డలే.

పదిమంది బిడ్డల్ని కన్నాడు ఒక తండ్రి. తొమ్మండుగురు ఐ.ఏ.యస్‌లు, ఐ.ఆర్.యస్‌లు, ఐ.పి.యస్‌లు, ఐ.యఫ్.యస్‌లు అయ్యారు. ఒకడు జేబుదొంగ అయ్యాడు. తండ్రి షష్టిపూర్తికి పదోవాణ్ణి కూడా పిలవాలి. ఒరేయ్, నువ్వెళ్ళేటప్పుడు నేను డబ్బిస్తాను, వచ్చినవాళ్ళ జేబులు కత్తిరించకని చెప్తాడు. అంతేకానీ జేబుదొంగ నా కొడుకు కాదనడుగా. సృష్టిలో ఉన్న భూత, ప్రేత, పిశాచాలు కూడా ఎవరికో బిడ్డలే. పరమేశ్వరుడు నా బిడ్డలు కాదంటే వాళ్ళెవరికి బిడ్డలు? నా

బిడ్డలని చెప్పాడు పరమేశ్వరుడు. అదీ తండ్రితనం. అందుకే కాళిదాస మహాకవి రెండు చేతులెత్తి నమస్కరించాడు.

**వాగర్థా విప సంపృక్తౌ**
**వాగర్థ ప్రతిపత్తయే**
**జగతః పితరౌ వందే**
**పార్వతీ పరమేశ్వరౌ**

అన్నాడు. అటువంటి అద్భుతమైనది శివతత్త్వం. కాబట్టి భూతయజ్ఞం. తనచుట్టూ ఉండే భూతాలకు, భూతాలంటే అవేవో పెద్ద పెద్ద పిశాచాలనుకోకండి. భూతాలంటే ప్రాణులు అని నా ఉద్దేశ్యం. వాటికి కూడా అన్నం పెట్టాలి. ఆ అన్నం ప్రతిరోజూ పెడతాడు కాబట్టి భూతయజ్ఞం. తాను ప్రతిరోజూ గృహస్థు హింస చేస్తాడు. గృహస్థుకి హింస చెయ్యకుండా రోజు వెళ్ళదు. తీసుకొచ్చి కాయగూరలని కోసి నీళ్ళల్లో పడేస్తారు. పడేసినప్పుడు అందులో చిన్న చిన్న పురుగులుంటాయి చచ్చిపోతాయి. కొంచెం బతికాయనుకోండి, అంతవరకెందుకండీ బియ్యంలో పెంకు పురుగని పడుతుంది. నల్లగా చిన్న చిన్న పురుగులు. నీళ్ళల్లో ఉడికించేస్తారు బియ్యాన్ని, అవి చచ్చిపోయి ఉడికిపోయి పైకి తేలుతాయి. ఎవరిదిప్పుడా హింస? ఆ యజమానిదేనా? కాయగూరలు కోస్తే వాడిదేనా? ఆకుకూరలు కోసినప్పుడు వాడిదేనా? పచనం చేసినప్పుడు వాడిదేనా? అగ్నిమీద పెట్టి ఉడికించినప్పుడు ఎన్ని ప్రాణులు చచ్చిపోతాయో ఆ వేడికి. అంతవరకెందుకు ఇప్పుడు మైకులో నేను ఈ ఉపన్యాసం చెప్తుంటే ఆ శబ్దతరంగాలకి ఎన్ని ప్రాణులు చచ్చిపోతున్నాయో. ఆ పాపమంతా నాదేనా? మరి ఈ హింసంతా ఆయనదేనా? గృహస్థు చేసినదానికి హింసాదోషం లేదు అంది వేదం.

ఎందుకు పోయిందో తెలుసా గృహస్థుకి. భూతయజ్ఞం చేశారు కాబట్టి పోయిందని చెప్పారు. ఆ గృహస్థు అలా వంట చేసుకోకపోతే బ్రహ్మచారికి అన్నమెక్కడిది? సన్యాసికి అన్నమెక్కడిది? సన్యాసి అగ్ని ముట్టుకోకూడదు. సన్యాసి వంట చేసుకోకూడదు. సన్యాసి భిక్ష మీద బతకాలి. సన్యాసి భిక్ష మీద బతకాలంటే గృహస్థు వండుకోవాలి. తాను వండుకుని బ్రహ్మచారికి పెడుతున్నాడు. తాను వండుకుని సన్యాసికి పెడుతున్నాడు. అందుకే సన్యాసి

శరీరం విడిచిపెట్టేస్తే అగ్నిసంస్కారం చెయ్యరు. అగ్నిసంబంధం లేదు కాబట్టి భూస్థాపితం చేసేస్తారు. గృహస్థుకి అగ్నిసంపర్కముంది. అయినా బ్రహ్మచారికి, సన్యాసికి, సమస్తభూతాలకు అన్నం పెడుతున్నాడు కాబట్టి బలి పెడుతున్నాడు. కాబట్టి, బలి అంటే ప్రత్యక్షంగా వచ్చి తినేస్తాయి. అగ్నిహోత్రంలో ఇస్తే హవిస్సు. ప్రత్యక్షంగా ప్రాణులు తింటే బలి. బలి పెడుతున్నాడు కాబట్టి ఆయనకి వంట చేసుకున్నప్పుడు జరిగిన హింసాదోషం అంటదు. భూతయజ్ఞం చెయ్యకపోతే అంటుకుంటుంది. కాబట్టి భూతాలకు కూడా కొంచెం అన్నం పెట్టాలి. అలా పెడితే లోకమంతా శాంతి పొందుతుంది. ఇది ఒకరోజు కార్యక్రమంలో మనుష్యుడు జ్ఞాపకం పెట్టుకుని చెయ్యవలసిన విధివిధానం.

ఇక గృహస్థు భోజనం. అసలు నిజానికి దాన్ని దేవతార్చన అంటారు. ఎందుచేత అంటే అసలు యథార్థమైన భక్తితత్పరుడైన వ్యక్తి ఒకచోటుకి వచ్చి భోజనం చేసి వెళ్ళాడంటే అది యజ్ఞం చేసిన ప్రాంతంగా మారిపోతుంది. కారణమేమంటే ఆయన తిన్నగా దాన్ని అన్నంగా తినడు. ఆయన దాన్ని పరిషేచనం చేస్తాడు. పగటిపూటైతే **సత్యం త్వర్తేన పరిషించామి** అంటాడు. రాత్రి **ఋతంత్వా సత్యేన పరిషించామి** అంటాడు. అయిదు మార్లు మగముద్రపట్టి నేతి అన్నాన్ని తీసి పళ్ళకి తగలకుండా నాలుకమీద పడేసి మింగుతాడు. ఆ మింగేటప్పుడు వ్యాకృతులిస్తాడు. ఇస్తూ స్వాహాకారం చెప్తాడు. **ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా** అని. అసలివాళ పరిషేచనమంటే తీసుకొచ్చి ఏదో హస్తోదకమిచ్చి చేతిలో నీళ్ళు పోస్తున్నారు, అది కాదు. ప్రత్యేకంగా అయిదు వ్యాకృతులకినివృంచజిహోమి అంటూ వెయ్యాలి. వేస్తే స్వాహా అంటూ ఆయన పుచ్చుకోవాలి. ప్రాణాయ, అపానాయ, వ్యానాయ, ఉదానాయ, సమానాయ అని ఎవరు ఆతిథ్యమిస్తున్నాడో ఆయన. పుచ్చుకున్నాయన దానికి స్వాహా కారం చెప్తూ ప్రాణాయ స్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయ స్వాహా, ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా అంటూ అయిదుమాట్లు పళ్ళకి తగలకుండా నాలుకమీద వేసుకుని, లోపల యజ్ఞపురుషుడున్నాడు–

**అహం వైశ్వానరోభూత్వా**
**ప్రాణినాం దేహమాశ్రితః**

ప్రాణాపాన సమాయుక్తం
పచామ్యన్నం చతుర్విధం.

లోపల అగ్నిహోత్ర స్వరూపుడై జఠరాగ్ని రూపంలో పరమేశ్వరుడు ప్రకాశిస్తున్నాడు. అందులోకి అయిదుమాట్లు నేతి అన్నాన్ని మింగుతాడు పంటికి తగలకుండా, నమలకుండా. అది హవిస్సుగా పడింది. అందుకని ఆయన తింటూంటే **గోవిందేతి సదా స్నానం** అని. అస్తమానం స్నానం చెయ్యలేకపోతే ఏం చెయ్యాలని అడిగారు. గోవింద, గోవింద, గోవింద అంటుంటే చాలు. అస్తమానం స్నానం చేసేసినట్లే. శౌచం వస్తూంటుంది. భోజనం చేస్తూ మధ్య మధ్యలో గోవిందా, గోవిందా అంటున్నాడనుకోండి, అందుకే **భోజన ప్రారంభకాలే గోవింద నామస్మరణే గోవిందా గోవింద** అనిపిస్తారు. ఏదో ఒకాయన పద్యం చదువుతాడు. **భోజన మధ్యకాలే భగవన్నామ స్మరణ గోవిందా గోవింద** అంటారు. లోకంలో గోవిందనామాన్ని వ్యాప్తి చేసిన మహానుభావులు శంకర భగవత్పాదులు. **నమః పార్వతీ పతయే హర హర మహాదేవ** అది వ్యాప్తి చేసినవారు శంకర భగవత్పాదులు కాదు జ్ఞానసంబంధ నాయనార్. గోవింద నామాన్ని శంకరాచార్యులవారు వ్యాప్తి చేశారు, **భజ గోవిందం, భజ గోవిందం గోవిందం భజ మూఢమతే** అంటూ

చాలా మంది ఏమనుకుంటారంటే శంకరాచార్యులవారు అంటే విభూతి పెట్టుకున్నాడు, ఆయన శివభక్తుడనుకుంటారు. కాదు, శంకరాచార్యులవారు అపారమైన విష్ణుభక్తుడు. నిజానికి వాఙ్మయంలో ఆయన చేసిన మొట్టమొదటి స్తోత్రం లక్ష్మీస్తోత్రం, కనకధారాస్తవం. విష్ణుసహస్రనామానికి ఆయన చేసిన భాష్యం ఇప్పటికీ పరమ ప్రామాణికం. ఆయన ఎంత కృష్ణభక్తులంటే శంకరాచార్యులవారు అమ్మవారి స్తవం చేస్తూ కృష్ణుణ్ణి తీసుకొస్తూ ఉంటారు. అందుకే సౌందర్యలహరి చేస్తూ

**అవిద్యానా మంతస్తిమిర మిహిర ద్వీపనగరీ**
**జడానాం చైతన్య స్తబక మకరంద శ్రుతిఝరీ ।**
**దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మ జలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి ॥**

అంటారు. మురరిపు మురా అన్న రాక్షసుడికి శత్రువైన శ్రీవిష్ణుభగవానుడా అంటారు. ఆయన పూర్ణానదిలో మునిగిపోయిన కృష్ణదేవాలయాన్ని ప్రత్యేకంగా తీసుకొచ్చి కాలడి అగ్రహారంలో తన ఇంటి ముందు ప్రతిష్ఠ చేశారు. అంతటి విష్ణుభక్తుడు శంకర భగవత్పాదులు. ఆయనందుకే అన్ని స్తోత్రాలిచ్చారు. అసలు ఆయనిచ్చిన షట్పదీ స్తోత్రం అది అద్భుతమైన ప్రార్థన. **అవినయ మపనయ విష్ణో:** అని మొదలవుతుంది. అది విష్ణుపదంగానే ఇచ్చారు శంకర భగవత్పాదులు. అంతటి మహానుభావులు శంకరులంటే. అటువంటి శంకరాచార్యులవారు మనకి గోవిందనామాన్ని నేర్పారు. **గోవిందేతి సదా స్నానం.** భోజనం చేసేటప్పుడు నిజానికి మాట్లాడకుండా ఉండాలి. ఉపనిషత్తుల గురించి అయితే పరవాలేదు. ఏదైనా క్షేత్రం గురించి, మతం గురించి కొంత ఫరవాలేదు. కానీ అసలు మౌనంగా ఉండాలి. మౌనంగా ఉండి భోజనం చేస్తున్నంతసేపూ ఏదో ఇంకొంచెం పప్పెయ్యి, కాస్త కూరెయ్యి దానికి ఫరవాలేదు. గోవిందా, గోవిందా, గోవిందా, గోవిందా అనుకుంటూ ఏది తిన్నాడో అటువంటివాడి యందు భక్తి బాగా నిలబడుతుంది, ఈశ్వరకృప కలుగుతుంది.

మనం తిన్న అన్నంలో ఆరోవంతే మనసుగా మారుతుంది. అందుకే గోవింద నామం చెప్తూ అన్నం తినాలి. అస్తమానం గోవిందా గోవింద, గోవిందా గోవింద అనుకున్నా వాడు వెంటవెంటనే స్నానం చేసేస్తున్నట్టు. దానివల్ల అపారమైన శౌచంతో ఉంటాడు. అంత గొప్ప నామం గోవిందనామం. శ్రీమహావిష్ణువుకి ఎన్నో నామాలున్నాయి. అన్ని నామాలూ గౌణాలు. ఆయన గుణాల వల్ల ప్రకాశించాయి. ఒక్క గోవిందనామం మాత్రం గౌణం కాదు. ఆయన ఏడు రాత్రులూ, ఏడు పగళ్ళూ కష్టపడితే వచ్చిందా నామం. వాన కురిపిస్తూ ఇంద్రుడు అప్పుడు మహానుభావుడు మమ్మల్ని రక్షించవయ్యా

**ఈ యుఱుములు, నీ మెఱుములు,**
**నీయశనుల ఘోషములు నీ జలధారల్,**
**నీయాన దొల్లి యె ఱుఁగము**
**కూయాలింపంగదయ్య గణరత్ననిధీ!**

ఎవరు రక్షిస్తారు కృష్ణా, మమ్మల్ని రక్షించమంటే చిన్న పిల్లవాడు ఒక్కసారి

**బాలుండాడుచు నాతపత్రమని సంభావించి పూగుత్తి కెం**
**గేలం దాల్చిన లీల లేనగవుతో కృష్ణుండు దా నమ్మహా**
**శైలంబున్ వలకేలదాల్చి విపులఛత్రంబుగా బట్టె నా**
**భీలాభ్రచ్యుత దుశ్శిలా చకిత గోపీ గోప గో పంక్తికిన్.**

ఆడుకుంటున్న పిల్లవాడు అలా పరిగెత్తి వెళ్ళిపోతూ చెంగల్వపువ్వును తుంపేసినట్లు ఆ గోవర్ధనగిరిని పైకెత్తి ఇలా పట్టుకున్నాడు.

**హరిదోర్దండము గామగుబ్బ శిఖరం బాలంబిముక్తావళుల్**
**పరగన్ జాతెడు తోయ బిందువులు గోపాలాంగనాపాంగ హా**
**సరుచుల్ రత్నచయంబుగాగ నచల ఛత్రంబు శోభిల్లె ద**
**ద్గిరిభిద్దుర్మద భంజియై జలధరాక్లిన్న ప్రజారంజియై.**

అన్నారు. ఆయన చెయ్యే ఆ గొడుగుకు పెట్టిన కర్ర. ఆ పైన ఉన్నదే చాందినీ, దాని నుంచి పడుతున్న వర్షధార ముత్యాల సరాలు. ఏడు రాత్రులు, ఏడు పగళ్ళు ఆ గొడుగు కింద ఉన్నవాళ్ళని తన చూపులచేత పోషించాడు. పోషించి ఆవుల్ని, దూడల్ని కూడా తన పక్కన పెట్టుకున్నాడు. నమ్మకుండా బయటికెళ్ళిపోయారు కొంతమంది– చిన్న పిల్లవాడు చెయ్యి వదిలేశాడంటే పచ్చడైపోతాం. బయటుంటే వడగళ్ళ వానకి కాళ్ళూ, చేతులూ విరుగుతాయని. ఆయనే బతిమాలుకున్నాడు ఈ కొండ పడదు, రండిరా లోపలికని.

**బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ**
**జాలండో యని దీని క్రింద నిలువన్ శంకింపఁగాఁ బోలదీ**
**శైలాంభోనిధి జంతు సంయుతధరాచక్రంబు పై పడ్డ నా**
**కేలల్లాడదు బంధులార నిలుఁడీ క్రిందం బ్రమోదంబునన్.**

అని పిలిచాడు నమ్మని వాళ్ళని. రండర్రా ఈ కొండ కిందకి, ఎందుకర్రా దెబ్బలు తింటారు? ఈ సమస్తబ్రహ్మాండాలూ పడిపోయినా ఈ కొండ కదలదు. నన్ను నమ్మండి, లోపలికి రండి అన్నాడు. ఏడు రాత్రులు, ఏడు పగళ్ళు కొండ

పట్టుకుంటే అప్పుడు ఇంద్రుడికి బుద్ధొచ్చి, మహానుభావుడురా, పరబ్రహ్మతత్త్వంరా ఈయన అని ఆయన గబగబా–

**సురభిక్షీరములన్ సురద్విపమహా శుండాల తానీత ని**
**ర్జరగంగాంబువులున్ నిలింపజననీ సన్మౌని సంఘంబుతో**
**సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁడం**
**చు రణాక్రాంత విపక్షు దోయజదళాక్షున్ సాధు సంరక్షణున్.**

తల్లి అయిన అదితిని తీసుకుని ఆకాశగంగా జలాల్ని బంగారు పాత్రలలో పట్టుకుని **దిగ్హస్తిభిః కనక కుంభ ముఖావ సృష్ట స్వర్వాహినీ విమలచారు జలప్లుతాంగీమ్** అని శంకరాచార్యుల వారన్నట్లు ఆ దిగ్గజాలు, ఆ కనకకుంభాలతో పట్టుకుని వెళ్ళి అక్కడే కూర్చున్న చిన్ని కష్ణుడిమీద ఆ నీళ్ళు పోస్తూంటే, నోరున్నవాళ్ళు ఎవరైనా నన్ను రక్షించమని అడుగుతారు, నా జాతికి చెందిన ఆవులు, దూడలు నోరెత్తి రక్షించమని అడగలేక అంబారావం చేస్తుంటే గోవులను రక్షించావు కనక గోవిందా అన్న నామంతో ఆ రోజున కామధేనువు వచ్చి తన పాలిస్తే ఇంద్రుడు అభిషేకం చేశాడు. గోవిందా అని పిలిచాడు. గోవింద పట్టాభిషేకం. ఏడు రాత్రులు, ఏడు పగళ్ళు కష్టపడితే వచ్చిందా గోవిందనామం. అందుకే **గోవిందేతి సదా స్నానం.** ఆ గోవిందనామం చెప్పుకుంటే చాలు, స్నానం చేసినట్లే.

గోవిందనామం చెప్పుకుంటూ భోజనం చెయ్యాలి. నిశ్శబ్దంగా ఉండాలి. అదే పనిగా మాట్లాడకూడదు యథార్థానికి. ప్రారబ్ధమేమిటంటే ఇంటిపట్టునైతే నడుస్తుంది, మాట్లాడకుండా చెయ్యవచ్చు. బయటికొస్తే పోతుంది. కుదరదు ఎంతమందికి చెప్పుకుంటాం అన్నం తినేటప్పుడు మాట్లాడనని. అప్పుడే మాట్లాడతారు. తీసుకొచ్చి మా మేనమామగారి మూడో అబ్బాయండీ అంటారు. ఎందుకప్పుడది? కాబట్టి భోజనం చేసేటప్పుడు నిశ్శబ్దంగా చెయ్యాలి. ఒక్క గోవిందనామం పలుకుతూ చెయ్యాలి. అలా భోజనం చేస్తే యజ్ఞం చేసినవాడితో సమానం. ఆ ఇల్లు పునీతమవుతుంది. ఆ ఇంట చేసిన సంకల్పాలు నెరవేరుతాయి. ఇక నిద్రపోవడం.

ఇక మిగిలినది ధర్మార్థసమన్వయం. పగటిపూట అర్థసముపార్జన చెయ్యమని చెప్పాడు పరమేశ్వరుడు. ఎప్పుడూ ఆయన్ని భజనచేస్తూ కూర్చుంటే డబ్బు ఎక్కడినుంచి వస్తుంది? అన్నమెక్కడ పుడుతుంది? అర్థసముపార్జన చెయ్యవద్దు అని భగవంతుడు చెప్పలేదు. అర్థం సంపాదించు, డబ్బు సంపాదించు అనే చెప్పాడు. పైగా డబ్బు సంపాదించకపోతే ఎంత దోషమో కూడా చెప్పారు.

**మాతా నిన్దతి నాభినన్దతి పితా భ్రాతా న సంభాషతే ।**
**భృత్యః కుప్యతి నానుగచ్ఛతి సుతః కాన్తాఽపి నా లింగతే ॥**

**అర్థప్రార్థన శఙ్కయా న కురుతే సల్లాపమాత్రం సుహృ్హ్ ।**
**తస్మాన్నైతికమర్థమార్జయ శ్రుణు సఖే, హ్యర్థేన సర్వే వశాః ॥**

డబ్బు సంపాదించకపోతే కొడుకుని అమ్మ కూడా మెచ్చుకోదు. **మాతా విందతి** అమ్మ తిడుతుంది. **నాభినందతి పితా** తండ్రి భుజం మీద చెయ్యేసి అబ్బా, చాలా సంతోషంరా అనడు. **భ్రాతా న సంభాషతే** అన్నదమ్ములు మాట్లాడరు. అయిదుపైసలు సంపాదన లేదు, మాతో గడ్డ పెరుగు తింటానంటాడు. **భృత్యఃకుప్యతి** సేవకులు సేవ చెయ్యరు. పైసా ఇచ్చేది లేదు కానీ మీ అన్నయ్యగారు జీతమిస్తే ఉన్నాను. నువ్వు పెద్ద పనులు చెప్తావు లేవయ్యా అంటారు. **నానుగచ్ఛతి సుతః** తండ్రి ఇంటికొచ్చేటప్పటికి కొడుకు చెంబుతో నీళ్ళు పట్టుకురావాలి నాన్నగారూ కాళ్ళు కడుక్కోండని. కొడుకు రాడు, అయిదు పైసలివ్వడు, చదువు చెప్పించడు ఏం నాన్న అంటాడు. **కాంతాపి నాలింగతే** భార్య కూడా ప్రియమార కౌగిలించుకోదు. **అర్థ ప్రార్థన శంకయా న కురుతే సల్లాప మాత్రమ్ సుహృత్** ఆయన చాలా మంచివాడు, కానీ చూస్తే పలకరించడు, భయం. ఎందుకని? ఎన్నిమాట్లిస్తాడు డబ్బు, కనబడినప్పుడల్లా డబ్బడిగితే? అందుకని అర్థ ప్రార్థన శఙ్కయా న కురుతే సల్లాప మాత్రమ్ సుహృత్. సుహృత్ చాలా మంచి స్నేహితుడాయన. కానీ ఏమోయ్ అనడు. ఇలా చెయ్యెత్తి అనడు. ఎందుకంటే బాబోయ్ డబ్బడుగుతాడని ఇలా పక్క సందులోంచి వెళ్ళిపోతాడు. కాబట్టి **తస్మాత్ నైతికమర్థ మార్జయశ్రుణుసఖే**– ఓ సఖే, ఓ స్నేహితుడా డబ్బు సంపాదించు ఎలా సంపాదిస్తావో తెలుసా? **నైతికమర్థ మార్జయ**. ధర్మాన్ని విడిచిపెట్టకుండా సంపాదించు. ధర్మాన్ని వదిలిపెట్టకుండా సంపాదించింది ఎంతైనా సరే. **అర్థేన**

**సర్వేవశాః** దానివల్ల నీకు సమస్తమూ వశమవుతుంది. అందుకే **విత్తం చ మే** అని రుద్రాధ్యాయంలో ఒక నామం. అందుకే ఇవన్నీ కూడా వేదం సమన్వయం చేసింది రుద్రాధ్యాయంలో.

పరమశివుడికి అభిషేకం చేసేటప్పుడు ఇప్పుడు నేను చెప్పినవన్నీ కూడా మళ్ళీ సూక్తాలలో వస్తాయి. **ఉర్క్చమే, సుహతాశ్చమే, పయశ్చమే, రసశ్చమే** అంటారు. **ఉర్క్చమే** అంటే అన్నం. అన్నం పెట్టడం. ప్రాణధారకం. ఆ అన్నం పెట్టాలి. అన్నం పెట్టకుండా అభిషేకం చెయ్యడం కాదు. అన్నం పెట్టు. అన్నం పెట్టగలిగిన శక్తీ, ఒకడిని పోషించగలిగిన శక్తీ, ఒకడి ప్రాణాలు నిలబెట్టే శక్తీ నాకియ్యి అని అడుగుతారు. **కృష్ణపశ్చంచ్యమే, కృష్ణపశ్చంచ్యమే** అని రెండుమాట్లు తిరుగుతుంది. **అకృష్ణపశ్చంచ్యమే** అని చదవాలప్పుడు. ఇలా గుర్తువేస్తారు. చదివేసేటప్పుడు అలా చదివేసినా. అంటే ప్రయత్నపూర్వక వ్యవసాయం చేత పండే పంటలు పండేటట్టు చెయ్యి. ప్రయత్న పూర్వకవ్యవసాయం చెయ్యకపోయినా అడవిలో కాయలు, దుంపలూ దొరికేటట్టు చెయ్యి. ఎందుకో తెలుసా? అన్నీ విడిచిపెట్టి తపస్సు చేస్తున్న యోగులు, వానప్రస్థులు ఉన్నారు. వాళ్ళకి అన్నం దొరకాలి. అందుకని మేం వ్యవసాయం చెయ్యకపోయినా అక్కడ దొరకాలి. **అకృష్ణపశ్చంచ్యమే.** మేం వ్యవసాయం చేస్తే ఇక్కడ పండాలి ఐశ్వర్యం కోసం. అలా చెయ్యి సుమా అని అడుగుతారు అభిషేకం చేస్తూ. అందుకని అది ఐశ్వర్యకారక అభిషేకం. కాబట్టి అటువంటి స్థితిలో మనుష్యుడు తప్పకుండా భోజనం చేసేటప్పుడు **గోవిందేతి సదా స్నానం.** గోవిందనామం చెప్పుకుంటూ చెయ్యడం పగటిపూట అర్థసముపార్జన చేసేటప్పుడు ధర్మం వ్యతిరిక్తం కాకుండా అర్థం, కామం ధర్మంతో ముడిపడిపోవాలి. ముడిపడిపోయి ధర్మబద్ధమైన అర్థం, కామం. నేను ఈ కోరిక తీర్చుకోవచ్చా? ఒక్కటే ధర్మం అంగీకరిస్తుందా? అంగీకరిస్తుంది తీర్చేసుకో. నేనిలా డబ్బు సంపాదించవచ్చా? ధర్మం అంగీకరిస్తుందా? తీసుకో. నేనిలా డబ్బు ఖర్చు పెట్టవచ్చా? ధర్మం అంగీకరిస్తుందా? ఖర్చు పెట్టెయ్. నేనిలా సుఖపడవచ్చా? ధర్మం అంగీకరిస్తుందా? అంగీకరించదు. చెయ్యకు. నువ్వు చేసేది ధర్మచట్రంలో ఇమిడితే చెయ్యి. ఇమడకపోతే చెయ్యకు. ధర్మచట్రంలో ఇమడకపోయినా చెయ్యాలనిపిస్తే పరమేశ్వరుడికి చెప్పుకో. అదే శరణాగతి. అయ్యో, చెయ్యకూడనివి చెయ్యాలనిపిస్తోంది. తట్టుకోలేకపోతున్నాను.

**రోసీ రోయదు కామినీ జనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్**
**బాసీ పాయదు పుత్ర మిత్ర జన సంపత్ భ్రాంతి వాంఛాలతల్,**
**కోసీ కోయదు నా మనం బకట నీకున్ ప్రీతిగా సత్క్రియల్,**
**చేసీ చేయదు దీని త్రుళ్ళణపవే శ్రీకాళహస్తీశ్వరా!**

అన్నాడు ధూర్జటి. శరణాగతి. బలహీనత పరమేశ్వరుడి దగ్గర చెప్పుకోవడమే శరణాగతి. కాబట్టి శరణాగతి చేసి ఈశ్వరుడి అనుగ్రహాన్ని పొందు. ధర్మంచేత అర్థాన్ని, ధర్మం చేత కామాన్ని ముడివెయ్యాలి. ముడివేసి పగటిపూట అంతా అర్థ సముపార్జనం. సూర్యాస్తమయం అయిపోయిన తరువాత మనుష్యప్రాణికి భోగం. ఆఖరున రాత్రి నిద్రపోయేటప్పుడూ? నిద్ర లేచేటప్పుడు శ్రీహరీ, శ్రీహరీ, శ్రీహరీ అని ప్రకటంగా పైకంటూ లేవాలి. నిద్రపోయేటప్పుడు పదకొండు మాట్లు ప్రకటంగా శివా, శివా, శివా అంటూ పడుకోవాలి. ఎందుకని? శివకేశవుల సమన్వయంలోనే నీ జీవితం నడుస్తుంది. తిన్నదంతా జీర్ణమై రాత్రి నిద్రపోతే ఇంద్రియాల బడలికంతా శివానుగ్రహంతో తీరుతుంది. విష్ణువు అనుగ్రహంతో ధర్మంవైపు ఇంద్రియాలన్నీ పనికొస్తాయి. పగలూ, రాత్రీ కూడా శివ కేశవుల అనుగ్రహంగా నీ జీవితం సంతోషంగా ఉంటుంది. అలా బ్రతికినవాడెవడున్నాడో వాడు, భక్తి అన్న మాటకి అర్థమేమిటంటే ఏది చేస్తున్నా తన శక్తికి మూలాన్ని తలుచుకుంటాడు.

అదే శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో చెప్తారు. ఆయన ఏ పనిచేస్తుండనివ్వండి దీనికి మూలమెక్కడుందీ అని విచారణ చేస్తారు. నేనిప్పుడు ఉపన్యాసం చెప్పాననుకోండి, ఉపన్యాసం కోటేశ్వరరావుగారు చెప్పారంటారు. కోటేశ్వరరావు ఏం చెప్తాడు? కోటేశ్వరరావు ఊపిరి పీలిస్తే కదూ మళ్ళీ ఊపిరి వాక్కుగా మారడం. కోటేశ్వరరావుచేత ఊపిరి తీయించి, ఆ ఊపిరి లోపల నిలబెట్టి నా మనస్సులో ఏదో ఆలోచన కలిగితే మూలాధారచక్రం దగ్గరి నుంచి కదిలిన వాయువు పైకొచ్చి సహస్రారం దగ్గరకెళితే, ఇలా వెళ్ళకూడదని వాయువుని వెనక్కి తోసేస్తే, నాలుక కదులుతున్నప్పుడు గాలి దానిచేత నొక్కబడి, సొట్టలు పడి అక్షరాలై, అక్షరాలు పదాలై, పదాలు వాక్యాలై, ఆ వాక్యాలు నాలో ఉన్న భావాన్ని పట్టుకుని బయటికొస్తే శబ్దస్వరూపంగా మీ చెవులలోకెడితే, నేనన్నది మీకర్థమైతే **సభాభ్యః**

**సభాపతిభ్య శ్చభో నమో నమః**. దానివల్ల ప్రయోజనం నెరవేరింది. ఇప్పుడిదంతా నడిపిందెవరు? పరదేవత, ఆ అమ్మవారు చేయిస్తోంది. కాబట్టి ఏది చేస్తున్నా శక్తి ఎక్కడిదీ అని తలుచుకున్నవాడెవరున్నాడో వాడు చేస్తున్నదంతా ఈశ్వరపూజే. వాడు తిన్నాడు. పరమేశ్వరుడే తినిపించాడన్నాడు. జీర్ణం చేసినవాడు ఈశ్వరుడు. విసర్జింప చేసినవాడు ఈశ్వరుడు. రాత్రి నిద్రపట్టించినవాడు ఈశ్వరుడు. రేపు ఆఫీసుకు వెళ్ళి పెన్ను పట్టుకుని ఇలా రాసి నెలకు యాభైవేలు జీతం పుచ్చుకుంటున్నానంటే, ఈ చెయ్యి ఇలా కదిలేటట్లు మనసులో ఆ ఫైలులో ఏది రాయాలో అది ప్రచోదనం చేసినవాడు పరమేశ్వరుడు. ఆయన్ని తలుచుకుంటూ చేస్తే చాలు. ఈ శక్తికి ఆయన కారణం అని నువ్వు గుర్తించగలిగితే చాలు. అదే భక్తి. మనసు అలా భక్తితో పండిపోతే ఒక అద్భుతమైన స్థితిని పొందుతాడు. నేను ఈ ఉపన్యాసాలలో ఎక్కువగా చెప్పలేకపోతున్నాను కానీ లఘుస్పర్శ చేస్తాను.

అంటే ఆ ధ్వజస్తంభాన్ని చల్లగా తగలడం తలెత్తి ఇలా చూసేటప్పటికి నర్తనచేస్తున్న నటరాజమూర్తి, పక్కన ఇలా సోయగంగా నిలబడిన పార్వతీదేవి, ఈ పక్కన చిన్న టోపీ పెట్టుకుని మాణిక్యవాచకర్, ఎదురుగుండా శనగల బసవన్నా, అది దాటి అలా కొంచెం ముందుకెళ్ళి కుడిపక్కన నడుస్తుంటే ఇలా తలెత్తి చూస్తే దక్షిణామూర్తి, ఇంకొంచెం ముందుకెళితే మహానుభావుడు ఇలా త్రిశూలాన్ని భుజాల మీద వేసుకుని నిలబడిన భిక్షాటనమూర్తి, చెయ్యి ఇలా పెడితే జింక ఆయన చేతిలోకొస్తున్న స్వరూపం, పక్కన నిలబడిన ఋషిపత్నులు, వాళ్ళు తెచ్చిన భిక్షాన్నం, ఎదురుగుండా ఉన్న పూలతోట, అందులో ఉన్న అర్జునవృక్షం, అదే పరమశివస్వరూపమని శంకరాచార్యులవారు **సంధ్యారంభ విజృంభితం** శ్లోకంలో చెప్పారు. అక్కడే పండితారాధ్య మఠం, దానిముందు ఉన్న పెద్ద బిల్వం, ఆ రావిచెట్టు, రావిచెట్టు మధ్యలో నుంచి పుట్టిన మామిడిచెట్టు, మామిడిచెట్టు మధ్యలో నుంచి రావిచెట్టు, ఆ కిందనుంచి బిల్వం పైకిలేచి ఈ రెండింటికీ తగులుతూ బిల్వవృక్షం, అక్కడే ఉన్న ఛత్రపతి శివాజీకి ఖడ్గప్రదానం చేస్తున్న మూర్తి, అక్కమ్మగారి గొప్ప విగ్రహం, అటుపక్కన ఉన్న ఛత్రపతి శివాజీ కట్టించిన దక్షిణ ద్వారం, అక్కడనుంచి మెట్లుదిగి కిందకొచ్చి శ్రీశైలదేవాలయం ఆ ప్రాకారం వంక ఒక్కసారి ఇలా చూస్తే దేవాలయం బంగారు తొడుగు,

దానికి మెట్లుమెట్లుగా ఉన్నచోట శివలింగాలు, ఆ మండపం పైనంతా ఎక్కడ చూసినా నందీశ్వరులు, ఇలా కుడిపక్కకి తిరిగితే ఎడమ పక్కకి చూసేటప్పటికి వరుసగా తొమ్మిది దేవాలయాలు గోపురాలతోటి అష్టమూర్తితత్త్వంతో ఎనిమిది శివలింగాలు, పృథివీ, ఆపస్, తేజో, వాయురాకాశాలు అయిదు, సూర్యుడు, జీవుడు, యజమానలింగంతో కలిపి ఎనిమిది, మోక్షలింగంతో కలిపి తొమ్మిది గుడులు, ఆ చివర అక్కమ్మగారి దేవాలయం. ఇటు పక్కకి కుడిపక్కకి చూస్తే పంచపాండవులు ప్రతిష్ఠించిన లింగాలు అర్ధనారీశ్వర దేవాలయం, వీరభద్ర దేవాలయం.

అలా ముందుకెళ్ళి ప్రదక్షిణంగా మళ్ళీ కుడిపక్కకి తిరిగితే అనేకబాహువులతో ఆయుధాలు పట్టుకున్న వీరభద్రస్వామి. ఇలా ఎడమ పక్కకి తలతిప్పితే ఉత్తరద్వారం. ఎదురుగుండా స్వామివారి అద్దాల మండపం. కొంచెం ముందుకెళ్ళి ఇలా తల తిప్పితే, ఒకనాడు శిఖరం దగ్గర పరమేశ్వరుణ్ణి చెయ్యి పట్టుకుని పైకిలాగుతూ నాకు పాపంలేదు శిఖరం చూశాను కాబట్టి అని చెప్పిన వేశ్య రెండు కళ్ళతో విగ్రహంగా అక్కడే ఉన్న స్థితి. అక్కడ నుంచి ఇలా చూస్తే సరస్వతీకుండం. కొంచెందాటి ముందుకు వెళితే శంకర భగవత్పాదులని కాపాడిన లక్ష్మీనృసింహ స్వరూపం. ఆ ఎదురుగుండా ఉన్న వృద్ధ మల్లికార్జునుడు. కొంచెం ముందుకెళ్ళి కుడిపక్కకి తిరిగి నిలబడితే ఆ త్రిఫలవృక్షం, రావిమర్రి, మేడి, రావిజువ్వీమేడి కలిసిన త్రిఫలవృక్షం– పెద్ద చెట్టు, దానిచుట్టూ కట్టిన వేదిక, దానిపక్కన రామచంద్రమూర్తి ప్రతిష్ఠించిన సహస్రలింగం. ఎడమ పక్కకి ఇలా చూస్తే రాజరాజేశ్వర దేవాలయం.

కొంచెం మళ్ళీ ముందుకెళితే ఆ క్యూలో వెళుతున్న భక్తులు, అలా వెళ్ళి ప్రదక్షిణంగా ఆ పక్కన ఉన్న ద్వారంలో నుంచి లోపలికెళితే రత్నగర్భ గణపతి. ఆయన్ని దాటితే ఎదురుగుండా ఉన్న గణపతిని దాటి అంతరాలయంలోకి వెళితే నా రెండు చేతులతో పట్టేసే చిన్న జ్యోతిర్లింగం. అక్కడ కూర్చుని నా భార్య బంగారు చెంబుతో అందిస్తుంటే ఆవుపాలు పోస్తూ నేను రుద్రం చెప్తుంటే దోమతెర పెట్టినట్లుగా తెల్లని పాలు కప్పేస్తుంటే, మళ్ళీ కొంచెం మంచినీళ్ళు పోస్తే లింగం కడగబడితే, మళ్ళీ కాస్త పెరుగుతీసి ఎత్తి పొయ్యకుండా దగ్గరగా పెట్టి

పోస్తే బిళ్ళలు బిళ్ళలుగా పడి లింగమంతా తెల్లటి బిళ్ళలుగా కప్పబడింది. మళ్ళీ నేను మంచినీళ్ళు పోసి తేనె తీసి పోస్తుంటే చిక్కగా ఎర్రగా తెర పట్టినట్టుగా కిందకి జారి ముద్దగా అయింది. అది చుట్టూ పట్టుకుని ఉండి లోపల్నించి నల్లగా లింగం కనబడుతూంటే చమత్కారంగా ఉన్న ఆ స్వరూపాన్ని చూసి మళ్ళీ శుద్ధజలం పోసి, దానిమీద చక్కెర పోసేస్తే చక్కెర గోడుగా ఆ శివలింగాన్ని కప్పేస్తే మళ్ళీ నీళ్ళు పోస్తే కన్నం పడుతూ ఆ పంచదారంతా కిందకి దిగిపోతుంటే శివలింగం బయటికొచ్చింది.

ఆ విధంగా నేను పాలు, పెరుగు, నెయ్యి పోసినప్పుడు చిక్కగా ముద్దగా అది దిగి దానిమీద నీళ్ళు పోసినప్పుడు అది తొందరగా కిందకి దిగకుండా ముద్దలు ముద్దలుగా పట్టుకుంటే ఆ పక్కన కూర్చున్న వ్యక్తి శివలింగాన్ని ఇలా కడిగేస్తుంటే ఆఖర్న శివలింగాన్ని తుడిచేసి బట్ట కట్టి, విభూతిరాసి, గంధం పెట్టి, బొట్టు పెట్టి మారేడుదళాలతో, తుమ్మి పూలతో పూజ చేసి మోకాళ్ళ మీద వంగుని నా శిరస్సు శివలింగానికి తాకించుకుని దానికున్న విభూతి తీసి నేను పెట్టుకుని, బొట్టుపెట్టుకుని బయటికొచ్చి నందీశ్వరుని దగ్గర నిర్మాల్యవిసర్జనం చేసి అర్చకులిచ్చిన తీర్థం తీసుకుని ప్రసాదం పుచ్చుకుని పక్క ద్వారంలో నుంచి బయటికొచ్చాను. అటుపక్క మళ్ళీ పంచపాండవ లింగాల పక్కనుంచి వచ్చి మెట్లెక్కుతూ భ్రమరాంబాదేవాలయానికి వెళుతుంటే కుడిపక్కన ఉన్న పూలతోటలో భ్రామరీవనంలో ద్రౌపదీదేవి ప్రతిష్ఠించిన లింగం. ఎడమ పక్కన సీతాదేవి ప్రతిష్ఠించిన సహస్రలింగం దాటి కొంచెం ముందుకెళ్ళి అమ్మవారి దేవాలయంలోకి ఎడమపక్క నుంచి లోపలికి వెళుతుంటే అద్భుతమైన శిల్పాలు, సింహాల నోట్లో తిరిగే బంతులు, పళ్ళాలు పట్టుకుని అందులో అరటిపళ్ళూ, పువ్వులు పట్టుకున్న కాంతలు, రామచంద్రమూర్తి పట్టాభిషేకం, పట్టాభిషేకానికి వచ్చిన వానరసైన్యం, ఆ వెనుక భ్రామరీనాదం వినబడే ఆ ప్రత్యేకమైన జాగా, అది చూస్తూ అలా తిరిగొచ్చి ఆలయం లోపలికి వెళితే ఇంతింత తెల్లటి కళ్ళూ, నల్లటి గుండ్రం గుడ్లు, ఇలా పక్కకి కట్టిన చీరతో భ్రమరాంబ. ఎదురుగుండా పెద్ద పెద్ద శ్రీచక్రాలూ, మేరువులు, లోపల బాగా కూర్చున్న, అమ్మవారిలాగే కూర్చున్న అర్చకస్వామి. ఇలా ఎడమపక్కకి తలెత్తిచూసి నవ్వి కోటేశ్వరరావుగారొచ్చారని

మురిసిపోయి పెద్ద నీరాజనం పరికరం పట్టుకుని హారతి ఇలా అమ్మవారికిస్తుంటే, ఆ వెలుతురులో అమ్మవారిని చూసి ఆ నీరాజనపరికరం ఉప అర్చకుడికిచ్చాను. ఆయన ఇలా పెడితే దాన్ని కళ్ళకద్దుకుని ఆ పైన రాజద్వారం మీద అమ్మవారి గాజు పేటిక ఇలా తెరిస్తే, అందులో మహిషాసురమర్దనీస్వరూపంగా అమ్మవారుంటే ఇదే భ్రమరాంబ నిజస్వరూపమని నమస్కారం చేసుకున్నాను.

కొంచెం బయటికొచ్చి ఇలా ముందుకెళుతుంటే అక్కడ ఎదురుగుండా నవ నారీకుంజరం తొమ్మండుగురు ఆడవాళ్ళు ఏనుగుగా మారిపోయి నర్తన చేస్తున్న ఆ స్వరూపాన్ని చూసి అక్కడ ఉన్న పద్మాలు, లతాకన్యలు, హంసలు, శివస్వరూపం, అన్నపూర్ణా, పరమశివుడికి అన్నం పెడుతున్న రూపం, ఆ శిల్పవైభవాన్నంతటినీ చూసి, అ పక్కన ఉన్న తెల్లటి పూలచెట్టుకిందకెళ్ళి కూర్చుని చండీహోమం జరిగే మండపం చూశాను, చక్కగా ప్రసాదం పుచ్చుకున్నాను. నేను అక్కడ్నించి మళ్ళీ భ్రమరాంబాదేవాలయం నుంచి బయటికొచ్చి ఈ ప్రసాదాన్నంతా మా ఆవిడకిచ్చి బయటికొచ్చేస్తున్న సన్నివేశాన్నంతటినీ నేను ఆలోచించుకుంటుంటే ఎవరో టీ.వి పెట్టి పెద్ద చప్పుడు విని బహిర్ముఖుడియ్యాననుకోండి. నేను మానసికంగా శ్రీశైలక్షేత్రం వెళ్ళిపోయానా, లేదా? వెళ్ళిపోయి శ్రీశైలదర్శనమంతా చేసి మల్లికార్జునుడికి అభిషేకం చేసేసుకుని భ్రమరాంబ దర్శనం చేసుకొచ్చేశానా, లేదా? మీరు పూజ చేసేటప్పుడు మనసు నిలబెట్టడం కష్టమేమో కానీ, మనసు మీ వశంలోకొచ్చేస్తే ఎటు వెళ్ళమంటే అటెళ్ళిపోతుంది. ఎక్కడ దర్శనం చెయ్యమంటే అక్కడికెళ్ళిపోతుంది. నేను మీతో యథార్థం చెప్తున్నాను. పరమేశ్వరుడు ఇప్పుడు ఈ క్షణంలో మనందరమూ కూడా ఈ పుష్యమాసంలో దక్షిణాయన పుణ్యకాలంలో చిట్టచివరికొచ్చేస్తుండగా మొట్టమొదటి తిథి నాడు ప్రదోషవేళ దాటిన తరువాత ఇన్ని వేలమందీ శ్రీశైలంలో మలికార్జున, భ్రమరాంబల దర్శనం చేసేస్తారని వేసేస్తారు. ఎందుకంటే మానసికంగా చేసిన అర్చన అంత శక్తిమంతమైనది. ఏ పరికరాలూ లేకుండా మనసుతో చేస్తాడు.

శంకర భగవత్పాదులు అందుకే–

**రత్నైః కల్పిత మాసనం, హిమజలైః స్నానం చ దివ్యాంబరం**
**నానా రత్న విభూషితం మృగమదామోదాంకితం, చందనమ్।**

**జాజీచంపక బిల్వ పత్ర రచితం, పుష్పం చ ధూపం తథా,**
**దీపం దేవ! దయానిధే! పశుపతే! హృత్కల్పితం గృహ్యతామ్॥**

ఈశ్వరా, మనసుతో సృజించి నీ పూజ చేస్తున్నాను అంటాడు. అలా చేసిన వాడెవరున్నాడో వాడి పూజ ఈశ్వరుడికి అందుతుంది. మనసు వశవర్తి అవుతుంది. ఎక్కడ చూడమంటే అక్కడ చూస్తుంది. ఎక్కడికెళ్ళమంటే అక్కడికెళుతుంది. అలా అయినవాడు ధన్యుడు. వాడు చిట్టచివర భగవన్నామస్మరణతో, భగవద్దర్శనంతో శరీరాన్ని విడిచిపెట్టి ఈశ్వరునియందు ఐక్యమైపోతాడు. కాబట్టి పూజ చివరికి మానస పూజగా, స్మరణలు ఈశ్వరస్మరణలుగా మారిపోతాయి.

## శ్రీశైల రగడ

శ్రీరమ్యంబుగ శ్రీగిరియాత్రకు
కూరిమి సతితో కూడి నడచితిని

పల్లెలు పురములు పట్టణంబులు
పేటలు దాటితి అడవులు కొండలు అన్నీ దాటితి

కంటిని శ్రీగిరి కన్నుల నిండా
వింటిని మహిమలు వీనుల నిండా

ఆ మహిమలు నేనేమని చెప్పుదు
ఈ మహిలోపల ఎన్నడు చూడము

ధారుణి లోపల ధౌతాచలమది
మేరుని కంటెను మిక్కుట మైనది

బ్రహ్మ నిర్మల బ్రహ్మ శృంగంబుల
నిర్మలమగు మాణిక్య కూటములు

కోటలు కొమ్మలు గోపురంబులు
తెరపిలేని బహు దేవాలయములు

పుణ్య స్థలంబులు పుణ్య వనంబులు
వాటమైన పూదోటలు మిక్కిలి

మాటలు నేర్చిన మంచి మృగంబులు
కామ ధేనువులు కల్ప వృక్షములు

క్షేమ కరంబగు చింతామణులు
అమృత గుండంబులు

కడు నైష్ఠికమును కలిగిన విప్రులు
విడువక శంభుని వేడెటి రాజులు

సంతత లింగార్చన గల శైవులు
శాంతులైన వేదాంతులు సిద్ధులు

ఘనఘన మ్రోగెటి ఘంటనాదములు
విజయ ఘోషయగు శంఖ నాదములు

వీర శైవులు వీరాంగంబులు
సాధు బృందములు కామిత భక్తులు

అగరు ధూపములు

జపములు చేసెటి జంగ మోత్తములు
తపములు చేసెటి తాప సోత్తములు

ప్రమథులు భక్తులు శైవ గణంబులు
గట్టిగ ఇది భూ కైలాసమ్మని

తప్పిపోక పాతాళ గంగలో
తెప్పున తేలుచు తీర్థంబాడుచు

చెలగుచు మడి వస్త్రంబులు కట్టితి
అనువుగ నుదుట విభూతి ధరిస్తిని

పొలుపుగ మెడ రుద్రాక్షలు దాల్చితి
గురు కటాక్షమును గోప్యము చేసితి

గురు మంత్రంబును జపమును చేసితి
అకలంకుడనై ఆశ జయిస్తిని

శివ పంచాక్షరి మనసున నిలిపితి
శివ తత్త్వము పరిశీలన చేసితి

పంచేంద్రియంబులు పదిలము చేసితి
పంచ ముద్రలభ్యాసము చేసితి

అంతర్ముఖుడనైతిని, నాద బ్రహ్మ నాదము
వింటిని లోపల తుమ్మెద నాదము వింటిని

వెలుగులకెల్లా వెలుగై వెలిగెడు
ఆ లోపల దీపము కంటిని

ఈవల చంద్రుండావల సూర్యుడు
కలిగిన స్థావరమైన నిధానము కంటిని

కంటికి ఇంపగు పండు వెన్నెల
విరిసిన షట్కమలంబులు షట్ స్థలంబులు
పిండాండములో బ్రహ్మాండము కంటిని

అంతట అక్కడ చెంగల్వ కొలనులో
ఆడుచున్న రాచంసను పట్టితి

చాల వేయి స్తంభాల మేడలో
బాలిక కూడుకు కేళి సలిపితిని

మల్లికార్జునుని మదిలో దలచితి
ముందర భృంగికి మ్రొక్కి వేడితిని

నందికేశ్వరుని నమ్మిభజించితి
చండీశ్వరునకు దండము పెట్టితి

మళ్ళీ మళ్ళీ మహిమను పొగడుచు
పిళ్ళారయ్యకు ప్రియముగ మ్రొక్కితి

ద్వార పాలకుల దర్శన మాయను
ద్వార మందు రతనాల గద్దెపై

చూచితి నెవ్వరు చూడని లింగం
చూచితి కేవల సుందర లింగం

నిరుపద్రవమగు నిశ్చల లింగం
ఆదితేజమగు ఐక్య లింగం

రాజితమైన విరాజిత లింగం
పూజనీయమగు పురాణ లింగం

లింగము గనుగొని లింగ దేహినై
లింగాంగులతో లింగ నిర్గుణ సంగతి కంటిని

లింగమందు మది లీనము చేసితి
జీవన్ముక్తుడనైతిని

అంకమంది భ్రమరాంబిక ఉండగా
మల్లికార్జునుని కోరి పూజించితి

దీపము పెట్టితి దివ్య దేహునకు
ధూపము వేసితి ధూర్జటి కప్పుడు

తుమ్మి పూలతో పూజిస్తిని
కమ్మని నైవేద్యము పెట్టితి

సాగిలి మ్రొక్కితి సర్వేశ్వరునకు
జయ జయ జయ జయ జంగమరాయ

ఆదిదేవుడవు ఆత్మ శరణ్య
దయ తప్పక ధవళ శరీర
భయము బాపు మీ భక్త నిధాన

ఎన్ని జన్మములు ఎత్తిన వాడను
నిన్ను తలంపక నీచుడనైతిని

ఎన్నడు ఏ విధమెరుగని వాడను
దుష్ట మానసుడ గౌరీ రమణ

తామస గుణములు తగులాటంబులు
నియమము తప్పిన నీచవర్తనుడ
నిత్య దరిద్రుడ అత్యాశయుడను అజ్ఞాన పశువును

చేయరాని దుశ్చేష్టలు చేసితి
బాయరాని మీ భక్తుల బాసితి

సంసారంబను సంకెళ్ళల్లో
హింస పెట్టకిక ఏలుమి తండ్రి

ముల్లోకంబులు ముంచెడి గంగను
సలలితముగా జడ ధరియిస్తివి

గొప్ప చేసి నిను కొలిచిన బంటును
తప్పక చంద్రుని తల ధరియిస్తివి

విన్నుని చేతను కన్ను పూజగొని
సన్నుతి కెక్కిన చక్ర మిచ్చితివి

ఆనక శైల కుమారిక కోరిన
సగము శరీరము ఇస్తివి

మూడు లోకముల ముఖ్యము నీవే
మూడు మూర్తులకు మూలము నీవే

దాతవు నీవే, భ్రాతవు, నీవే, తల్లివి నీవే, తండ్రివి
నీవే, బ్రహ్మము నీవే, సర్వము నీవే

పాల ముంచుమిక నీట ముంచు మీ
పాల బడితినో ఫాలలోచన
అనుచు ప్రణతులనిడుచు
ఇది చదివిన వారికి

అని ఈ శ్రీశైల రగడను పాడినా, చదివినా విన్నవారలకు కాలువలు త్రవ్వించి వేసి పూలు కోసి గన్నేర్లు శివునకు పూజించిన ఫలము, గంగి గోవులు తెచ్చి ప్రేమతో సాకి పాలు పితికి అభిషేకము చేసిన ఫలము, ఆకలితో నున్న అన్నార్తులకును కమ్మని భోజనంబిచ్చిన ఫలము, భీతితో నున్నట్టి కదుదీనులకును శరణిచ్చి రక్షించు విశేషఫలము అంతకన్నా ఫలము అధికమైయుండు.

అని మానసికంగా శ్రీశైలం వెళ్ళిపోతారు.

★ ★ ★